# గౌరీ రామాయణము



చాగంటి గౌరీదేవి

# గౌరీ రామాయణము

THIS BOOK IS PUBLISHED
WITH THE
FINANCIAL ASSISTANCE OF
TIRUMALA TIRUPATHI DEVASTHANAMS,
UNDER THEIR SCHEME AID TO PUBLISH
RELIGIOUS BOOKS

బాగంటి గౌరీదేవి
గ్రేడు వాంటి పండిట్ (రిటైర్డ్)
ఆర్ ఎ యమ్ హైస్కూలు
పెదబొడ్డేపల్లి వయా నర్సీపట్నం
విశాఖపట్నం జిల్లా

# గౌరీ రామాయణము

## ముందుమాట

శ్రీమద్రామాయణ మహాకావ్యము దేవభాషయగు సంస్కృతమున లిఖింపబడి భారతీయ ప్రాచీనసాహిత్యమున ప్రప్రథమస్థాన మలంకరించి లోకపూజ్యమును పరమ పవిత్రమునై నేటి సాహితీ లోకమున మకుటాయమానమై యలరారుచున్నది

శ్లో - చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరం
ఏకైక మక్షరంప్రోక్తం మహాపాతకనాశనమ్

అని మనపూర్వకవులచే ప్రశంసింపబడినది రామాయణము శ్రీరామునిచరిత్రము ఆసేతుశీతాచలము ఆబాలగోపాల హృదయములలో సకలజనహృదయవ్యాప్తమై వెలుగొందగల శక్తిప్రవత్తులతోనిండియున్నది ఆదికవివాల్మీకి మహాముని విరచితమగు నీకావ్యము యుగయుగములనుండి సాహిత్యమున ఆదిపూజలందుచున్నది ఎవరెన్నిభాషలలోననువదించినను మధురాతిమధురమై భాషలువేరైనను భావమాధురిమ ద్విగుణీకృత మగుచుండును తెలుగుభాషలోనున్న రంగనాథరామాయణము-ను భాస్కరరామాయణము ను మొల్లరామాయణము నుఆధునికసాహిత్యమున కవిసామ్రాట్ బిరుదునందిన శ్రీవిశ్వనాధసత్యనారాయణగారి రామాయణకల్పవృక్షము ను ప్రసిద్ధికెక్కిన గ్రంధరాజములు ఇంకనుఅనేకమందిపద్య గద్య గేయ రూపములలో తమతమ భావపటిమను జొప్పించి రామాయణమును వ్రాసిరి కొంతమంది విషవురుగులవోలె కల్పవృక్షము వంటిరామయణమును విషవృక్షము జేయసంకల్పించినను సువర్ణమునకుజెదలుబట్టునా? శ్రీరామాయణమహాకావ్యము సువర్ణ కల్పవృక్షమై యుగయుగముల నుండియేగాక యుగయుగముల వరకును పాఠకులకు జ్ఞానజ్యోతిని అందించి ఆదర్శంబునువెలయించి

భారతీయులకు మార్గదర్శకమై యలరారుచున్నది

శ్రీరాముడు నా ఆరాధ్యదైవము రామాయణమందలి యేఘట్టము జదివిన నాకమందానందముగలుగును అందువలననే నాభాషాశక్తిననుసరించి వ్రాయ సంకల్పించితిని మానాయనమ్మగారును మాఅమ్మగారును రామాయణమంతయు గేయరూపమున బాడెడివారు దానినాధారముజేసికొనియే శ్రీరాముని చరిత్రను గౌరీరామాయణము ను పేర వ్రాయసాహసించితిని ఇప్పటిదేశకాల పరిస్థితులననుసరించి నేటిపాఠకసమాజములో డిగ్రీలుపొందినవారైనను పద్యములనగానే అర్థముగావనునభిప్రాయముతో పద్యకావ్యములను జూడకున్నారు తెలుగుభాషలోనున్న మనరామాయణ భారత భాగవతగ్రంధము లందలి పద్యముల నర్థముజేసికొన నశక్తులగుచున్నారు అందరికిని దెలియునటుల గద్యములోనుండవలెనుగాని పద్యము లెవరికి దెలియునను మాటలు నేడువినవచ్చుచున్నవి మహాకవుల కావ్యపటిమ గాని శబ్దభండారము గాని లేని నావంటివారికీ సమాజముగూడ సహకరించినందున తేలికగా నర్థమగు పదజాలముతో సులభశైలితో నాభాష నడిచినది పండితప్రకాండులకిది హాస్యాస్పదమగుననుటకు సందియములేదు

వావిలికొలనుసుబ్బారావుగారి వాల్మీకి రామాయణమును భాస్కర రామాయణము ననుసరించుచు ఇంకనునాకుదెలిసిన వాఙ్మయమునందలి చరిత్రలను గూడ నిందు జొప్పింప సాహసించితిని పెద్దలు నాయీసాహసమును మన్నించి నాకు ప్రోత్సాహమిచ్చెదరని ఆశించుచున్నాను నాయీ గౌరీరామాయణము కలకాలము పాఠకుల మెప్పుబొందునట్లు ఆశ్రీరామచంద్రుడే అనుగ్రహించునని విశ్వసిస్తూ ఆభారమా శ్రీరామునకే అప్పగించుచున్నాను

## శ్రీరామాయణము మహాకావ్యము —

శ్రీరామాయణమహాకావ్యము పుట్టువుచేతనే గాక గుణముచేతను

మొదటిది గీర్వాణ భాషాసీమంతినికి రామాయణము శిరభూషణమేగదా! శ్రీరాముడు భూలోకములో మనుష్యుని వలెనటించిన భగవంతుడే యని వాల్మీకియే పేర్కొనెను రామయణమనగ లక్ష్మీరమణుడైన శ్రీమన్నారాయణుని మాయామానుషావతారమైన శ్రీరాముని చరిత్రయనియు మహాలక్ష్మి అవతారమైన సీత దేవి చరిత్ర అనిఅర్థము

శ్లో - సహదేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభిః
అర్థితో మానుషేలోకే జజ్ఞేవిష్ణుః సనాతనః
సీతయాశ్చరితం మహత్
అని మహాత్ములే కీర్తించిరి

## శ్రీరామాయణము ధర్మశాస్త్రము —

ఇందు రాజధర్మము ప్రజాధర్మము పితృధర్మము పుత్రధర్మము భ్రాతృధర్మము మిత్రధర్మము భృత్యధర్మము పతిధర్మము సతీధర్మము మొదలగు పరమధర్మములు చెప్పబడినవి లాభ లోభ పక్షపాత బుద్ధిలేక న్యాయమునందే బుద్ధిని నిల్పెడి న్యాయవాది ధర్మము గూడ నిందు చెప్పబడినది ఈకావ్యమందలి నాయకుడైన రామునికి రాజునకుండవలసిన సద్గుణములేగాక సాధారణముగ ప్రతిమనవునకు ఉండవలసిన సత్యము దయ ఇంద్రియనిగ్రహము పితృభక్తి సౌభ్రాతృత్వము ఏకపత్నీనియమము దైవభక్తి దేవతారాధన నిత్యకర్మానుష్ఠానము మొదలగు సద్గుణములు నిరూపింపబడి ఆదర్శపురుషోత్తమునిగా వాల్మీకియేనెలకొల్పెను

## రామాయణము మంత్రనిధానము —

ఇందనేకమంత్రములున్నవి అందువలననే పారాయణమొనర్చువారు అంగన్యాస కరన్యాసములతో విధిగావరించి ఇష్టార్థంబులు

బడయుదురు సుందరకాండ పారాయణజేసి కార్యసిద్ధినందుట జగద్విదితము

## రామనామమహిమ —

శ్రీరామ రామ రామేతి రమే రమే మనోరమే
సహస్ర నామ తస్తుల్యం రామనామ వరాననే

ఈమహామంత్రరాజము భారతదేశమున యుగయుగములనుండియు జగద్విదితమై వెలుగొందుచున్నది భక్తవరులు నియమ నిష్ఠలతో జపింతురు సామాన్యజనులు నిత్యకర్మలలోగూడ శ్రీరామచంద్రా అనుకొను చుందురు కష్టసుఖములలో గూడ రామ యనుపదమును వాడుదురు శారీరక(శమతోజీవించు (శామికులు రామచంద్రా అను రామనామమును ఊతపదముగా వాడుదురు ఆసేతుశీతాచలము ఆబాలగోపాలము నేటను రామనామము పలుకబడుచుండును అట్టి మహిమాన్వితమైనదీరామనామము రామనామము రామమంత్రము రామబాణము రామరక్ష, రామరాజ్యము అనునవి భారతీయుల హృదయములనంటి అలవాటుపడినవి

జగమంతారామమయం అంటూ గురుముఖతః రామతారక మంత్రము గ్రహించి జపించి జన్మచరితార్థం జేసికొంటారు మహత్తరకార్యముల సాధించుటకై జేసిన ప్రయత్నమును రామబాణమై పనిజేసినదనుట కద్దు జన్మించిన శిశువునకు స్నానము జేయించి శ్రీరామరక్ష అని రక్షబెట్టుట మనభారతీయుల ఆచారము ఈతి బాధలులేక రోగ చోర భయంబు లెరుంగక అకాల మరణములు లేక సుఖశాంతులతో నున్న ప్రజలను సస్యశ్యామలముగా నున్నదేశమునై విలసిల్లిన ఆనాటి రామరాజ్యమును నెలకొల్పుటకై ఈనాటికిని ప్రయత్నములు జరుగుచునే యున్నవి స్వతంత్ర భారతదేశమున రామరాజ్యము నెలకొల్పవలెనని మనజాతిపిత మహాత్మాగాంధీగారి ఆకాంక్ష రామరాజ్యాన్నిస్థాపించుటకే గ్రామ

రాజ్యాలేర్పడెను

పురాణకాలమున గుడ రామ నామము గురించి పేర్కొనబడినది నారాయణమంత్రము నందలి రా పంచాక్షరీమంత్రము నందలి మ అను బీజాక్షరముల నెంచి రామ శబ్దమును సృష్టించినట్లు జెప్పుదురు శ్రీపరమేశ్వరుడు పార్వతీదేవికి రామ నామము తారకమంత్రముగా నుపదేశించినట్లు పురాణకధనము

అరిషడ్వర్గమునుజయించి సదాభగవన్నామమునేజపించు మహాత్ములు పొందుమోక్షమును సంసారసాగరమున మునిగిదేలు సామాన్య మానవులకసాధ్యముగదా! అందులకే సామాన్యులు తరించగలుగుటకే పెద్దలు రామ నామము నందించిరి భారతదేశమున ప్రాచీనకవులును ఆధునికకవులును గూడ రామనామమును వేనోళ్లగొనియాడిరి నేటివైజ్ఞానికయుగమున గూడ విదేశములలో హరేరామ హరేకృష్ణ భక్తసంఘము లేర్పడెను

అట్టి మహామంత్రరాజమగు రామ నామమునకు ఆధారమును అధిష్టానమును అగు శ్రీరాముని చరిత్ర వినని వారు నభూతోనభవిష్యతి అన అతిశయోక్తిగానేరదు అట్టి మహాత్ముని చరిత్రను గౌరీరామాయణమను పేర వ్రాయు నాసంకల్పము చిరుతెప్పతో సముద్రమును దాటప్రయత్నించుటయే అయినను నాకోరిక నెరవేర్చుకొనుటకై యథాశక్తి ప్రయత్నింతును

శ్రీరామాయణ గాధకు సంబంధించినవియు జన బాహుళ్యమున ప్రచారములోనికి రాని కొన్నికధావస్తువులను ఇతర ప్రాచీనగ్రంథముల నుండి సేకరించి నాయీ 'గౌరీరామాయణము లో కొన్ని ఘట్టముల వద్ద సందర్భములను గల్పించి అందు జొప్పించితిని అవి రావణచరిత్ర వేదవతి కథ రఘువంశవీరులగు దిలీపుని చరిత్ర రఘుమహారాజు చరిత్ర అజమహారాజు ఇందుమతీదేవి వృత్తాంతము దండకారణ్యము చరిత్ర శ్వేతువను రాజర్షిచరిత్ర వాలసుగ్రీవుల జన్మవృత్తాంతము హనుమంతుని చరిత్ర మొదలగునవి తరువాత శ్రీరాముని బాల్యక్రీడలు అహల్యజన్మ వృత్తాంతము ఊర్మిళాచిత్రపట ప్రదర్శనము మొదలగు

కొన్ని కథలు కల్పింపబడినవి ఇవన్నియు మూలగ్రంథమునకు విరోధమును గాని చేటు గాని కలిగించనివై రామచరిత్రము మరింతపరిపుష్టమై రసవత్తరమై పాఠకుల మనసుల నలరించి ఆకర్షించి ఆత్మానందము నందించగలుగునని విశ్వసిస్తూ ఆశిస్తూ చేయుప్రయత్నమే నాయీరచన విజ్ఞులు పెద్దలు నాయీ సాహసమును మన్నించి ఆదరింతురని భావిస్తున్నాను ఆదినుండియు శ్రీరాముని చరిత్ర మ నవుల కాదర్శకమై ఆచరణీయమై యున్నది నాయీ గౌరీరామాయణము గూడ పాఠకులకు భక్తి జ్ఞాన వైరాగ్యముల నందించగలదని ఆశిస్తున్నాను జన్మజన్మల పుణ్యపరిపాకము వలన కలిగిన యీమానవజన్మకు సార్ధకమును సాఫల్యమును గలిగించుకొనవలెననెడి తపనయే యీగ్రంథరచనకు కారణము మానవులు తమజన్మకు కారణ కార్యములనుగుర్తించి తమ కర్తవ్యములను సాధించవలసిన జీవితలక్ష్యములను ఆలక్ష్యసిద్ధితో తాము పొందవలసిన ఆనందమును దెలిసికొనవలయును తత్వమసి అహంబ్రహ్మాస్మి మహావాక్యార్ధములను మననమొనర్చుకొనుచు జీవేశ్వరైక్యానుభుతిని బొందవలయు ననియును ఇహలోకమున దైవప్రీతియు పాపభీతియు సంఘనీతియు గల్గి శాంతిమయ సుఖమయ జీవనము గడపుచు అంత్యమున దైవసాన్నిధ్యమున కైవల్యసుఖమును బడయగల శక్తి నాశ్రీరాముడే పాఠకజనుల కొసంగి సదా రక్షించవలెనని ప్రార్ధిస్తున్నాను

కం - శ్రీవామ లింగ చరితము
నావాగ్దేవియె కటాక్ష మందించి దయన్
దీవించి వ్రాయుమని నా
భావంబులు వెల్లివిరియ భాష నొసంగెన్

తే గీ - ముందుగను వ్రాసినట్టియా గ్రంథమందు
భవుని చరితంబు వర్ణింప బడియె దాని
సూర్యనారాయణా శాస్త్రి జూచి మెచ్చె
నుభయభాషాప్రవీణ దువ్వూరి వారు

తే గీ - హరుని చరితము వ్రాసితి హర్షముగను
హరిని వినుతింతు నాశక్తి ననుసరించి

ఆదివిష్ణువె రాముడై యలరి నట్టి
రామకథనంత వ్రాయుదున్ రమ్యముగను

కం - చామర్తి కృష్ణమూర్తియు
నీమహి శ్రీకృష్ణగారు నీకావ్యంబున్
పేమరు బరిశీలించిరి
రామకథలె జగతియందు రమ్యమటంచున్

తే గీ - శంఖు బోసిన తీర్థమే శంకలేక
పావనము జేయుచుండును భక్తవరుల
శుక్తియందున బడినదే ముక్తఫలము
స్థానబలమున విజయమ్ము సంక్రమించు

గద్యము - అనునటుల కవికులాలంకార బిరుదాంకితులును చోడవరము వాస్తవ్యులునగు శ్రీచామర్తికృష్ణమూర్తిగారు యీగౌరీరామాయణమును ఆమూలాగ్రముబరిశీలించి సవరించి నాకు సహకరించిరి వారికి నాకృతజ్ఞతాభివందనములు యింకను యీగ్రంధమును బరిశీలించినవారు యీధర శ్రీకృష్ణుడుగారును ముత్యం రామ్మూర్తిగారును తమ అమూల్యాభిప్రాయముల నొసంగిరి వారికి నాహృదయపూర్వక వందనము లర్పించుకొనుచున్నాను ఇంకను దీనిని పర్యవేక్షించినవారు తిరుపతి వాస్తవ్యులును నా సోదరులును హోమ్యోపతీ డాక్టర్లునగు సి బి ఎన్ బంగారురాజుగారు వీరందరు తమతమ అమూల్యాభిప్రాయముల నొసగి నాకు సహకరించిరి పండితప్రకాండులగు వీరందరిచే పరిష్కరింపబడిన నాయి గౌరీరామాయణము శంఖునబోసిన తీర్థమువలెను శుక్తియందుబడిన స్వాతిబిందువురీతిని పవిత్రమై ప్రకాశించి పాఠకలోకము నాకర్షించగలదని ఆశించుచున్నాను శ్రీశ్రీశ్రీ తిరుమల తిరుపతి వేంకటేశ్వరస్వామివారు కరుణాకటాక్షముల నన్ననుగ్రహించి కాపాడగలరని ఆశించుచున్నను

ఇట్లు
చగంటి గౌరీదేవి

తే 25 1 1990

కవికులాలంకార
చామర్తి - కృష్ణమూర్తి బి ఎ బి ఎడ్
కార్యదర్శి ప్రసన్నభారతి
చోడవరం విశాఖజిల్లా

## సహృదయ భూమిక

ఆదిశంకరుడు గౌరీదేవికి వినిపించిన రామకథను
నేడు తెనుగుకవయిత్రి గౌరీదేవి తన సహజప్రసన్న శైలిలో
గౌరీరామాయణమును పేర గద్యపద్యాత్మకమహాకావ్యముగా
రచించి ఆంధ్రసాహిత్యనందనారామంలో నొకనూతన
కల్పవృక్షాన్ని సృష్టించినారు
శ్రీమన్నారాయణుడే శ్రీరామునిగను
ఆదిలక్ష్మియే సీతగనురూపుదాల్చిరని మనసార విశ్వసించి
శ్రీమతి గౌరీదేవి నిర్మించిరీ గ్రంథాన్ని ఇక్కారణముననే
దీనికొక పవిత్రత సిద్ధించినది
ఇందలి పద్యములు కొన్ని కుమ్మరి మొల్లను తలపించుచును:
ఉదా - శ్రీరామా గుణధామా
శ్రీరఘువంశాబ్ధిసోమ శ్రితజనపాలా
వీరాధివీర దనుజవి
దారా! జగదేకవీర దశరథరామా!!
(యుద్ధకాండ)
ఒక్కొకయెడ పోతనగారి పోకడలు తొంగిచూచు
చుండును:
ఉదా - అన్న పదంబులకెరగిన
జిన్నియనుజు జూచిపలికె సీతాకాంతుం

డన్నా! లక్ష్మణ! వినుమా
యెన్నగరానట్టి నింద యెంతయొ గలిగెన్
(ఉత్తరాకాండ)

భారతీయ నారీమణుల సాంప్రదాయిక ప్రవర్తనాసరళిని
ప్రతిబింబించు సందర్భములు కోకొల్లలు -
ఉద - వెనుక వచ్చు చున్న వీరుడాపురుషుండు
మరది యగును నాకు మగువలార
రాము జూపి నవ్వె రాజీవలోచన
సిగ్గుజెంది సీత శిరము వంచె
(అరణ్యకాండ)

భర్తను చూపుటకు మగువలు వాడే భాష యిది!
జానకీదేవి భూప్రవేశము సేయుటకుముందు పల్కిన
మాటలు భూదేవిని ప్రార్థించుట కరుణారస భరితములై
పరితల హృదయాలను కరిగించును
(ఉత్తరాకాండ)

ఈగ్రంధమున పద్యములను గద్యములను
వినియోగించినతీరు కవయిత్రియొక్క శిల్పకౌశల్యాన్ని
నిరూపిస్తుంది కథాకథనమునకు గద్యములను రసపోషణకు
పద్యములను వాడుటలో ఔచిత్యము సౌకర్యము గలదు
ధర్మప్రబోధనకు భక్తిభావమునకు
సద్యఃపరనిర్వృతికీ యిక్కావ్యరాజము మిక్కిలి తోడ్పడ
గలదు - ఆంధ్రలోకమున బహుళాధరణనొందుగాక

ఇట్లు
చామర్తి కృష్ణమూర్తి

# కవయిత్రి - కవితావైచిత్రి

శ్రీరాముని ఆరాధ్యదైవంగా ఆదర్శమానవధర్మాన్ని అవనిపై ప్రవర్ధమానముగావించినధర్మమూర్తిగా మనస్సులో మలచుకొని పదేపదే రామనామం తలచుకొని ధర్మావతారమూర్తికి ప్రసూనార్చనంగా గౌరీరామాయణ చంపకాన్ని కవయిత్రి శ్రీమతి చాగంటి గౌరీదేవి సమర్పించడము - ఆస్తికలోకమునకు శీతల చందన స్పర్శనమేగాక రచయిత్రి భక్తికి ప్రబలనిదర్శనం

బాలకాండమున శ్రీరామజనన సన్నివేశమును కందమందార గంధాల్లో బంధించడమేగాక - భక్తికిదక్క నన్యేవ యమున బంధింపబడని విశ్వంభరుడు - కౌసల్యాదేవి ఉదరమున బంధింపబడెనని - హృద్యాతిహృద్యంగా వర్ణింపబడెనో చూడుడు

కం - బంధం బెన్నడు నెరుగని
బంధురగుణయుతుడు లోకబాధలు మాన్పన్
బంధింపబడె నుదరమున
బంధనములు లేనివాడు బంధన యుతుడై

యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుద్ధానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్

అన్న గీతాచార్యుని భక్తజన రక్షణ దీక్షావాక్యము దలపునకు దెచ్చుచున్నది శిశుపాలనలో దల్లిజూపెడి క్రమబద్ధమైన శ్రద్ధతల్లిలాలన అందిపుచ్చుకొనుటకు శిశువుచూపెడి ఆసక్తి మాతాశిశుమనఃచిత్రణ అలతి అలతి పదములతో మన కన్నులకు కట్టినట్లు చిత్రించుటలో కవయిత్రి స్వానుభవమును జోడించి కవితాశిల్పమునప్రదర్శించుట అనల్పమైన కవితావైచిత్రికి నిదర్శనము

ఉదా -

సీ - మూడవ నెలలోన మురిపెంపు పెదవులు
        విప్పి నవ్వగ నేర్చె వింతగొలుప
    నాల్గవ నెలలోన నవ్వుచు దొర్లుచు
        బోరగిలగనేర్చె పొలుపుమీర
    ఐదవ నెలయందు నాటలునేర్చిరి
        పొసగ న రునెలలు పొందుగాను
    పడుచు లేచుచు ప్రాకుపలుమారు బాలురు
        లేచికూర్చొనగోరు లేవలేరు॥

తే గీ ---------------------------
    యెత్తుకొమ్మని జేతులు నెత్తిజాపు
    తల్లి గురించి నవ్వుచు తనవి జెంద
    పాలునిమ్మని కొంగులు పట్టిలాగు

సీ - ---------------------------
    తప్పటడుగులువైచి తడబాటు జెందును
    పట్టుకొన్న మరల పరుగులెత్తు ---

(బాలకాండము)

మహాకవి ఎఱ్ఱాప్రెగడ తన హరివంశమున బాలకృష్ణుని క్రీడలు వర్ణించుట తలపునకు వచ్చును

ముద్దుల తనయుని రాముని
గద్దెను గూర్చుండ జేయగా దగు నింకన్
సుద్దులు జెప్పెదరని మీ
వద్దకు వచ్చితినియిదియె వరమగు నాకున్

(అయోధ్యకాండ)

నావీపున గూర్చుండుము
నీవిభుకడ జేర్చగలను నిమిషము లోనన్
యీవిధి బొగలగ నేటికి
రవమ్మా! యిపుడె నీదు రాముని దరికిన్!!

(సుందరకాండ)

పైపద్యములలో కవితగజ్జగట్టి నడచుతీరు పోతనగారి శైలిని కవిత పోకడలను దలపించును

ఈ రామాయణ మందురవణుని జన్మవృత్తాంతము అహల్యాచరిత్ర మరియు ఊర్మిళాచిత్రపటప్రదర్శనము మొదలగు కొన్ని కథలు జేర్చి క్రొత్తపోకడలతో గ్రంథమును రసవత్తరమొనర్చి అపురూపముగా చవులూరించు కందముల సుధారసమకరందములబూరించి సామాన్యులకుగూడ బోధపడునటుల సులభశైలితో అందించిన కవయిత్రికి శతనతులు

ఇట్లు

ఇ శ్రీకృష్ణుడు

# ఇష్టదేవతా ప్రార్ధన

శా – శ్రీకల్యాణ గుణాకరుండు హరియా శ్రీదేవితోగూడి తా
సాకారంబుగ పన్నగ ధిపునితో శంఖమ్ము చక్రమ్ముతో
వైకుంఠమ్మును వీడివచ్చి యవనిన్ బాలించె శ్రీరాముడై
కాకుత్స్థాధిపు నింట బుట్టి సుతుడై కౌసల్య గర్భంబునన్॥

కం – శ్రీ రఘు వీరుని గ థలు
నేరార పఠించి ముక్తినొందగ యిలలో
నీరామాయణచరితము
గౌరీరామాయణమ్ము గా రచియింతున్॥

కం – సిద్ధివినాయకునకు నా
బుద్ధిని పరికించి మెచ్చి బ్రోవగ కావ్యం
బిద్ధరను వెలుగునట్టుల
సిద్ధింపం జేయుమనుచు జేరి భజింతున్॥

కం – భారతిని గొలుతు నెప్పుడు
కారుణ్యము తోడ నాదుకావ్యమ్మం దున్
ఊరించిసుధారసములు
పూరించియు వ క్కునందు పొంగులు వారన్॥

కం – వ్యాసుడు వాల్మీకియు నా
భాసుండును కాళిదాసు భారవి కవియున్
భాసిల్లగ నావాక్కున
వాసంబును జేయుమనుచు వారిని గొలుతున్॥

కం – గురువులకు మ్రొక్కి నిరతము
మరిమరి వేడుదును రచన మాధుర్యముకై
కరుణించి వాక్కుశుద్ధిని
బరపి నడుప కావ్యమందు ప్రాభవమొప్పన్॥

కం – శ్రీరామనామ మహిమను

## అయోధ్యాకాండము



## అరణ్య కాండము

## కిష్కింధ కాండ

# కృతజ్ఞత

ఆధ్యాత్మిక గ్రంధముల ప్రచురణకు ఆర్ధిక సహాయము అను పధకము క్రింద శ్రీతిరుమల తిరుపతి దేవస్థానము వారు ఒసగిన ధనముతో ఈగ్రంధము ముద్రింపబడినది
ఈ ఆర్థిక సహాయమునకు కరణ భూతులైన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము పాలక వర్గము నకు దేవస్థాన సంఘసభ్య నిపుణులకు దేవస్థాన కార్య నిర్వాహణాధికారి శ్రీ Ch వెంకట పతిరాజుగారికి సప్తగిరి పత్రికా సంపాదకులు శ్రీ K సుబ్బా రావుగార్కి

నా సవినయ కృతజ్ఞతాభివందనములు

ఇంకను నాకు సహకరించిన శ్రీ C B S బంగార్రాజు గారు హోమ్యోపతి డాక్టరు గార్కి నా ధన్య వ దములు

ఈ పుస్తకము ముద్రణకై అన్నివిధములా సహకరించి కంప్యూటరైజ్డ్ కంపోజింగ్ & ఆఫ్సెట్ ప్రింటింగ్తక్కువ ధరలో చేయించిన శ్రీ ఎ వి యన్ రాయ్ శ్రీనివాసా టైప్సెట్టర్స్ ప్రొప్రయిటర్ గారికి న ధన్యవాదములు

# కృతికర్త్రి వంశక్రమము

ఆ వె -ఆంధ్ర దేశమందు నలతూర్పు తీరాన
పెద్దఉప్పల మను పేరుగలిగి
గ్రామముండె నందు గలరు సంపన్నులై
వేదవిదులు మెండు విప్రులరయ॥

తే గీ -వెంకటాకృష్ణ కవియని వినుతి కెక్కె
పార్వతీపరిణయము ను వ్రాసె నతడె
జ్యోతిషంబున నెంతయో ఖ్యాతి గాంచె
భూత-భవితవ్యములు జెప్పు పుణ్య మూర్తి॥

తే గీ -గోత్రమాత్రేయ మనెడియా గోత్ర మరయ
ఇంటి పేరది జూడ చాగంటి వారు
వారి ఏకైక పుత్రులై వరలి నట్టి
రాజభోగులు బంగారు రాజు చూడ ॥

కం - వారిసతి గనియె సుతులన్
యోరిమి గల బుచ్చిమాంబ యోహో యనగా
వారల లోనన్ రెండవ
వారై యాజోగిరాజు వాని గడించెన్॥

తే గీ -కోరి పెండ్లాడె నతడు నన్గూర్మి తోడ
గౌరి నాధుండు నయ్యె నేగౌరి గాన
పూళ్ల వంశంబు నందున బుట్టినేను
కోరి చాగంటి వారింటి కోడలైతి॥

కం - అతని నతినై సుతుగని
చేతోమోదంబు గూర్చి చెలగుచు నుండన్
ఆ తరుణంబున జూడ వి
ధాతయె నాపతిని నన్ను దగనెడ బాపెన్॥

కం - భారద్వాజస గోత్రులు

గౌరవమగు పూళ్లవారు ఘనవంశజులున్
పేరుపడిన సంపన్నులు
ధీరులు వెంకయ్యా నామధేయులు జగతిన్॥

తే గీ - నాదు జనకులు వెంకయ్యా న మమున ను
తల్లి రామమ్మ దీనుల తల్లి యనగ
బంధు జనములు వేనోళ్ల బ్రస్తుతింప
వరలు చుండిరి యా పైడిపాల యందు॥

తే గీ - తల్లిదండ్రుల జేరి నా తనయుతోడ
వారి యాశీస్సులను బొంది వరుస గాను
చదివి తరగతులన్నియు చక్కగాను
బోధనా వృత్తియందుంటి బుధులు మెచ్చ॥

కం - పెరిగితి ఎనతండ్రి కడన్
సరియౌవిద్వాంసు డతడు సాంబశివుండే
యెరిగించె ప్రేమ తోడన్
సరియగు విద్యలును బెక్కుచాలిన నీతుల్॥

కం - పతి సేవకు వంచితనై
మతినెప్పుడు దైవమందు మగ్నము జేయన్
సతతము భావము లెగయగ
చతురత కవయిత్రి నైతి శారద కృపచే॥

కం - చదివితి పురాణ గాథలు
చదివితి నా దేవదేవు చరితము లెన్నో
మదిలో భక్తి దలిర్పన్
ముదమారగ వ్రాయుచుంటి ముక్తిని బొందన్॥

కం - శ్రీరాముని చరితమునే
కోరితి వ్రాయంగ నిపుడు కోసల పతియా
శ్రీరామున కిచ్చెద భవ
భారము దొలగించి నన్ను పాలించుటకై॥

కం - శ్రీరామునకును నచ్యుత
నారాయణ దేవునకును నలిన క్షునకున్
కారుణ్యమూర్తికిని యా
తారకరామునకు దేవతా వంద్యునకున్॥

కం - సాకేతదాసునకు నా
నాకాధిపవినుత లోక నాయకునకు నా
రాకానిషంజనునకును
లోకమ్ములనేలు సర్వ లోకేశునకున్॥

కం - మీనావతారునకు నా
దీన జనోద్ధారునకును దివిజేశునకున్
మౌనిజనహృదయ వందిత
మానవ లోకమున సర్వ మహనీయునకున్॥

కం - శ్యామల రుపునకును మా
కామితములు దీర్చి(బ్రోచు కాకుత్స్థునకున్
రామావతారునకు న
దామోదరభవ్యముర్తి ధరణిజ పతికిన్॥

కం - రావణువధింపనరుడై
కావదలచి లోకములను కౌసల్యకు నా
భూవరుడగు దశరథునకు
శ్రీవరసుతుడైన యట్టి శ్రీరామునకున్॥

# అంకితము

కం - అంకిత మిచ్చెద కావ్యము
ఎంకజదళనేత్రునకును భగవంతునకున్
సంకటహరునకు గౌరీ
శంకర పూజ్యానకు రామ చంద్రున కిదియే॥

కం - శ్రీరాముని కర్పించెద
న ర ముడె దీని నేలు న దర మొప్పన్
ఈ ర మ యణ గాధను
గౌరీరామ యణమ్ము గా వెలుగొందన్॥

# గౌరీ రామాయణము

## బాలకాండ

### బ్రహ్మాదిదేవతలు రాక్షససంహారమొనర్పుమని విష్ణువును ప్రార్థించుట

శా - శ్రీరమ్యంబగు శీతశైలమున నా శ్రీకంఠుడుత్సాహి యై
యా రామాయణగాథ నంత దెలిపెన్ ఆర్యామహాదేవికిన్
ధీరోదాత్తుడు జానకీసహితుడై దీపించె నాదర్శమున్
ఏ రీతిన్ నెలకొల్పి ధర్మ మవనిన్ యేలీల శాసించెనో 1

కం - శ్రీరామరామ యనుచును
నోరూరగ చవులు బుట్ట నుతియించిన చో
ధారుణి యందున జనులకు
దారి యగును ముక్తి కదియె తథ్యము జూడన్ 2

ఉ - పాప భరంబు చేత ధర బాధల కోర్వగలేక యెంతయో
తాపము జెందియున్ జనియె తామరచూలికి మొఱ్ఱ పెట్టగా
నాపరమేష్ఠి తన్ను సుర లందరు గొల్వగ భూమి దేవితో
ఆ పరమాత్ముజేరి తమ ఆపదలన్నియు విన్నవింపుచున్ 3

కం - శ్రీమన్నారాయణ నీ
వీ మహిలో జీవకోటి నెంతయొ బ్రోవన్
భూమిని యేలగ వలయును
నీ మహిమను జూపి భక్తి నెలకొను నటులన్ 4

ఉ - నిత్యము దేవతల్ గొలుచు నిండగు నీదగు దివ్యరూపమున్
దైత్యుని జంపగాదలచి దండిగ మత్స్యపురూపు జేసి నీ
సత్యధికంబు పేర్మి సురలందర బ్రోచితె దేవదేవ నీ
సత్యపుదీక్ష వేర్కొనగ జాల ఁ మౌనులు దేవతాళియున్ 5

చం - కమఠపు రూపు గైకొనుచు గావగ నీదగు భక్త బృందమున్
అమిత కృపాళువై సురల కా సుధ నిచ్చిన యట్టి దేవ నీ
వమిత దయాంబు రాశివని యందురు ఖ్యాతి నీకు జెల్లునే
అమరుల పూజనీయమగు నా ధర బాధలు దీర్పకుండుటల్ 6

కం - క్రోడాకారము నొందియు
వేడగ నా దేవవరుల వేదన దీర్పన్
గ్రీడగ దనుజాని జంపిన
మూడవ అవతార వరహా మూర్తివి నీవే 7

ఉ - బాలుని గావగా దలచి ప్రాభవ మొప్పగ సింహమూర్తివై
గాలుని చెంత కంపితివి కశ్యపుసూను హిరణ్యకశ్యపున్
మేలొనరింప జూడ మిక మేదిని యందు దివంబునందు ధా
త్రీలలనామణీ భయము దీర్పుము ప్రోవుము తెల్లలోకముల్ 8

ఉ - వామన రూప మొంది యట వాసవు కోర్కెలు దీర్ప నెంచియున్
ఆమహనీయు విశ్వజితయాగము జేసెడి యాగశాలకున్
నీమము తోడ జేరి యిల నీ వటువేషము నెంచి జూడ నీ
వేమని వేడితో బలిని యీధర మూడు పదంబులొ గతిన్ 9

ఉ - తేజపు బ్రాహ్మణుండగుచు ధీరత తోడుత ఖడ్గధారి వై
యా జమదగ్నికిన్ జరిగి నా యవమానము సైపలేక నీ
వీ జగమందు రాచకుల మెచ్చట నున్నను నాశ మొందగా
రాజస భావమున్నిలిపి రాజుల ద్రుంచిన భార్గవుండవే 10

చం - వరబల గర్వితుండగుచు వారిజనేత్రల బట్టి వేపుచున్
నరులను లెక్క సేయకయె నాకవిరోధి జగంబు నందునన్
అరి తనకింక లేరనుచు నాగడముల్ గడు సేయుచుండి నే
వెరపిసుమంతలేక బలు వేదనలందగ జేసె లోకులన్ 11

కం - సురలును మునులును సాధులు
నరులెల్లరు భీతిజెంద నాకవిరోధీ
దొరయై యేలుచు నుండెను
వెరువక భీతిలక జనులు వేసట జెందన్ 12

కం - ఆతని దండించియు మా
యాతనలను దీర్చి సురల సందర బ్రోవన్
భూతలము శాంతి నొందగ
పాతకములు పారద్రోలి ప్రజలను గావన్ 13

శా - చీకాకిందెడి జీవకోటివెరపున్ ఛేదింప నీవే గదా
సాకారంబగు భక్తిమార్గ మవనిన్ స్థాపించి వెల్గొంద నా
రాకాసిన్ దునుమాడి దేవగణమున్ రక్షించి పాలించగా
నీకంటెన్ మరిలేరు దిక్కు యిలలో నీరేజ పత్రేక్షణా 14

మ - ధరణీ భారము దీర్చి దుష్టచయమున్ దండించి వే వేగమే
వరమౌనీంద్రులు సంతసిల్ల జగమున్ వర్ధిల్లగా జేయవే
పరమానందము నొంద లోకమున పాపాచారులంద్రుంచవే
కరుణాసాగర భక్తపాల మము కాపాడంగ రావే దయన్ 15

ఉ - ఘోరతపమ్ము జేసి తనకోరికలన్నియు దెల్పి దన్ను నే
వీరులు చంపరాదనుచు వేడె నదెప్పుడె రావణుండు దా
నారయ వానరుల్ నరుల యందున కొండొక చిన్నచూపుతో
వారల వీడె గాన నది వాడికి చావు ఘటింప జేయదే! 16

కం - నరులను విడిచెను గావున
నరరూపము నొంది నీవు నారాయణ వా
నరులను దోడుగ జేకొని
సురవైరిని ఋంపి మాకు శుభముల నిమ్మా 17

కం - అని బలుకు నలువ తోడను
వనజాక్షుడు బలికె నింక వరమగు మీకున్
దనుజాళి జంపగ సమయం
బను కూలంబగుచు వచ్చె సందర గావన్ 18

కం - దశరథ భూపతి యిలలో
దశదిశలన్ వెలయ జేసె దగనెక యజ్ఞం
బశుపతి మెచ్చగ నిపుడే
విశదంబౌ వరములిచ్చి వేడుక దీర్తున్ 19

గద్యము - అని వారలకభయంబిచ్చి శ్రీమన్నారాయణుడు దుష్టశిక్షణ శిష్టరక్షణ జేయ నెంచి తొల్లి తన భక్తులగు జయవిజయులే సనకసనందనుల శాపమువలన భూలోకమున రాక్షసులై రావణ కుంభకర్ణులుగా బుట్టి ప్రజలను హింసింపుచుండిరి గాన వారలను శాప విముక్తులను జేసి తనదరికి చేర్చుకొనవలయుననియు ఈ భూమియందు ధర్మమును స్థాపించి ఆదర్శంబును నెలకొల్పుటకై రామావతారము నెత్తి కౌసల్యాదశరథుల తపః ఫలంబై భూలోకమున కొంత కాలము వసింప కోరికగలవాడై అంతకు మున్నుతాను ధరించిన మత్స్య - కూర్మ - వరాహ - నారసింహ - వామన-భార్గవావ తారములయందు తనఅంశమును మాత్రమే వెలయించెను గాని యిప్పుడీ అవతారమున తన ఆదిపీరముతో మర్త్యలోకమున కేతెంచవలయునని నిశ్చయించి ఆదిలక్ష్మిని భూలోకమునే జనకమహారాజునింట జనియించుమని ఆనతిచ్చెను లక్ష్మీదేవియు అయోనిజయై భూలోకమున నొక పద్మకొలను నందు నొక పద్మములో నావిర్భవించెను శ్రీమహావిష్ణువు ఆదిశేషుని తోను శంఖచక్రముల తోను వైకుంఠమును వీడి భూలోకమునకు విచ్చేసెను 20

## రావణచరిత్ర

కం - శ్రీరఘురాముని చరితము
నోరార వచించి జగతి నొడివెద కథగా
నారాయణుడే భువిలో
శ్రీరాముడు ఆదిలక్ష్మి సీతయె యనుచున్ 21

తే గీ -విష్ణు భక్తులు ఆ జయవిజయు లనెడి
ద్వారపాలురు మునిశాప దగ్ధులగుచు
బ్రహ్మ కులమందు జనియించి ప్రబలినారు
అసురులై లోకముల నెల్ల నడల జేయ 22

గద్యము - ఆరాక్షసులసంహరించి దుష్టశిక్షణ శిష్టరక్షణ జేయుటకై శ్రీమహావిష్ణువు రామావతారమెత్తెను పూర్వము బ్రహ్మకు మానస పుత్రుడై పులస్త్యబ్రహ్మ పుట్టెను అతడు మహాజ్ఞానియు పరమశాంతుడును దయామయుడును మహాతపశ్శాలియు నై మునులందరకును ఆదర్శప్రాయుండై యుండెను అస్ఖలిత బ్రహ్మచారియై 23

కం - అపరశివుని వలె నాతడు
తపమును జేయుచును ఉండ తాపసి కన్నెల్
తపము సెడ గోల సేసిన
నపరాధులమీద నెంతొ నాగ్రహ మొందెన్ 24

తే గీ -నన్ను గనుగొన్న తోడ నే కన్నె యైన
గాంచు గర్భమ్ము నని బల్క కాంత లంత
భయము తోడను అటనుండి పారి పోవ
తరుణి యొక్కతె తృణబిందు తనయ మిగిలె 25

కం - చూలాలై యున్న తనయ
బాలిక నీక్షించి తండ్రి పరితాపము తో
నా లేమ నాపులస్త్యుని
పాలికి గొనిపోయి యతని పత్నిగ జేసెన్ 26

కం - కోరిక దీరగ సుతుడై
వారికి జన్మించె విశ్రవసు వను వాడున్
భారద్వాజుని తనయన్
కోరి పరిణయంబు నందె కులమే పండన్ 27

గద్యము - ఆవిశ్రవసువునకును భరద్వాజుని పుత్రికిని వైశ్రవణుడను వాడుబుట్టెను వాడును తపస్సు జేసి బ్రహ్మను మెప్పించి అధిక ధనమును బొంది సుఖంప గోరిన బ్రహ్మయు అతనికావరము నిచ్చి పూర్వమింద్రుని అనుమతిని విశ్వకర్మచే నిర్మితమైన లంకానగరము ఖాళీగానుండె నివసించుడుమన వైశ్రవణుడు ఆలంక యందు పూర్వమెవరుండిరి ఇప్పుడది యేల రిక్తముగా నుండె నన విరించి

రాక్షస వంశక్రమమెఱింగించెను పూర్వము నాచే కొన్ని శక్తులు సృష్టించబడి జలములందు విడువబడియె నవితమలో తాము కలహించుచు రెండుతెగలుగా విడిపోయి యక్షరాక్షసులుగా పేరుబడిరి అందు రాక్షసులు బలవంతులై తమకొక మహానగరంబు గావలయునన వారలకొఱకా నగరము నిర్మింపబడియె అప్పటి నుండియు వారానగరమున వసించుచుండిరి వారిలో హేతిప్రహేతులను వారు బలవంతులై యుండిరి క్రమముగాహేతికి విద్యుత్కేశుడును వాడికి సుకేశుడును ఆసుకేశునికొక గంధర్వకన్యయందు మాలి సుమాలి మాల్యవంతుడు అను ముప్వురుకుమారులుగలిగిరి వారుమహా బలవంతులును క్రూరులునై జనులను పీడింప దొడంగిరి శ్రీమహావిష్ణు వారాక్షసులంజంప మాలియనువాడు మరణించగనే సుమాలియు మాల్యవంతుడును తమబలగముతో పాతాళమునకు బారిపోయిరి అప్పటి నుండియు నది ఖాళీగా నుండె గావున నీవందుండుమని ఒక పుష్పక విమాన మిచ్చి దీవించెను ఆలంకానగరమున వైశ్రవణుడు మహావైభవముగా నుండి భోగము లనుభవించుచుండెను ఒకనాడా వైశ్రవణుడు అచ్చరలంగూడి పుష్పకారూఢుడై విహరించుచుండ సుమాలి తన కుమార్తెయగు కైకసితో పాతాళమునుండి వచ్చి వైశ్రవణునివైభవమునకుఈర్ష్యజెంది విశ్రవసునకు కైకసి నొసంగిన యిటువంటి పుత్రుని బడయగలదు దానితో తిరిగి తమ రాక్షస వంశము ప్రఖ్యాతి నొందగలదని కైకసిని విశ్రవసు నాశ్రమముకడ దించి వానిని ప్రసన్నముజేసికొమ్మని జెప్పి పోయెను ఆకైకసియు తనవయోరూపవిలాసములతో విశ్రవసుని మెప్పించి వానింగవయిగోరిన ఆపౌలస్త్యుడు తరుణీ నీవు సంధ్యా-సమయమున కామోద్రిక్తవైతివి గాన నీకు రాక్షస ప్రవృత్తిగల పుత్రులుదయింతురన నామె చింతించి స్వామీ! నాకు మీవంటి సాత్త్వికస్వభావులును చిరంజీవులునగు సంతానముగావలెనని యడుగ నీమూడవకుమారుడు బ్రహ్మనిష్ఠుడు విద్యాగరిష్ఠుడు చిరంజీవియు కాగలడని దీవించెను ఆ కైకసి ముందుగానొక శిశువునకు జన్మనిచ్చెను 28

కం - చుక్కలు రాలెను భువిలో
నక్కైకసి సుతుని గాంచ నద్భుత మగు నా

రక్కసి రూపము జూడగ
మిక్కుట మగు భీతిగలిగె మేదిని యందున్ 29

తే గే బాహువులు జూడ నిరువది బాలు నకును
శిరము లుండెను పదియునై చిత్ర ముగను
మేఘమును బోలు నల్లని మేను జూడ
దశ ముఖుండని పేరిడె తండ్రి యపుడె 30

గద్యము - ఆబాలుని తరువాత కుంభకర్ణుడును శూర్పణఖయు తరువాత విభీషణుడును జన్మించిరి కైకసియు నాబాలురను పాతాళమునకు గొనిపోయి సకలవిద్యాపారంగతులనుజేసెను వారును తల్లిదండ్రుల నానతి బ్రహ్మను గూర్చి తపముజేసిరి దశకంఠుడునిష్ఠమెయి వేయివత్సరంబులకొకశిరముచొప్పున హోమముజేయుచు పదివేల వత్సరంబులు శిరములు నరుకుకొనిహోమగుండమున వేయుచు ఉగ్రతపముజేసెను వాని తపమునకు మెచ్చి విధాతవానికి కామరూపమును నాభిదేశమున అమృతభాండమును ప్రసాదించి ఎన్నిపారులు తలలుదెగినను తిరిగి మొలచునట్లును వలసినప్పుడు పదిశిరములును ఇరువదిబాహువులునుండునట్లును ఇతర సమయములయందు సుందర రూపుండగునట్లును అనుగ్రహించెను ఇట్లు వరబలసంపన్నుడైన పుత్రునిజూచి కైకసి బిడ్డా! నీవు నీ తండ్రియనుమతిని లంకానగరమును బొంది సుఖింపుము అది అమరావతిని మించి సుఖదాయకము దానిని నీ అధీనముజేసుకొమ్మని పాతాళమందున్న సుమాలిపుత్రులగు ప్రహస్తాదుల దోడిచ్చిపంపెను దశకంఠుడు వైశ్రవణుని కడకేగి యీ లంక మా మాతామహులది నేటినుండి యీలంకానగరము నా అధీనముగావలయు నన దశముఖుని బలగర్వంబులు దెలిసిన వాడుగాన వైశ్రవణుడు లంకను వదలి తండ్రి అనుమతిని కైలాసమునకు బోయి పరమశివుని గూర్చితపమొనరింప శంకరుడు వానినాదరించి అలక నగరమున కధిపతిని జేసి మిత్రునిగా మన్నించెను అప్పటినుండియు ఉత్తరదిక్కునకధిపతియై వైశ్రవణుడు కుబేరుడను పేర ధనాధిపతియై యుండెను మహాబలవంతుడగు

కుంభకర్ణుడు బ్రహ్మగూర్చి తపమొనర్చి ప్రసన్నుని జేసికొని వరములు వేడ బోవ బలసత్వములకుతోడు వరబల మొందిన లోకకంటకుడగునని దేవతలు భయపడి సరస్వతి మాయచే వానినోట నిదురనే వరముగాబొందజేసిరి విభీషణుడు మాత్రము బ్రహ్మజ్ఞానమును బొందవేడెను దశముఖుడు పాతాళము నుండి అనేకరక్కసివీరులను దోడ్కొని లంకానగరమునకేగి మాతులుడగు ప్రహస్తుని మంత్రిగా జేసికొని లంకాధిపతియై యుండె కుంభకర్ణునకు లభించిన వరమువలన అతడు నిద్రావస్థ యందుండ రావణుడు బ్రహ్మనుప్రార్థించి కుంభకర్ణుడారునెలలు నిద్రించి ఒక్కరోజున మాత్రముజాగరూకుడై అమితమైన ఆహారముభుజించి విహరించును అఒక్కరోజు మాత్రమతడధిక బలవంతుడై మృత్యుంజయుడు కాగలడని బ్రహ్మ చేత పలికించెను దశముఖుడు వరబలగర్వితుడై అరివీరభయంకరుడై అలకానగరమున కేగి కుబేరునదలించి వాని పుష్పకవిమానమును దన వశము జేసి కొనియెను 31

## రావణుడు కైలాసపర్వతమెత్తుట

గద్యము - ఒక్క నాడు దశముఖుడు పుష్పకారూఢుడై కైలాసపర్వతము మీదుగా పయనింప అపుష్పకము కదలకనిలచెను శివుడుమా సహితుడై క్రీడించుచుండె గావున నీపుష్పకమునకవరోధమయ్యె నని నందీశ్వరుడు బలుక దశగ్రీవుడు క్రోధముతో 32

కం - హరుడైనను నా బలమున్
ఎరుగడె నన్నాప గలడె ఈ భువి యందున్
అం గలడే నా కని తన
కరమున నాగిరిని ఎత్త గౌరీశుండున్ 33

తే గీ -పర్వతము క్రింద వానిని బట్టి నొక్కి
అతని గర్వమ్ము నంతయు నణచి వైచె

రక్తమును గ్రక్కి యప్పుడా రాక్షసుండు
అడలి దశకంఠముల తోడ నరచె నంత 34

గద్యము - పరమశివుని పాదముక్రింద నలిగి అరచిన ఆదశముఖుని కంఠారావమునకు దిక్కులదరె ఆనాటి నుండియు దశకంఠుడు రావణుడనబరగె పరమేశ్వరుని శక్తిని దెలిసిన వాడై భక్తితో పదిముఖములతో స్తుతియించె 35

కం - శివశివశంకర పురహర
భవహర కరుణాలవాల భక్త విలోలా
భవనాశము జేయుము యిక
శివహర శంభో యటంచు చేరి భజింతున్ 36

కం - ఈశుడవు సకలమునకు ప్ర
కాశుండవు భక్తహృదయ కమలము లందున్
ఆశల బడి గర్వమ్మున
గాశిలితిని దేవదేవ కరుణించ వయా 37

కం - ప్రాణుల సృష్టించగ నా
ప్రాణుల బోషించి వేగ పాలింపగ నా
ప్రాణుల హరియింపగ నా
ప్రాణుల లోనుండి సర్వప్రాణుల బ్రోవన్ 38

కం - లీలగద నీకు సర్వము
కాలంబును బట్టి సర్వ కార్యము నడుపన్
హేలగ జూతువు జగమును
చాలగ నడిపింతు వౌర సత్కృప తోడన్ 39

కం - మిన్నును మన్నును గానక
యెన్నియొ నేరములు జేసి యెదిరించితి నే
మన్నించుము అఘరాధిని
నిన్నే వేడుచును యుంటి నీలలాక్షవిభూ 40

గద్యము - అని ఆ పరమేశ్వరుని భక్తిప్రపత్తుడై స్తోత్రము జేయ కరుణాంతరంగుడగు శివుడాతని మన్నించి వాని కనేక వరములిచ్చి

ఆదరించెను అప్పటినుండియు రావణుడు శివభక్తుడై నిష్ఠాగరిష్ఠుడై శివపూజాధురంధరుడై పరమేశ్వరదత్తమైన చంద్రహాసము చేబూని అరివీరభయంకరుడైయుండె అనేక రాక్షసవీరులు రావణుని గొలుచుచు లంకానగరమున నుండిరి రావణుడు విద్యుజ్జిహ్వుడను రాక్షసవీరునకుశూర్పణఖనుపెండ్లిచేసెను మయుడను నొకడు విశ్వకర్మకులంబునబుట్టి పరమశివుని గూర్చి గొప్ప తపంబొనరించి వాస్తుకళా మర్మంబుల దెలిసికొని శిల్పకళాచతురతబడసెను ఒక గుహాంతర్భాగమున దివ్యసౌధ మొండు నిర్మించుకొని దానిని అమేయరత్నరాసులతో నింపి దేవలోకమునుండి హేమయను అచ్చరకన్నెను దెచ్చుకొని ఆ దివ్యసౌధమున పెక్కు వేల వత్సరము లా హేమతోసుఖియించెను వారికి మాయావి దుందుభి యను నిరువురు కుమారులును మండోదరి యను నొకకుమార్తెయు గలిగిరి దేవేంద్రుడా హేమను దిరిగి అమరావతికి గొంపోయెను మయుడును తనకుమార్తెయగు మండోదరిని రావణుని కోరికపై నాతనికిచ్చి వివాహముజేసి తపంబునకు బోయెను మండోదరితో రావణుడు అమేయ సౌఖ్యంబు లందు చుండెను వజ్రజ్వాలయనురక్కసికన్నెను దెచ్చి కుంభకర్ణునకును సరమ యనుగంధర్వకన్యతో విభీషణునకును వివాహము లొనరించి దశముఖుడు లంకా రాజ్యము పాలించు చుండెను 41

## శ్రీమహాలక్ష్మి పద్మమునందావిర్భవించుట

గద్యము - ఒకా నొకప్పుడు కుశధ్వజుడను నొకబ్రాహ్మణుడు వేదవిదుడును విష్ణుభక్తుడు నై యుండెను 42

తే గీ - ఒక్క దినమున వేదంబు నుడువు చుండ
నతని వాక్కున జనియించె నద్భుత ముగ
లక్ష్మి యంశమ్ముతో నొక్క లలన యపుడె
వేదవతి పేరు తోబెంచె విప్రు డంత 43

కం - ఆ వేదవతియు నెప్పుడు
శ్రీవిష్ణుని పూజ చేసి చిత్తము నందున్
ఆ విష్ణువె తనపతి గా
గావలె నని దలచి తపము గావింప నటన్ 44

తే గీ - రావణుండామె బొందగా రాగ నపుడు
తపము సెడెనని యామెక్రో ధంబు తోడ
చచ్చెదవు నీవునీ బంధు జనము తోడ
అనుచు శాపము నిచ్చెనా అతివ యపుడు 45

గద్యము - హరిదత్తనైన నన్నంటితివి గాన నీవు నాశనమగుదువని బల్కి యోగవహ్ని యందు తన శరీర మాహుతి జేసి తిరిగి లక్ష్మీ దేవియందు ప్రవేశించెను రావణుడును వేదవతి పల్కులు లెక్కసేయక తన దారిని తాను బోయెను శ్రీ మహావిష్ణువు రావణ సంహారార్థము రామావతారమెత్తుట కొఱకు వైకుంఠమును వీడి భూలోకమునకు వచ్చెను శ్రీమహాలక్ష్మియు భూలోకమున లంకానగరమందలి యొక సరోవరమున నొక పద్మము నందావిర్భ వించెను లంకాపతియైన రావణుడా సరసియందలి పద్మములతో నిష్ఠాగరిష్ఠుడై పరమేశ్వరుని పూజించు చుండెను ఒక్క నాడా రావణుడు శివపూజ చేయుచుండ తామరపద్మములనుండి ఓంకార శబ్దము వినబడియె 46

కం - ఇది యేమి చిత్రమో యని
మది జంకుచు రావణుండు మండోదరి తో
నదియేమో గనుగొను మన
పదిలముగా పూలయందు పరికించి వడిన్ 47

కం - తనదు తనువుకంపించగ
ననుమానముతోడ భీతి నందుచు పతితో
గనుపించెను నాథా! యీ
వనజమ్ముల నడుమ నొక్క వరశిశు వనియెన్ 48

కం - పిలి పించెను పండితులను
దెలియ బరచె వారి కంత తెల్లముగా నీ

కలికి దొరికె మంచిది యే
పలుకవలెను మీరు దీని పద్ధతి నంతన్ 49

గద్యము - అంత నాపండితులు పంచాంగమ్ములు పరికించి ఘడియలు లెక్కించి చిత్తా నక్షత్రంబున జన్మించిన యీ కన్య శుభ ప్రదము గానేరదని భయవినయంబుల రాజునకు నమస్కరించి - 50

కం - లంకేశ్వర మీరడుగగ
బొంకగ రాదయ్య మాకు పూవుల లోనన్
పొంకముగను వెలసిన యీ
పంకజ దళనేత్రి లంక భంగము జేయున్ 51

కం - కావున యిపుడే దీనిని
ఆవల ద్రోయంగ వలయు నతి వేగమునన్
పావనమగు మన లంకను
గావవలయు దీని విడచి కైకసి తనయా! 52

కం - అపలుకులు విని రావణు
డాపద గమనించి పేటికందున నుంచెన్
ఆ పాపను జంపక యే
యీ పావన జలధిలోన యిడుడని బలికెన్ 53

కం - ఆ రీతిని శ్రీలక్ష్మిని
పారావారమ్ము నందు బడవేయంగా
తీరమ్మున ప్రవహించుచు
చేరె నదియె మిథిలపురము చేరువ కంతన్ 54

## అయోధ్యాపురవర్ణన

కం - శ్రీరామచంద్రునకు నే
నీ రామాయణ చరిత్ర నెచ్చెద కృతిగా
కారుణ్యాలయుడగు నా
శ్రీరాము డొసంగు నాకు సిరులున్ శుభముల్ 55

గద్యము - భగవంతుని సృష్టిలో సప్తద్వీపములు గలిగిన వసుంధర సమస్త జీవ కోటికి నాధారభూతమై విలసిల్లుచున్నది ఇందు భరతఖండంబత్యంత ప్రసిద్ధమై సహస్ర వర్షములనుండియు సాహిత్య సాంస్కృతిక నాగరికతల నభివృద్ధి గావించుచు నే యున్నది కైలాస పర్వతమనదగు హిమవత్పర్వతమున శ్రీపరమేశ్వర జటాజూటంబుల నుండి వెలువడి గంగా యమున బ్రహ్మపుత్ర సింధు సరయూ నదులు ఆర్యావంతము నంతయు సించిత మొనర్చి పరమపవిత్రము జేయుచున్నవి సముద్రగాములగు నీప్రవాహముల వలన ఈ భరత భూమి ప్రపంచమునకే మకుటాయమానమై వెలుగొందుచున్నది ఇందు సరయూనదీ తీరమున అయోధ్యానగరము ప్రాచీనకాలము నుండియు కోసల దేశమునకు రాజధానియై యలరారుచున్నది యోధులకు గూడ జొర నశక్యమగుట అయోధ్యయనబరగె 56

ఉ - శ్రీరఘు వంశ వీరులకు శ్రీనిలయంబగు రాజధాని యై
ధారుణి యందయోధ్యపురి ధార్మిక వేత్తల కాలవాలమై
పౌరులు నెల్లవేళలను పట్టణరక్షణ సేయు చుండగన్
వీరులు శాంతమూర్తులుగ వెల్గుచునుందురు దీప్తి మంతులై 57

కం - ఆపుర వీధులు మేడలు
నేపుగ నాకసము నంటియే యుండును గా
గోపురములు మందిరములు
చూపరులకు వింతగొల్పి సొగసుల మించున్ 58

ఆ వె - రాచవీధులందు రంజిల్లు మేడలు
గోపురముల తోడ గొప్ప కోట
బురుజు లన్నిగూడ బొమ్మల తోనిండి
శిల్ప కళలు పెక్కు జిలుగు లీను 59

సీ - నగరంబు జూడగ నలుమూల లందున
వీధులు బారులై వెలయు చుండు
నిరు పార్శ్వములనున్న యింపైన భవనముల్

తారల నంటుచు తళుకు లీన
తలుపులు కిటికీలు ధవళకాంతులు జిమ్మ
శిల్ప చిత్రంబులు జిల్గు లరయ
రాచ వీధులయందు రమ్యమై దీపించు
నాదాలు వినిపించు నర్తనముల 60

ఆ వె - పురము నిడివి జూడ పొలుపుగా పదిరెండు
యోజనములు గలిగి యొప్పుచుండు
మూడు యోజనములు ముదమార వెడులుపై
పట్టణంబు సొగసు ప్రబలు చుండు 61

సీ - ఆరామ ములయందు నందాల తరులతల్
ఫలపుష్పములతోడ పరిమ ళించు
మందార మల్లికా మాలతీ సుమలతల్
వెల్లి విరియబూసి వెలుగు చుండు
పున్నాగ తీగలు పూజొంపముల యందు
పరిమళములు నింప పల్లవించు
పుప్పొడి రేణువుల్ పూపొదరిళ్లలో
మెత్తని శయ్యలై మెరయు చుండు 62

ఆ వె - అన్ని ఋతువులందు నల్లిబిల్లిగ బూసి
కన్ను విందు గాగ కాంతు లీను
నందములను జిమ్మి యలరించి మనముల
చాటు చుండు వాని చక్క దనము 63

సీ - కాసార ములయందు కమనీయ జలములు
నీహార వీచికల్ నిండి యుండు
కలహంస నర్తనల్ కలకల నాదముల్
శుకపిక స్వనములు సొంపు నింప
నిర్మల శీతల నీరదంబుల శోభ
నెమళుల నృత్యముల్ నెనరు గూర్ప
ఝుమ్మని తుమ్మెద ఝుంకార రవములు
కమ్మని వాసనల్ గాలిరవళి 64

ఆ వె -పద్మ రాగరుచులు పరిమళ వాయువుల్
గండు మీన రాశి కదలి కలను
నీటి తోడ మెరయు నిండు తటాకముల్
తనువు మనసు గూడ తనివి గూర్చు 65

సీ - పంచకావ్యంబులు పఠియించు విప్రులు
సాముగరిడి నేర్చు క్షత్రియులును
వ్యాపార దక్షులై వైశ్యపుంగవులుండ
విపణి వీధులు చాల విస్తరించె
పశుపోషణలజేయు వరశూద్ర జనులతో
కృషి సంపదలు యెన్నొ గలిగి యుండు
చత్వారి వర్ణముల్ సాగించు కులవృత్తి
కాదు లేదను మాట గాన రాదు 66

ఆ వె -గురువులందు భక్తి గొమరొప్ప వెలయించి
పెద్దలందు మిగుల ప్రేమ జూపు
వీరులా పురమున వెలుగొందు చుందురు
సద్గుణవతులైన సతులతోడ 67

సీ - సౌవర్ణ భూషణాల్ జక్కగా జేసెడి
స్వర్ణకారులచట జాలగలరు
పట్టుపుట్టంబులు బాగుగా నేసెడి
పద్మ సాలీలందు ప్రబలు చుంద్రు
శిల్పాలుజిలుగులు చిత్రాలు జెక్కెడి
చిత్రకారు లచట జేరి యుంద్రు
మున్నూట యరువది ముద్దుగుమ్మలు గల
వేశ్య వీధులు జూడ వెలుగుచుండు 68

తే గీ -వెలయు సంగీత వాద్యాల విద్యలెన్నొ
సరస సంభాషణంబుల చతుర మతులు
జాణ తనమున వారితో జాల రెవరు
రాచ నగరము నందుండు రసిక వరులు 69

ఉ - సత్యవచోవిధిందనరు సద్గుణశాలురు నీతికోవిదుల్
నిత్యము దేవతార్చనల నీమముగల్గిన బ్రాహ్మణోత్తముల్
సత్యము ధర్మమున్ దెలుపు సత్కవి పండితులా పురంబునం
దత్యధికంబుగాగలరు నందరు ధీరులు శాంతమూర్తులై 70

సీ - ఆపురి మధ్యలో నందాలు జిమ్మెడి
రాజమందిర మొండు తేజరిల్లు
నీలాల నింగిలో నెలవంక బోలెడి
మెరుపుల జిలుగుల మేడలోన
ఇక్ష్వాకు వంశీయు లింపొంద పాలించు
నింద్ర సౌధము మించు మందిరమున
రఘువంశ వీరుడై రాణించు దశరథ
రాజు యేలుచునుండె రమ్య ముగను 71

తే గీ -పట్టమహిషియై కౌసల్య పరిఢవిల్ల
నేర్పు గల్గుసుమిత్రయు నెనరుజూప
ముద్దుసతియైన కైకేయి ముదముగూర్ప
నింద్రభోగంబులను బొందు నిలను రాజు 72

మ - ధరణీపాలుడు రాజ్యమేలగను సద్ధర్మార్థముల్ నిచ్చియున్
తరుణా కారము నొంది యాధరణి తత్సారంబు జిందించుచున్
పురసౌభాగ్యము బెంచుచుండు ప్రజకున్ భోగంబులందించుచున్
పరమార్థంబును బొందజేసి ఫలముల్ పండించు నెల్లప్పుడున్ 73

ఉ - మంతన జేయగల్గు మతిమంతులు పెక్కురు రాజకార్యధీ
మంతుల తోడ గూడి బలుమన్ననలందుచు నుండు రాజు శ్రీ
మంతుడు పేరుబొందె ధృతిమంతుడు కోసలనాధుడంచు నే
వంతలు లేకయే ప్రజలు వర్ధిలు చుందురు పట్టణంబునన్ 74

తే గీ -అష్టమంత్రుల యందున నధికుడగుచు
రాచకార్యము లందున రాజరాజు
దశరథేశుని వెంటను దగిలియుండు
మంత్రులందు సుమంత్రుడు మాన్యుడగుచు 75

కం - హితులై దశరథుని పురో
హితులై గురులగు వసిష్ఠులెంతయొ ప్రేమన్
వెతలెరుగనీయ కెప్పుడు
హితమును గూర్చుదురు వార లిక్ష్వాకులకున్ 76

కం - సాకేత పురవరమ్మున
నాకాధిపుడనగజెల్లు నరనాథుండై
లోకులు మెచ్చగ దశరథు
డేకతమున నేలుచుండె నెన్నేయేండుల్ 77

ఆ వె -సంతు గలుగ కునికి సాకేతు డంతట
చింత జెంది మదిని చిన్న బోయి
గురువుల బిలపించి కోరిక దెలిపెను
పుత్రభాగ్య మెట్లు బొందు టనుచు 78

తే గీ -గురువు లప్పుడు యోచించి కులము వెలయ
యాగ మొనరింపగా దగు ననుచు బలికి
పుత్రకామేష్టి నెరిగిన పుణ్య మూర్తి
ఋశ్యశృంగుడు గలడొక ఋషివరుండు 79

గద్యము - అని చర్చించు సమయమున మంత్రాంగ వేత్తయు అష్ట మంత్రులలో ప్రధానుడును దశరథ మహారాజునకు ప్రాణ మిత్రుడునగు సుమంత్రుడు రాజునకిట్లనియెను 80

కం - ఎంతటి కర్యమునైనను
మంతనమున జక్కబడును మహిలోప్రజకున్
చింతను బొందగ నేటికి
సంతానము నొందగలుగు సరియగు రీతిన్ 81

గద్యము - గావున నాఋశ్యశృంగుని రప్పించిన నతని వలన మీఅభీష్టము నెరవేరగలదు ఆ ఋశ్యశృంగుని చరిత్రపూర్వము నేను వినియున్న వాడ నని ఆ చరిత్ర నెరిగించెను 82

## ఋశ్యశృంగుని చరిత్ర

గద్యము - పూర్వకాలమున కశ్యపుడను నెక మహాతపస్వి గలడు అతనికి విభాండకుడను వాడు బుట్టెను ఆ విభాండకుడు మహాజ్ఞానియై కొన్ని వేల వత్సరంబులు తపస్సుజేసెను అతడు బ్రహ్మనిష్ఠుడై అస్ఖలిత బ్రహ్మచారియై యుండ నొక్కనాడాతని వీర్యము స్ఖలనమై గడ్డి యందుబడెను దానినెక హరిణిభుజించి గర్భముధరించెను ఆహరిణియందు మానవాకారము గలనెక శిశువుదయించె వానినొసటనెక శృంగముండెను విభాండకుడా బాలుడు తన కుమారుడని గ్రహించి వానిని పెంచిపెద్దచేసెను నొనటశృంగముండెగాన నాతడు ఋశ్యశృంగుడనబరగె జన్మించిన దాదిగా అడవులయందే దిరుగుచు తన తండ్రిని తండ్రికడకు వచ్చెడితపశ్శాలురను దవ్వనితరజాతినే యెరుంగక తండ్రి యాజ్ఞలనే దలదాల్చుచు మహాతపస్వియై అస్ఖలితబ్రహ్మచారియై యుండె అతడి ప్రతిభాశక్తివలన నతడున్నచోట నెలమూడువర్షములతో పృధ్విసస్యశ్యామలమగును

ఒకానొకప్పుడు అంగదేశమును రోమపాదుడను రాజుపాలించు చుండెను రాజదోషము ప్రజలబాధించునను నార్యోక్తి ననుసరించి అతని పాలనలో అనావృష్టి యేర్పడి ద్వాదశ వర్షములు వర్షములు లేక భూమి బీటలువారి ప్రజలను క్షోభింపజేసె అంత రోమపాదుడు యెవ్విధంబున నీ ఉపద్రవము దొలగగలదని 83

ఆ వె -చింత జెంది రాజు చేరెను గురువుల
వంత దీరిజనులు వాసి నొంద
నేమిజేయవలయు నీవిపత్తు దొలగ
మాన్యులారజెపుడి మార్గమెద్ది 84

కం - ఈదుర్భిక్షము బాపను
నా దుఃఖము పారద్రోలి ననురక్షింపన్
వేదనదీర్చంగలిగెడి
నా దినములు జక్కజేయు నాథులు మీరే 85

గద్యము - అనిదురపిల్లెడిర జనుజూచి గురువులును పురోహితులునగు ద్విజోత్తములు యోచించి విభాండక మహాముని పుత్రుడు ఋశ్యశృంగుడను నెక మహాత్ముడు గలడు అతడెందున్ననందు నెలమూడు వర్షములభూమిసస్యశ్యామలమగు గాన నాతడినిదేడ్కొని రావలెనన నాతడెందుండు వాడు వానినెవ్విధంబున దేడ్కొని రావలయు మీరే ఆనతిండనిరాజు కోరెను అంత నాగురువులు 86

కం - వానిని దేడుకురావలె
పూనికతో భూమిదడుపు పూజ్యాడతండే
మానిని నెరుగక యుండెన్
వినియమము తోడ నైన నిట నిలుపవలెన్ 87

గద్యము - స్త్రీ రూపమైన నెరుంగక సస్టలిత బ్రహ్మచారి య్యైయున్న వాడు కావున నతనికి కామవికారములు గలిగింపజాలిన వేశ్యలను బంపిన వారు తమ రూపురేఖావిలాసముల బ్రదర్శించి వానినాకర్షింపగలుగుదురన రోమపాదుడు గురువుల నానతి నెరజాణలగు సుందరాంగులను వారి వెనుక వలసిన వస్తుజాలములతో కొంత భటవర్గమును సహాయముగా బంపెను వారును పల్లెలు పట్టణంబులు గమించి నిర్జనారణ్యముల బ్రవేశించి విభాండక మహాముని యాశ్రమమునకు దవ్వుల ఏడిసిరి 88

కం - వనమందు ఋశ్యశృంగుడు
గనుగొని వారలను వింతగా మది దోపన్
వినయము భయమును బెనగొన
జనియెను ఆదరికి గొంత సంబరమొదవన్ 89

గద్యము - చని వారల తనూలతావిలాసముల కచ్చెరు వొందుచు తపోనిష్టయే తననొసటగల శృంగమునకు గారణమని తండ్రివలనవినియున్నందున ఇప్పుడీవిలాసినుల వక్షంబుల రెండుశృంగములున్నవి వీరెంత తపోధనులో యనిభయవినయముల వారికి నమస్కరించెను ఆజవ్వనులు తమకోమలమైన హస్తములతో ఋశ్యశృంగుని శరీరమును స్పృశించుచు అతని హస్తములు తమ చెక్కులందును

## ఋశ్యశృంగుని చరిత్ర

గద్యము - పూర్వకాలమున కశ్యపుడను నొక మహాతపస్వి గలడు అతనికి విభాండకుడను వాడు బుట్టెను ఆ విభాండకుడు మహాజ్ఞానియై కొన్ని వేల వత్సరంబులు తపస్సుజేసెను అతడు బ్రహ్మనిష్ఠుడై అస్ఖలిత బ్రహ్మచారియై యుండ నొక్కనాడాతని వీర్యము స్ఖలనమై గడ్డి యందుబడెను దానినొక హరిణిభుజించి గర్భముధరించెను ఆహరిణియందు మానవాకారము గలనొక శిశువుదయించె వానినొసటనొక శృంగముండెను విభాండకుడా బాలుడు తన కుమారుడని గ్రహించి వానిని పెంచిపెద్దచేసెను నొనటశృంగముండెగాన నాతడు ఋశ్యశృంగుడనబరగె జన్మించిన దాదిగా అడవులయందే దిరుగుచు తన తండ్రిని తండ్రికడకు వచ్చెడితపశ్శాలురను దప్పనితరజాతినే యెరుంగక తండ్రి యాజ్ఞలనే దలదాచ్చుచు మహాతపస్వియై అస్ఖలితబ్రహ్మచారియై యుండె అతడి ప్రతిభాశక్తివలన నతడున్నచోట నెలమూడువర్షములతో పృథ్విసస్యశ్యామలమగును

ఒకానొకప్పుడు అంగదేశమును రోమపాదుడను రాజుపాలించు చుండెను రాజదోషము ప్రజలబాధించునను నార్యోక్తి ననుసరించి అతని పాలనలో అనావృష్టి యేర్పడి ద్వాదశ వర్షములు వర్షములు లేక భూమి బీటలువారి ప్రజలను క్షోభింపజేసె అంత రోమపాదుడు యెవ్విధంబున నీ ఉపద్రవము దొలగగలదని 83

ఆ వె -చింత జెంది రాజు చేరెను గురువుల
వంత దీరిజనులు వాసి నొంద
నేమిజేయవలయు నీవిపత్తు దొలగ
మాన్యులారజెపుడి మార్గమెద్ది 84

కం - ఈదుర్భిక్షము బాపను
నా దుఃఖము పారద్రోలి ననురక్షింపన్
వేదనదీర్పంగలిగెడి
నా దినములు జక్కజేయు నాధులు మీరే 85

గద్యము - అనిదురవెల్లెడిరాజునుజూచి గురువులును పురోహితులునగు ద్విజోత్తములు యోచించి విభాండక మహాముని పుత్రుడు ఋశ్యశృంగుడను నొక మహాత్ముడు గలడు అతడెందున్ననందు నెలమూడు వర్షములభూమిసస్యశ్యామలమగు గాన నాతడినిదోడ్కొని రావలెనన నాతడెందుండు వాడు వానినెవ్విధంబున దోడ్కొని రావలయు మీరే ఆనతిండనిరాజు కోరెను అంత నాగురువులు 86

కం - వానిని దోడుకురావలె
పూనికతో భూమిదడుపు పూజ్యుడతండే
మానిని నెరుగక యుండెన్
వినియమము తోడ నైన నిట నిలుపవలెన్ 87

గద్యము - స్త్రీ రూపమైన నెరుంగక నస్ఖలిత బ్రహ్మచారి యైయున్న వాడు కావున నతనికి కామవికారములు గలిగింపజాలిన వేశ్యలను బంపిన వారు తమ రూపురేఖావిలాసముల బ్రదర్శించి వానినాకర్షింపగలుగుదురన రోమపాదుడు గురువుల నానతి నెరజాణలగు సుందరాంగులను వారి వెనుక వలసిన వస్తుజాలములతో కొంత భటవర్గమును సహాయముగా బంపెను వారును పల్లెలు పట్టణంబులు గమించి నిర్జనారణ్యముల బ్రవేశించి విభాండక మహాముని యాశ్రమమునకు దవ్వుల విడిసిరి 88

కం - వనమందు ఋశ్యశృంగుడు
గనుగొని వారలను వింతగా మది దోపన్
వినయము భయమును బెనగొన
జనియెను ఆదరికి గొంత సంబరమొదవన్ 89

గద్యము - చని వారల తనూలతావిలాసముల కచ్చెరు వొందుచు తపోనిష్ఠయే తననొసటగల శృంగమునకు గారణమని తండ్రివలనవినియున్నందున ఇప్పుడీవిలాసినుల వక్షంబుల రెండుశృంగములున్నవి వీరెంత తపోధనులో యనిభయవినయముల వారికి నమస్కరించెను ఆజవ్వనులు తమకోమలమైన హస్తములతో ఋశ్యశృంగుని శరీరమును స్పృశింపుచు అతని హస్తములు తమ చెక్కులందును

ఉరోజవములందును హొత్తుకొనుచుండ అర్ధనగ్నవముగా
నృత్యగానవిశేషంబులనతనికి బారవశ్యము ను గలిగించిరి
ఋశ్యశృంగుని శరీరము పులకాంకురమై కామవికారములు బెల్లుబికెను
అది గమనించి యావేశ్యలు తమచుంబనాలింగనాది చేష్టల
నాతనిపెక్కువిధముల నాకర్షించిరి రుచికరమగు భక్ష్యముల దినిపించి
మధుర రసంబులద్రావించిరి అట్టి పదార్థంబులెరుగమి ఈఫలంబులే
వృక్షముల ఫలించునని అడుగవారునుఇట్టివి మా పట్టణమున
పెక్కులుగలవు నీవు మ తోడవత్తువేని జూపెదమన నాతడియ్యకొని
వారివెంట బయనమయ్యెను ఈవిధమున నావారకాంతలు
ఋశ్యశృంగుని తమపట్టణమునకు దీసికొనివచ్చిరి
ఆమహాత్ముని[ప్రభావమున ఆకసమువేఘావృతమై [వజల
మానసముల కుత్సాహము వెలయించెను రాజును పరివారముతో
నాఋశ్యశృంగునెదుర్కొని అంతఃపురవుు[బవేశించగనే
పర్జన్యగర్జనమ్ములకొక్కారు మెరుపుతీగలతో కుంభవృష్టి గురిసెను
భూమిసస్యశ్యామలమయ్యె దేశముసుభిక్షమయ్యెను
రోమపాదుడుతనయేకైకపు[త్రిక శాంతనాఋశ్యశృంగున కిచ్చి
వివాహముగావించెను ఋశ్యశృంగుడారాకుమారితో
పెక్కురీతుల[గీడించుచు తన తపోదీక్షచే నారాజుచేత ననేకయజ్ఞంబులు
జేయించుచుండెను ఇప్పుడతడు శ్వశురగృహమున నుండె గాన
మనమిప్పుడచటకేగి ఆరాజును వేడుకొని శాంతాసహితుడగు
ఋశ్యశృంగుని దేవలయునన దశరధుడు సుమం[తుని వాక్యములకలరి
వసిష్ఠవామదేవాది గురువులఋరక్కరించుకొని
మం[తిసామంతభటవర్గముతో - 90

కం మునికులతిలకుని గొనిరా
పనిబూనియు వెడలెరాజు పయనమ్ములతో
వనములు నదులును గడచుచు
జనపదములు గడచియరిగె జనపతి కడకున్ 91

గద్యము - రఘువంశయశోభూషణుడగు దశరధునిరాక పౌరులవలనవినిన
వాడె రోమపాదుడు సంతసంబున నెదురేగి తోడితెచ్చి అతిథిమర్యాదల

నాదరించెను ఒండొరులు బాల్యమున సహాధ్యాయులగుట మైత్రిని బంధుత్వమును బురస్కరించుకొని ముచ్చటించిరి కుల గురువులగువసిష్టులు ఋశ్యశృంగుననేకరీతుల బ్రస్తుతించి తాము వచ్చిన కార్యమును దెలిపి రఘుకులమును ప్రవర్ధిప జేయుటకు ఋశ్యశృంగుని శాంతాసహితముగా కోసలదేశమునకు బంపవలసినదిగా రోమపాదునిగోరెను అతడునందులకొయ్యకొని దశరథుని కనేకధనకనకవస్తువులు కానుకలుగా నిచ్చితనకుమార్తెను అల్లుని గూడనిచ్చిపంపెను 92

## దశరథుడు పుత్రకామేష్టిజేయుట

సీ - రాజురాక వినుచు రాజ్యమం దో నున్న
ప్రజలుజయమటంచు బ్రస్తుతింప
నెదురేగి హారతులెన్నియో దీరి ం
భటవర్గమెల్లను భళియనంగ
బంధువులెల్లరు బాగుగాదీవించ
నంతిపురము జొచ్చెనవని విభుడు
పట్టణమంతయు పచ్చనితోరణాల్
పసిడికాంతులు మించబాగుగాను 93

ఆ వె -సరయు తీరమంత జక్కగా జేయించి
అశ్వమేధయజ్ఞ మాచరింప
యాగమునకు శాలలన్నియు వేయించి
వేదవిధిగ నన్ని వేగజేసె 94

ఆ వె -దేశదేశప్రజలు దేశాధిపతులతో
వేదధర్మశాస్త్ర విదులతోడ
వెల్లివిరిసెనంత వేయారువేడుక
నగర మెల్లనిండె నాదములను 95

తే గీ -అశ్వమేధంబు జేసియు నవనివిభుడు
దానములు జేసె భూసురుల్ ధనివిజెంద
పట్టణంబున గలయట్టి ప్రజలకెల్ల
నన్నపానంబు లమరించె నారునెలలు 96

ఉ - మన్ననలందుచున్ మిగుల మాన్యుడితండని ప్రస్తుతింపగా
కన్నులు మిన్నులున్ జెదరు కాంచనదీప్తుల వస్తుజాలమున్
మిన్నులు ముట్ట నాదరముమించగ దానము లిచ్చియంతటన్
బన్నగ భూషణుంగృపకు బాత్రుడ గాగల నంచు వేడుకన్ 97

తే గీ -ఋశ్యశృంగుని యానతి రూఢిజేసి
దశరథేశుడు తనసతిత్రయవము తోడ
పుత్రకామేష్టి నొనరించె పుణ్యమూర్తి
విష్ణుభక్తుడు రఘువంశ వీర వరుడు 98

కం - మెచ్చిరి దేవతలందరు
నిచ్చిరి దీవెనలుపెక్కు లీప్సిత మొదవన్
వచ్చిన మహిపతులందరు
దెచ్చిరి కానుకలు మిగుల తేజము జూపన్ 99

గద్యము - అంత వైకుంఠవాసుడగు శ్రీమహావిష్ణువు దశరథుని యాగమునకు మెచ్చిన వాడై తొల్లిటి భవమునందు అదితీకశ్యపులే యీకౌసల్యా దశరథులని వారలకోర్కి దీర్ప వారిగర్భంబున తానుతన ఆదిశేషుని తోడను శంఖచక్రములతోడను చతరంశములుగా మానవజన్మము నొందగోరి - నీలవర్ణంబులైన చేలములును ఎఱ్ఱనమోమును సింహకేసరంబులబోలు రోమములును శైలశృంగమును మించునౌన్నత్యమును మధ్యాహ్నమార్తాండ తేజమును మించుదీప్తులును శార్దూల విక్రమమును మించుమహాభయంకరమగు శరీరమునుగలిగి మహాభూతమోయన పుత్రకామేష్టి యజ్ఞగుండము నుండిఉద్భవించెను అప్పుడు ఫటఫటారావముగొప్పధ్వనిగలిగె ఆభయంకరధ్వనులకును భీకరరూపమునకు నచ్చటివారందరు చేష్టలుదక్కియుండిరి ఆభయంకరమూర్తి చేతి యందొక సువర్ణపాత్రము పాయసభరితమై

యొప్పుచుండె అంతనా మూర్తిశాంతగంభీరవచనములతో - ఓ రాజా! నేను ప్రాజాపత్యమూర్తిని నీవు మహాపుణ్యాత్ముడవు సత్యవ్రతుడవు గనుక నే నేను నీకు ప్రత్యక్షమైతిని ఇతరులకిది దుర్లభము నీయాగమునకు మెచ్చి దేవతలపంపున ఈదివ్యపాయసము నీకిచ్చుటకే వచ్చితిని దీనిని నీదేవేరులకిమ్ము నీఅభీష్టము సిద్ధించునన దశరధమహారాజు ఆనందపారవశ్యమున మేనపులకలుజనింప చేతులుమోడ్చి ఆదివ్యపురుషునిస్తుతించి ఆనందాతిరేకమున రెండుచేతులుజాపి ఆపాయసపాత్రనందుకొనియె ' అమహా భూతమంతర్హితమయ్యెను దశరధుడు గురువులయాజ్ఞ గైకొని అంతిపురమునకేగి కోసలరాజపుత్రియు సద్గుణశీలయు పరమపవిత్రయు తనకిష్టమైన పట్టమహిషియు నైనకౌసల్యనుజేరి ఆదివ్యపాయసమునందు సగమునిచ్చి మిగిలినదానియందుకైకకు సగమునిచ్చి సగము సుమిత్రకు నిచ్చిపాత్రయందలిశేషభాగము మరలసుమిత్రకిచ్చెను 100

కం - సుతులను గోరుచు ధరణీ
పతి పాయసమంత నిట్లు పంచెనసతులకున్
క్షితిపతి పత్నులు ముప్వురు
నతి సంతస మంది దానినంత భుజింపన్ 101

గద్యము - దశరధుడు తిరిగియాగశాలకేతెంచి క్రతువుసంపూర్ణము గావించి పూర్ణాహుతిజేసి దైవప్రసాదములభ్యమైనందున సంతోషాంతరంగుడై దేవతారాధనలు బ్రాహ్మణారాధనలు జేసి వారల కపారధనకనక వస్తువులును నూతనాంబరములిచ్చెను వారుసంతోషించి పుత్రోదయమైనపిమ్మట వచ్చెదమని యనేక దీవనలిచ్చి తమతమనెలవులకరిగిరి గురువులగు వసిష్ఠవామదేవాదిమును లందరును తమఆశ్రమములకరిగిరి ఋశ్యశృంగుడును రాజున కనేకదీవనలిచ్చి నీకునలుగురు కుమారుదయించగలరని జెప్పిశాంతసహితుడై అంగదేశమున కేగెను దశరథమహారాజును బంధుమిత్ర జనముల సాగనంపి సంతుష్టాంతరంగుడై అంతిపురముజేరెను ప్రియసతులగు కౌసల్యాకైకాసుమిత్రలతో

ఇష్టోపభోగములనుభవించెను రాణులు ముప్వురును గర్భము ధరించిరి 102

## శ్రీ రాముని జననము

గద్యము - వదునాలుగు భువనంబులు తన కుక్షియందు నిక్షిప్తముజేసికొనగల శ్రీమన్నారాయణుడు కౌసల్యాదేవి గర్భంబున బంధింపబడి దినదినాభివృద్ధి నొందుచుండెను 103

కం - బంధంబెన్నడు లేకయు
బంధింపంబడియె తల్లిభాగ్యముపండన్
బంధుజనము మురియగ హరి
బంధనములు గోరి లోక బాధలు మాన్పన్ 104

కం - సర్వము నిండిన వాడై
పర్వతయుతభారమగుచు భామిని కుక్షిన్
గర్వాంధుల దునుమాడగ
సర్వాంతర్యామి జనని సవరించెదగన్ 105

కం - నెలలారు నిండినంతనె
కులగురువుల నడిగిమంచి గురులగ్నమునన్
జెలులకు సీమంతంబులు
వెలదులు జేయంగ దొడగె వేడుకతోడన్ 106

కం - భానుకులమ్మున విష్ణువు
పూనికతో చైత్రశుద్ధ పుణ్యపు నవమిన్
కానగ రవిమధ్యమ్మున
నానగ కర్కటక లగ్న మందున బుట్టెన్ 107

కం - సురగురువు వెలుగగా భా
స్కరుతో శుభగ్రహములన్ని చాలగనిండన్
సరిగా నేడవ తారను
వరదుడు జన్మించె రాజు వంశము పండన్ 108

కం - కౌసల్య గనెను రాముని
భాసురముగ రవికులమ్ము భాగ్యము పండెన్
పూసెను పుష్పములన్నియు
వాసిల్లెను జగము లన్ని వైభవ యుతమై 109

కం - జయజయమని జయభేరులు
జయమనుచును నాదములను జగములు నిండెన్
జయము మనరాజు కనుచును
జయ శబ్దంబులు వచించె జగదీశునకున్ 110

కం - ధరలో శేషుడు లక్ష్మణు
డరయంగా సంకుభరతు డయ్యెను జూడన్
వరచక్రము శత్రుఘ్నుడు
వరపుత్రులు నైరి రాజు వంశము పండన్ 111

గద్యము - ఆదివిష్ణువు తనచతురంశములతోను భువిపై నవతరించెను పుష్యమీ నక్షత్రమున కైకకు భరతుడును ఆశ్లేషానక్షత్రమున సుమిత్రకు లక్ష్మణశత్రుఘ్నులును జన్మించిరి పూర్ణచంద్రో దయమున పాలసముద్రమురీతి దశరథుడు పుత్ర చతుష్టయమును బడసి ఆనందపారవశ్యమున అనేకధనకనక వస్తుసముదాయము సేవక జనులకు కానుకలిచ్చి గోభూహిరణ్యంబులు భూసురులకు దనమిచ్చెను పదిరెండవదినంబున పుత్రులకు జాతకర్మాదు లాచరించి గురువగువసిష్టుల యానతి రామలక్ష్మణభరత శత్రుఘ్నులను శుభనామములు బెట్టి నగరమంతయు నుత్సవములుజేయించెను బాలురును దినదిన ప్రవర్ధమానులగుచు తలిదండ్రులకానందము గలిగించుచుండిరి 112

సీ - మూడవ నెలలోన మురిపెంపు పెదవులు
విప్పి నవ్వగ నేర్చె వింతగొలుప
నాల్గవ నెలలోన నవ్వుచు దొర్లుచు
బోరగిలగ నేర్చు బొలుపు మీర
ఐదవ నెలయందు నాటలు నేర్చెను
బొసగ నారునెలలు బిందుగాను

పడుచు లేచుచు నుండు పలుమారు రాముడు
లేచి కూర్చొనగోరు లేవలేక 113

తే గీ - ఉంగయుంగయటంచును ఊసులాడు
యెత్తుకొమ్మని జేతుల నెత్తిజూపి
తల్లిగుర్తించి నవ్వుచు దనివిజెంద
పాలుయిమ్మని కొంగులు పట్టిలాగు 114

సీ - చిన్నారిరాముడు చిరునవ్వు లొలికించు
పాలుత్రాగుచు తల్లిపమిట బట్టి
తమ్మున కిమ్మని తగసొంజ్ఞలును జేయు
తమ్ముని తనపాలు త్రాగ జేయు
తనయూయలకడను తమ్ముని యు యిల
యుండిన నేగాని యూరకొనడు
జంటవిడువకుండు జతగలక్ష్మణుడుండు
నుండగోరడు రాము డొంటిగాను 115

తే గీ - నీలిమేఘంబు మెరుపుతో నిండినటుల
నలువురాముడు లక్ష్మణుతెలుపు జూడ
మేలు కలయిక ఇదియని మెచ్చుకొనగ
మెరియు చుండిరి వారలామేడ లోన 116

సీ - ఆటపాటల తోడనలరించు జనకుని
ముద్దుముద్దుగ చాల ముచ్చటించు
తప్పటడుగు వైచి తడబాటు జెందును
పట్టుకొన్న మరల పరుగులెత్తు
పడుచులేచుచు నుండు పంకజనేత్రుడ
య్యాది విష్ణువచట నాటలాడి
పూర్వజనము నందు పుణ్యంబు యిదియని
రాజు తనివి జెందు రాణి మురియు 117

తే గీ - బాలుడగు రాముడచ్చట బాల్యలీల
శైశవంబున తలిదండ్రి చాలమెచ్చ

వారి ముచ్చట దీర్చుచు వాసిగాంచె
నలసితివి చాలునని తల్లి యాదరింప 118

సీ - కౌసల్య బిడ్డల గారాబమున బెంచి
గోరు ముద్దలు బెట్టు కొసరి కొసరి
కైకమందిరమున కాకుత్స్థుడాడును
తమ్ముల తోగూడి తండ్రియెదుట
అలసుమిత్ర సుతుల అందాలు దిద్దును
నేర్చును ఆటలు నెనరు జూపి
నలుగురు బాలురు నరనాథు కడనుండ్రు
ముగ్గురు తల్లులు ముదము జెంద 119

తే గీ -రాత్రిమధ్యమున నిద్ర రాముడెపుడు
కైక వద్దకు బోవంగ కంకటిల్లు
కడకు కౌసల్య రాముని కైకకివ్వ
నాదరంబున నాయమ యందుకొనును 120

తే గీ -పాలుత్రాగెడి యాచిన్న ప్రాయమందు
రాముడొకపరి యైనను రాజుతోడ
పిన్నతల్లుల యిండ్లకు వెళ్లగోరు
యెత్తికొనిపోవ సైగల నెలమి జేయు 121

సీ - రాముని మాటలు రత్నాల మూటలు
శ్రీరాము నడకలు చిత్రగతులు
చందమామను బట్ట ముందుకు దూకును
అందలేదని చాల యలమ టించు
జాబిల్లిదెమ్మని చాలగ నేడ్చును
గారాలు బోవును గానజెంది
యెన్నియిచ్చినగాని యేడ్చుచు తల్లిని
పెక్కుచిక్కులబెట్టి తిక్కజెందు 122

తే గీ -ఏడ్పు చుండిన పసిబాలు నెత్తుకొనుచు
రాజు దరిజేరి కౌసల్య రాము జూప

మంత్రియద్దము నందున మలిపె చంద్రు
చంద్రుబట్టితి ననిరామచంద్రు డనయె 123
సీ - తలయంటి ముంగురుల్ దడియార్చి ముడివైచి
యురమున పతకము నూగులాడ
మకరకుండలములు మణికాంతి రేఖలు
నీలిచెక్కుల యందు నిలచి మెరయ
చేతికంకణములు జిగిజిగి లాడగ
రత్నహారము లన్ని రంగులీన
కాళ్లగజ్జెలు ఘల్లుఘల్లని మ్రోయంగ
కటినూలు రత్నాలు కాంతి మెరయ 124
తే గీ -పరుగులెత్తుచు రాముడు ప్రభలుజిమ్ము
పాలుబువ్వను జూచితే పారిపోవు
పట్టబోయెడి తల్లికి పట్టుబడక
గారవమ్మున మిక్కిలి గంతులేయు 125
కం - రార రామా వేగమె
రారా నాతండ్రి రార రఘుకులసోమా
రారా దశరథ నందన
రారా నానోముపంట రారా రామా 126
కం - బువ్వదిని యాడుకోరా
దవ్వులనే బూచివాడు దాగుండె జూమీ
నువ్వీ బువ్వను దినుచో
నవ్వల దరిమెదరు వాని నందరు యిపుడే 127
తే గీ -ఎన్ని జెప్పనగానినా చిన్ని తండ్రి
బువ్వదినవేమి జేతురా బుజ్జితండ్రి
తమ్ములందరు వచ్చిరి తలి కైక
బువ్వదిని నిన్నురమ్మనె బోదుగాని 128
తే గీ -అనుచు కౌసల్య రాముని యాదరింప
తల్లిచెంగటజేరను తన్మయమున

కైకపిుయును వినగనే గంతులెయు
తల్లి కౌసల్య కైకమ్మ తనకు సమము 29

గద్యము - ఈవిధముగా రాముడుశైశవమున తనతలిదండ్రులవద్ద గారాబముగాపెరుగుచు తమ్ములతోడను తనయీడు చెలికాండ్రతోడ నాడుచుబాడుచు పెరుగుచుండెను దశరథమహారాజు వసిష్టులయాదేశమున తనయులకు నేడవయేటనే ఉపనయన సంస్కారము జేయించెను 130

సీ - పంచశిఖలతోడ పసుపుగోచుల తోడ
యజ్ఞోపవీతము లందముగను
బంగరుగిన్నెలు బట్టుకు చేతను
దండమొక్కటిబట్టి దండిమగలు
ముద్దులవటువులై ముచ్చట గొలుపుచు
ముందుగా తల్లికి మ్రొక్కి నిలువ
భిక్ష మడుగవచ్చు బిడ్డల గనుగొని
ముదమొంది తనయుల ముద్దులాడి 131

తే గీ -పెట్టె కౌసల్యరతనాలు భిక్షయనుచు
కైకపెట్టెను వజ్రాల కంకణాలు
పెట్టెను సుమిత్ర బంగారుపెండెరములు
తండ్రిబెట్టెను కాసులు తనయులకును 132

గద్యము - ఉపనయనమహోత్సవములు జరిపించి దశరథుడునలువురు కోమరులకును అక్షరాభ్యాసము జేయించిగురువులయొద్ద విద్యలనేర్వ నియమించెను రామలక్ష్మణభరతశత్రుఘ్నులు దినదినము గురువులకడ శ్రద్ధగా విద్యలనభ్యసించుచు పంచకావ్యంబులును వేదశాస్త్రములును అథర్వణ వేదమందలి ధనుర్విద్యల నభ్యసించిరి వశిష్టులు అనేక శస్త్రాస్త్ర మంత్రములతో యుద్ధవిద్యలునేర్పిరి సాముగరిడీశాలలకరిగి మల్లయుద్ధమునుగూడ బాలురు నేర్చికొనదొడంగిరి సమస్తవిద్యల నభ్యసించి దినదినప్రవర్ధమానులై శైశవమువీడి పదియారువత్సరముల కిశోరావస్థలో ప్రవేశించిరి

ప్రతిదినమునుశ్రీ రాముడు ప్రాతఃకాలముననేలేచి నిత్యకర్మలనాచరించి తల్లియైన కౌసల్యాదేవిమందిరమునకేగి జననికి పాదాభివందన మాచరించి తన కిష్టమగు పదార్థములు భుజించి తల్లిని సంతృప్తిబరచి పినతల్లియగు కైకేయిమందిరమున కరిగి ఆమెతో కొన్ని మాటలు ముచ్చటించితమ్ములతోగూడతండ్రి దరబారునకేతెంచి తండ్రికిపేడుక గలిగించి అటనున్న మంత్రిసామంతభటవర్గమును బలకరించి వారికుశలమడిగి వారలమన్ననలంది తమ్ములతో సుమిత్రాదేవిమందిరమునకువెళ్లి ఆమెతో చతురంగముల నాడుచుండును ఆటలలో ననేకయుద్ధమర్మములనెరిగించి వారికి సుమిత్రరాజనీతిని బోధించెడిది సాయంకాలమున పురమందలి ప్రజల యోగక్షేమములరయుచు పెద్దలకు నయముగా నమస్కరింప వారును రామునివినయసంపదకు సంతసింపుచు దీవించిపంపెడివారు రాముడు తనయీడువారల నానందముగా పలకరింపుచు అనేకవిషయములు చర్చింపుచుండెడివాడు నిగర్వియైన రాముని స్నేహ వాత్సల్యముల కలరి పట్టణమందలి యువజనులు రామునితో చనువుగా ప్రవర్తించెడివారు వృద్ధ వనితలను గూడ బలకరించుచు వారియోగ క్షేమముల గనుగొనుచు వారికెట్టిలోపములును లేకుండుటకై తగిన యేర్పాటులు చేయుచుండు రాముని సహాయసహకారముల కానందించుచు మనసారా దీవించెడివారు పట్టణమందలి ఆడుబిడ్డలను తోబుట్టువులుగా భావించి వారిచీరసారెలకు సహాయము జేయుచు వారిభర్తలతో సరససల్లాపంబులముచ్చటించువాడు నగరమందలి ప్రజలందరును శ్రీరామచంద్రుని చల్లనిమనసుతో దీవించెడివారు 133

తే గీ - రామునడవడి జూచియీ రాజ్యమందు
నన్ని రాముడు మనకుండ నడలనేల
చిన్నిరాముడు మనకుండ చింతలేల
నంచు నా్రస్త్రీలుపురుషులు నలరుచుండ్రు 134

గద్యము - అంతనొక్కదినమున - 135

## విశ్వామిత్రుడయోధ్యకు వచ్చుట

సీ - వీభూతిరేకలు విస్తరింపుచు నుండ
దండకమండలుల్ దనర బట్టి
జడలు వ్రేలాడంగ జనులు భీతిల్లంగ
నేత్రాల నగ్నులు సెగడు చుండ
కాషాయధారియై కౌశికు డప్పురి
వీధులందు నడువ వెరపు గదుర
అడుగడు గునతేజ మెడలంగ జేయుచు
రాజమందిరమున రాగనంత 136

తే గీ -గాధినందను రాకను గాంచిరాజు
నర్ఘ్యపాద్యంబు లిచ్చియు నాదరించి
తనదు తనయులమ్రొక్కంప తాపసియును
పెక్కు దీవెనలిచ్చెను ప్రేమ తోడ 137

గద్యము - దశరథ మహారాజు గాధేయుని జూచి వినయముతో - 138

ఉ - ధన్యుడనైతిదేవ తమదర్శనంబుపుట నాదుజన్మయే
ధన్యతజెందె మౌనివర తావకసేవయె నాదుభాగ్యమౌ
వన్యమృగాలచేత తమ వాసముకేవిధిలోటు లేకయున్
అన్యుల చేతనీ తపము కాపదలేమియు గల్గలేదుగా 139

కం - ఈ దానుడు మీ సేవకు
మొదమ్మున నిలచియుండె మునివర నన్నున్
మీ దానుని గా గైకొని
గాదగు సేవలను గొనుచు నను దయగనరే 140

గద్యము - అనిన దశరథమహారాజు వినయవిధేయతలకును శ్రద్ధాభక్తులకును సంతసించి విశ్వామిత్రుడు రాజా! నేనొకకార్యార్థినై నీకడకరుదెంచితిని మా ఆశ్రమపరిసరములందు రాక్షసులు పెక్కుయాగడంబులు జేయుచు మహాయజ్ఞయాగాదులు పాడుచేయుచున్నారు కావున వారల దండగమదంచి

శాంతిభద్రతలుసమకూర్చుటకై నీకుమారుడగు రాముని నాతోడ బంపుము శ్రీ రాముడు సకలగుణాభిరాముడు అరివీరభయంకరుడును శత్రువిజేతయు కాగలరాక్రమ వంతుడు అందులకే నేనిట కరుదెంచితి నని బలుకు విశ్వామిత్రుని మాటలుపూర్తికాకుండగనే రామునిబంపుమను మాటవినగనే దశరథుడు గుండెఝల్లుమన భయకంపితుడై విశ్వామిత్రుని పాదములబడి కండ్లనశ్రువులుజాలువార రుద్ధకంఠముతో – స్వామీ! పసిబాలుడగు రాముడేమి రాక్షసులనంహరించుటేమి! నేనే ధనుర్బాణములుగొని మీవెంటవచ్చి మీకు శాంతిభద్రతలుచేకు ర్చెదను అందులకాన తియుడన విశ్వామిత్రుడు నవ్వుచ రాజా! నీవిప్పుడుయుద్ధముజేసి రాక్షసులనంహరింతువా! విక్రమోపేతుడగు రామునితోలక్ష్మణునిగూడ బంపుముఅన – రాజు స్వామీ! రామునివిడచి నేనొక క్షణమైన నిలువజాలను వన్నించిన న్నేగొన పొండన విశ్వామిత్రుడుక్రోధముతో మండిపడిదిగ్గునలేచెను అంతవసిష్టుడు విశ్వామిత్రుని శాంతపరచి గడగడవణకి పోవుచున్నరాజునుద్దేశించి – రాజా! రాముడు నీవనుకొనినంత పసివాడుకదు మహా పరాక్రమవంతుడు కారణజన్ముడు రాక్షససంహారమునకే అవతరించిన అవతారపురుషుడు విశ్వామిత్రునితో నున్నరాముడు న కావదయేలకలుగును? విశ్వామిత్రుడు మహామహిమాన్వితుడు అనేక అస్త్రశస్త్రవములితని యొద్దగలవు అవియన్నియు రామునకుప్రసాదించుటకే గొంపోవ దలంచెను యింకను అనేకశక్తియుక్తులితనికడ గలవు తానురాక్షసులను జంపలేకకాదు నీయందలి ప్రేమచే రామునకవి యన్నియు దెల్పి సీసుతులకు కల్యాణముగల్పింప గోరి యే వచ్చెను నిసందేహము వీడి రామలక్ష్మణులను బంపుము నీకు సర్వదా శుభమగును భయముదక్కి మునికోరికమన్నింపు మన దశరథుడు అదరెడిగుండెలతో రామలక్ష్మణులను మునికప్పగించి యనేకవిధంబుల వారి రక్షణభారము వహింప విశ్వామిత్రునివేడుకొనెను విశ్వామిత్రుడును రాజా! నీబేలతనము త్యజించుము ధైర్యముచిక్కబట్టుము వారలకు శుభముజేయగోరియే నాతోడదీసికొని

పోవుచుంటిని పితృప్రేమవలన నీవురాముని శక్తిగ్రహింపలేకుంటివి అనిరాజునేదార్చెను రామలక్ష్మణులు తండ్రికి ప్రణామమాచరించి వసిష్ఠులకు నమస్కరించి వారిసెలవంది మునివెంట బయలుదేరిరి దశరథుడు కనవచ్చు వరకు వారలచూచును భారమనస్కుడై అంతిపురము జేరెను 141

సీ - మునివెంట రాముడు ముద్దుతమ్ముని తోడ
ఇష్టువు శివునోలె వెడలుచుండె
కశికోకలుగట్టి కౌసల్య తనయులు
కాకపక్షంబులు గదులు చుండ
విల్లంబువులు బట్టి వెడలంగ వీధుల
నెల్లవారును జూచ తెలవియె
మనరాము గొంపోవ మౌనియేలను వచ్చె
యూరకుండెను మనయుర్వి పతియు 142

ఆ వె -రాముడెపుడు వచ్చు రజీవనేత్రుండు
రాము వదలియెట్లు రజు మనును
మరల రాముడెపుడు మనకంట బడునొక్కొ
యనుచు జనులు చాలయడలి రంత 143

గద్యము - విశ్వామిత్రుడు రామలక్ష్మణులతో పట్టణ
ముగడచి పెయంనమయమునకు సరయూనదికి
దక్షిణతీరమును జేరిసంధ్యానుష్టానములు నిర్వ
ర్తించి రామునిజూచి - 144

కం - రమ్మా రామా వేగమె
తెమ్మాజలములను బటకు తేబపు విద్యల్
గొమ్మా బలయితి బలయని
యిమ్మహిలో వీని నిపుడె యిచ్చెదమీకున్ 145

కం - గొప్పది యగునీ మంత్రం
బొప్పును నాకలియు దప్పిమొందగ నీకున్
తెప్పున పఠించి నడువగ
నెప్పటికిని శ్రమము గలుగ దెంతయొ మహిమన్ 146

గద్యము - అనిచెప్ప విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు బల అతిబల యను విద్యలను సమంత్రకముగాఉపదేశించెను వారును ఆ మంత్రమునుబొంది మహాతేజస్సుతో ప్రకాశించిరి ఆరాత్రి ఆ తీరమున వసించిరి మరునాడు ప్రాతఃకాలమున నిదుర మేల్కాంచి రాముడుతమ్మునితోగూడి మునికినమస్కరించి నిత్యకర్మల నాచరించి స్నానానంతరము ప్రాతరనుష్ఠానము లాచరించి బయసమై ఆ వనమున ననేకయాశ్రమములను వాటికి సంబంధించిన చరిత్రలను విశ్వామిత్రుని వలనతెలిసికొనుచుబోవుచుండ నొక ప్రదేశమగుపడెను అదితొల్లి జనస్థానమై యున్నట్టు చిహ్నాములుగలిగియు నిర్జనమై పాడుపడియుండె యీ ప్రదేశమిట్లుండటకు గల కారణమేమని రాముడు విశ్వామిత్రునడిగిన నాతడు జెప్పదొడంగె తొల్లి కందర్పుడు కామరూపముతో నీవనమున విహరించుచుండెను ఆ సమయమున పరమేశ్వరుడు తపమొనరింపుచుండుట జూచిఆహరుని నిగ్రహము సడలించెద జూడుము యెట్టివారైనను నా శక్తికి నిలువలేరనిగర్వించి రతిదేవి వారించుచున్నను ముందుకు సాగి శరమునంధించి- 147

కం - అందరమనముల నేనే
కొందల మందంగ జేసి కోరిక లెగయన్
బొందింతు సర్వప్రాణుల
డెందమ్ములు చంచలింప జిత్తజు కేళిన్ 148

కం - హరుడగ్రత మ్ము ఎయన్
పరమేశ్వరు దపముజెరిచి పార్వతి బొందన్
పరువమ్ము లెపు మ మదనుడు
శరము ంధించవైచె శర్వుని పిదన్ 149

కం - పరమే ్వరు డుగ్రుండై
పరికించగ నచట పుష్పబాణుండుండెన్
బరపెను అగ్నిజ్వాలలు
ధరలో నికమదునుడుండ దగడనివేగన్ 150

త గి -భవుని శక్తికి మదనుడు భస్మమయ్యె
దేవవరు లంత జింతించి శివుని జేరి

౦ఎు యెడబాసి రతియెట్లు బ్రతుక గలదు
౦తిని కాపాడుమా యామె పతినొసంగి 151

గీ -భక్త వత్సలుడైన యా భవుడు వేగ
ఆతని బ్రతికించ జేఎ ననంగు గాగ
౦తిని కరుణించి యామెకుపతి నొసంగె
అంగదేశము పేరుతో నలరె నిదియు 152

గద్యము - కందర్పుడు మూర్తిమంతుడై కాముడనబరగె గనఎ ఆశ్రమమునకు కామాశ్రమమనియునిట కాముడంగుడగుట చే దీనికి అంగదేశమనిపేరుగలిగెను అని ఆయాచరిత్రలు నెరిగించుచుముందునకుసె గిరి జాహ్నవినదిని దాటుచు మహాఘోషగా వినబడుచున్న జలప్రవాహధ్వనులెటనుండి వచ్చుచున్నవని అడుగు రామలక్ష్మణులకు విశ్వామిత్రుడు జాహ్నవీ నదియుసరయూ నదియు నంగమించి నవముద్రగామములగుచున్నవి ఆ నదీ ప్రవాహములకోలాహలమదియని యెరిగించెను కొంత దూరముగడచి చొచనిర్ఘనారణ్యముగుపడెను 153

## తాటక వధ

ఆ స్థలవిశేషముల నెరిగించి-

కం - యక్షిణి యొకరిత తనదగు
నక్షీణ బలంబుతోడ నచ్చటి జనుల
భక్షించి యాప్రదేశము
కక్షమెయిన్ బాడుజేసె గామిని యగుచున్ 154

గద్యము - సాధారణముగా స్త్రీలబలలుగదా దానికా బలమెట్లు వచ్చెనని రాముడడుగ విశ్వామిత్రుడు తాటకీవృత్తాంత ౹౹ జెప్పందొడంగె తొల్లిసుకేతుడనుయక్షుడు ౦౦త నర్థియై బ్రహ్మను ( ౨, తపము జేయం బ్రహ్మయును వానికొకకుమార్తె కలుగునట్టుల ఆమెవెయ్యియేనుంగుల బలమును అనురూపవర్ణనమును

గల్గియుండునటుల వరమిచ్చునా సుకేతుడుతాటక అనునా కన్యను సుందుడనురక్కసునకిచ్చి ఎవాహాముజేసెను వారికిమారీచ నుబాహులనుపుత్రులుదయించిరి ఒక నాడుసుందుడుతన క్రూరత్వమున అగస్త్యమహాముని కోపమునకు గురియై మరణించెను అదివిని తాటక భీకరమైన యాపముసు తన అసీమ శక్తిని విజృంభింప జేసి అగస్త్యుని మ్రింగబోవ - నీవు స్త్రీవై యుండి ఇట్టి భీకరాకారమును బొందితివి గాన నీకీరూపమే స్థిరముగుగాక నీవును నీపుత్రులును రాక్షసులైచరింపుడని శపించెను ఆ టినుండియు నా త టక ఆ క్షసయై మానవ భక్షిణియై యీ జనపదంబు లన్నియు నిర్జనము గ వించెను అదిగోఅదియేవచ్చుచున్నది నీధనుర్బాణములతో ద దాని వధించుమన రాముడు - 155

కం - స్త్రీలను జంపుట దోషము
యేలా వధియింతు దీని నేధర్మమునన్
మేలని ప్రజలకు ముందుగ
యీఆలనను జంప నాకునేవిధి జెల్లున్ 156

గద్యము - రాముని సంశయమును దీర్చుచు విశ్వామిత్రుడు- 157

తే గీ -ఎట్టి సత్కర్మదుష్కర్మ యేది యైన
ఖ్యాతిగానిమ్ము లేకప ఖ్యాతి గాని
యేమి ఫలితమువచ్చిన నేమియైన
ప్రజలగావంగ రావలె ప్రభువులెపుడు 158

కం - కావున సందేహింపక
నీవిపుడే జంపవలయు నీచా చారిన్
యే విధినైనను దీనికి
గావింపుము శాపముక్తి గావుము ప్రజలన్ 159

గద్యము - అదియునుగాక పూర్వము విరోచనుని కుమార్తెమందర యనునది క్రూరురాలై భూదేవిని జంపబోవ దానినింద్రుడు వధించెను ఇంద్రపదవిని బొందగోరిన భృగుపత్నిని విష్ణువు సంహరించెను గాననీవు శంకింపక యీదానవిని బరిమార్చుము తొల్లి అనేకమంది రాజులు

దు రాత్ములగు స్త్రీలను జంపరి గాన నిందుదోషములేదు అధర్మకార్యము నిన్నేల జేయమందును దీని జంపుట ధర్మమే గాని అధర్మముగానేరదు అని బోధించిన రాముడు విశ్వామిత్రునకు నమస్కరించి నారిసారించితమ్మునితో లక్ష్మణా! చూచితివా! ఈ యక్షిణి యెట్టి భీకరాకారమున భయంకర రవమున బెట్టార్చుచు వచ్చుచున్నది దీనిని జూచిన జనులుగుండెలవిసి ప్రాణంబులు బోగొట్టుకొందురు అనిజెప్పునంతలో నా దానవి రాముని పై లంఘించెను 160

కం – దారుణ బలమున రాముడు
వీరుండై దానిమీద వేసెను శరమున్
క్రూర నిశాచరి నొవ్వగ
కారుణ్యము [illegible] 161

గద్యము – శ్రీరామ [illegible] తనభయంకర శరీరమును వదలి దివ్య [illegible] ము ధరించి దివమునకేగెను తాటక వధానంతరము విశ్వామిత్రు [illegible] రామలక్ష్మణులతో తన యాశ్రమమున కరిగెను అచ్చట రామునకనేకదివ్యాస్త్రములు ప్రసాదించెను – దండ ధర్మ కాల విష్ణు వసునాలుగుచక్రంబులును ఇంద్ర వజ్ర నారాయణ క్రౌంచ ఆగ్నేయ బ్రహ్మాస్త్రములనియెడి అస్త్రంబులును మోదకీ శిఖరములను రెండు గదలను వరుణ ధర్మ కాలమనెడి మూడు పాశములును ఆర్ద్ర శుష్క యనెడి రెండు అశనులును దైత్యులు చేతదాల్చెదిరుగు కంకాళ ముసల కాపాల మనెడి మూడు శక్తులను గాంధర్వ పైశాచిక భగేషు శితేషు మానవీ నిశితములను నలుగు శరములను యింకను అనేకమహాస్త్రంబులనిచ్చెను రాముడు శుచియై తూర్పుదిశాభిముఖుడై వానినిసమంత్రకముగా స్వీకరించెను ఈ దివ్యాస్త్రములు దేవతలకైనను దుర్లభము రామా! నీ యందలి ప్రేమ చే వీనిని నీ కిచ్చితిని అరివీరభయంకరుడవై అజేయుడవై దుష్టశిక్షణ శిష్టరక్షణ జేయుమని దీవించెను మునిదత్తమైన ఆ దివ్యాస్త్రములు భృత్యులై రాముని ముందు నిలచిన రాముడువానిని ప్రేమతో స్పృశించి మీరు స్వేచ్ఛాను వర్తులై వలయుచోటికిబొండు నేను కోరిన వెంటనే

వచ్చి నా కార్యము దీర్చవలయుననన రాముని యానతినవి యథేచ్ఛన్
జనియె రాముడు విశ్వామిత్రునికి ప్రణమిల్లి - 162

కం - దేవత లైనను వీనిని
గావలెనని కోరినట్లు గనపడ దెందున్
యీవర శస్త్రంబులు మీ
పావనపదసేవవలనబడసిలిగానీ 163

గద్యము - నా పుణ్యఫలమున యీ పవిత్ర శరములు నాకొసగితమ అపారకరుణా కటాక్షంబులు నాపై బరపి న కివి ప్రసాదించిరి వీటి కుపసంహారక మంత్రములు గుడ దయచేయుడన విశ్వామిత్రుడు సహర్షమున అన్నిటికిని ఉపసంహారక మంత్రములు గూడ ఉపదేశించెను రాముడు విశ్వామిత్రుని అనుమతిని అందుకొన్ని శక్తిసంతములగు శస్త్రాస్త్రంబులను వాటికుపసంహారకములును లక్ష్మణునకుపదేశించెను రామలక్ష్మణులు దివ్యాస్త్రసంపన్నులై విశ్వామిత్రునివెంట సిద్ధాశ్రమమునకు జనిరి ఎందరో తపోధనులిచ్చట ఎద్ధి బొందిరి గాన నిది సిద్ధాశ్రమమని పిలువబడెనని ఆ ఆశ్రమ వృత్తాంతము దెల్పెను అచ్చటి మునులు గాధేయునకు ప్రణమిల్లి రామలక్ష్మణుల నాదరించిరి విశ్వామిత్రుడా మునుల బురస్కరించుకొనిమరునాడు యజ్ఞదీక్షను బూనెను రామ లక్ష్మణులు గురువునకు నమస్కరించి ధనుర్బాణములు దాల్చి యాగ రక్షణార్థము నిలచియుండిరి 164

## రాముడు మారీచ సుబాహులతో యుద్ధము జేయుట

తే గీ -యజ్ఞ శాలకు నేతెంచి యతివరుండు
రామలక్ష్మణు లాయాగ రక్షసేయ
మునుల తోడను నంతయు ముచ్చటించి
దీక్షగైకొని హోమము దీర్చెనంత 165

గద్యము - రామలక్ష్మణులకంతయు బోధించి యేడుదినములవరకు నీ యాగము కొనసాగును గానమీరు సావధానులై యుండుడనిత ను

మౌనముదాల్చి ఋత్విక్కులు వేద మంత్రములు పఠింప
యజ్ఞమారంభించెను రామ లక్ష్మణులారుదినములు రాత్రింబవళ్లు
ఆహారనిద్రలుత్యజించి కాపుగాయుచుండిరి రాముడు తమ్ముని జూచి
నేడేడవదినము మనముకడుజాగరూకులమై యుండవలయును
గురువులు సమాధి నిష్ఠయందున్నారు ఈ పాటికి నిశాచరుల కీగంధము
సోకియే యుండును నేడు తప్పక రాగలరు అని హెచ్చరించెను
లక్ష్మణుడు ధనుర్బాణములు ధరించి ఆశ్రమమునలుదిక్కుల
నంచరించుచుండెను అంతట మారీచ సుబాహులు
తమరాక్షసగణముతో గగనమార్గమున భీకర ధ్వనులుజేయుచు
మేఘములవోలె నాకసముగప్పివైచి రక్త వర్షముగురియజేసిరి
లక్ష్మణుడుతన శరములచే ఆశ్రమ ప్రదేశమంతయు ఛత్రముపగిది
కప్పిరక్తమాంసము లా ప్రదేశమున బడకుండ జేసెను రాముడు
విశ్వామిత్ర దత్తమగు మానవాస్త్రము ప్రయోగింప నదియుపెనుగాలులు
వీచుచు రాక్షసుల చెల్లాచెదరు జేసెను 166

తే గీ - ఒక్క వేటున మారీచు నుక్కడించి
విసరివైవగ నంబుధిన్ వేగ నతడు
మునుగుచును దేలుచును ఉండె నుపప్లుజెంది
వహ్ని శరమున జచ్చెనుబాహు డంత 167

కం - నేతలు జావగ నంతనె
యాతరి పరివారమెల్ల నడలుచు బారెన్
ఆతరుణమ్మున మును లతి
చేతోమోదంబునొంది జెందిరి సుభముల్ 168

గద్యము - మునులందరు రామలక్ష్మణులను దీవించి సంతసంబున
నాదరించిరి అధ్వరము సమాప్తమయ్యెను గాధేయుండునురాముని
గౌగలించుకొని నీవు గురుఋణము దీర్చితివి నీకుశుభమగునని
దీవించెను రామలక్ష్మణులు గాధేయునకుప్రణమిల్లి మేము మీ
కింకరులము మీ చెప్పిన చొప్పున నడచువారము అది మా
కర్తవ్యమని బలుకరామలక్ష్మణులవినయవిధేయతలకు విశ్వామిత్రుడును

అటనున్న మునులును సంతసించిరి అంతనా మునులు - దశరాధాత్మజా! మిధిలానగరమున జనకుడనునొక దొడ్డరాజుగలడు అతనివద్దపరమేశ్వరుని దివ్య కోదండము గలదు అదిదేవతాలబ్ధమై యంతనియింట నిత్యమ్మూజలందుచున్నది దాని మహాత్మ్యంబత్యద్భుతము ఆ దివ్య చాపము సుర యక్ష, కిన్నర గంధర్వాదులే యెక్కువెట్టజాలరు యికనరులమాటజెప్పనేల మేమిపుడా మిధిలకుజని ఆ శివ కోదండమును దర్శింపదలంచితిమి మీరును వత్తురే యనరాముడు గాధేయునిదెస జూచెను విశ్వామిత్రుడును రామలక్ష్మణులను వెంటదీసికొని తాపసులతో మిధిలానగరమునకు బయనమయ్యెను ఆశ్రమమున గలమృగ పక్షి సంతతి మునివెంట రాగ జూచి గాధేయుడువాటినిబుజ్జగించి వెనుక బోవ నానతిచ్చి ముందునకు సాగెను సాయంకాలమువరకు బయనించి అస్తాద్రికరుగు సూర్యభగవానున కర్ఘ్యప్రదానము గావించిరి ఆ స్థలమహాత్మ్యము నడుగ విశ్వావిత్రుడు జెప్పదొడంగెను

169

## విశ్వామిత్రుని జన్మవృత్తాంతము

గద్యము - రామచంద్రా! ఇదిపవిత్రమైన దేశము తొలికుశుడను రాజు రాజయోగియై దీనిని బాలించెను ఆ కుశునకు కుశనాభుడుగలిగెను కుశనాభునకు నూర్గురుకుమార్తెలుగలిగిరి వారి సౌందర్యమత్యద్భుతము వారిని జూచి వాయువు వారిని కామించెను కానివారుదానికియ్యకొనక తండ్రిచాటు బిడ్డలము మా తండ్రిఅనుమతిని గ్రహింపుమంతియే కాని తొందరపడరాదని బల్కిన వాయువు కోపించి నాకోర్కినిరాకరించిరిగాన కురూపులైయుండుడని శపించెను వారుతండ్రివద్దకేగి విషయము నెరిగించిన రాజుమండిపడెను అంతనా యువతులుతండ్రిని శాంతపరచి మాప్రారబ్ధమునకై ఇతరులను శిక్షించనేలయని వాయువును క్షమింప జేసిరి క్షమాశీలురగు వారి

యౌదార్యమునకు మెచ్చికుశనాభుడు కాంపిల్యపురాధినాధుడగు బ్రహ్మదత్తునకు వారినిచ్చి వివాహమును గావించెను బ్రహ్మదత్తుడు వారిపాణిని గ్రహించగనే వారుతమవిరూపమునుండి ముక్తులై మునుపటి సౌందర్యమున నొప్పిరి బ్రహ్మదత్తుడు మహాతపస్వియగు చూళి మునీంద్రునకు సోయద యను గంధర్వకన్యకను జన్మించిన ప్రజ్ఞావంతుడు గానభార్యలకు శాపమును బోగొట్టి వారితోఅనేక సౌఖ్యంబులనందెను కుశనాభుడుకుమార్తెల నత్తవారింటి కనిపి పుత్ర సంతతికై యజ్ఞముజేసెను వనికి కుశుడనుచు త్రుండుదయించె ఆకుశునకుంగాధియనను మహాత్ముడుదయించె - గాధియే మజ్జనకుడు అందు వలననే నేనుగాధేయుడనైతిని కుశ వంశమునబుట్టినందునకౌశికుడనియు బిలువబడుచున్నాను మా తండ్రియగు గాధికి సత్యవతియనునొక కన్యజనించెను నా అగ్రజయ గునాసత్యవతి సౌందర్యమున కలరి రుచికుడను నొక తపస్వి యమెను పెండ్లాడ గోరెను కాని గాధిరాజు తనకుమార్తెను వేరొక రాజకుమారున కీయవలెనని యాముని కిచ్చుట కిష్టములేక పదివేలజవనశ్వేతాశ్వములందెచ్చిన వానికే నాకుతునిత్తుగాని అన్యుల కీయనన - నా రుచికుడు తనతపశ్శక్తిచే నింద్రుని మెప్పించి పదివేలయశ్వములు దెచ్చి రాజున కిచ్చెను గాధియు మాటదిరుగలేక సత్యవతినిచ్చి వివాహముజేసెను అతి సుకుమారియైన ఆ సత్యవతిపతివెంట తపోభూములకేతెంచి- 170

తే గీ రాజమహలందు మెలగిన రాకుమారి
ఎన్నిబొవదు కష్టము లెన్ని యున్న
సదు భాగ్యము మేలని దలచుచుండు
గర్వమన్నది యెరుగక కలికియుండు 171

కం - ఆ సత్యవతియు నడవిన్
గానము జేయుచును పతికి పలువిధసేవల్
జేసియు మురిసెను తోడన్
వే ట గాంగంగిక నేడుకగు ర్మున్ 172

తే గీ -పతిని గనుగొని యొకనాడు సతియుబలికె
నాదు గర్భమ్ము పండించి నందనుండు
గలుగు భాగ్యము దయచేసి కావునన్ను
అనుచు ప్రార్థించు సతి జూచి యమ్ము నీంద్రు 173

తే గీ -డాదరమ్మున నతితోడ ననియె నిట్లు
నా తపోబలమ్మున జేతు నాతియిపుడె
దివ్యరసములు వానిలో భవ్యమైన
క్షాత్ర శక్తియు యాబ్రహ్మ శక్తియుంచి 174

కం - నీవును నీ జననియు నా
పావన రసములను శుచిగ పానముసేయన్
బోవును అపత్యదోషం
భావమ్ములునింపు పుత్రభాగ్యము గల్గున్ 175

గద్యము - అంత నాఅగ్రజ పరమానందమ్మున తనకు బ్రహ్మ జ్ఞానియగు పుత్రుడు తనతల్లికి క్షాత్ర తేజస్సుతో వెలుగు పరాక్రమవంతుడగు పుత్రుడు గలుగునిట్లు ప్రసాదించిన భర్తపాదములకు ప్రణమిల్లి తన జననిని రప్పించి యిరువురును నా రసంబులు భక్తి మెయిన్ గ్రోలిగర్భము ధరించిరి గర్భవతి యగు భార్యను జూచి రుచికుడు సత్యవతి పొరపాటున తను త్రాగ వలసిన రసమును తల్లికిచ్చి తాను క్షాత్రతేజమును స్వీకరించినదియని గ్రహించి ఓసీ! నీవు తప్పిదమొనరించితివి గాన నీకు క్షాత్రతేజస్సుతో ప్రకాశించు పరాక్రమవంతుడుదయించును నీ తల్లికి బ్రహ్మజ్ఞానియగు మునీశ్వరుదయించు నని బలికెను అంతట సత్యవతి దుఃఖించినా కుమీవంటి బ్రహ్మజ్ఞాని గావలయు నని వేడుకొనియె రుచికుడు తన శక్తి వలన కొంత ఉపశమనము గలిగించి సత్యవతిగర్భమందున్న శిశువు యొక్క క్షాత్ర శక్తి తగ్గ వానికుమారునికి సంక్రమించునట్లును తనుకుమారుడు మాత్రము జ్ఞానిగా నుండునట్లనుగ్రహించెను ఆ సత్యవతి గర్భస్థసుతుడే జమదగ్ని బ్రహ్మజ్ఞాని యయ్యెను నేను కొంతకాలము రాజ్యముజేసి తపస్వినైతిని సత్యవతి పుత్రుడగు

జమదగ్ని సాత్విక సంపన్నుడై జ్ఞాని యయ్యెను కాని జమదగ్ని కుమారుడు పరశురామునకు మాత్రము క్షాత్రతేజమును క్రూరస్వభావమును సంక్రమించెను అందువలన పరశురాముడు బ్రాహ్మణుడయ్యును క్రూరుడై మహారౌద్రమున అరివీర భయంకరుడై రాజులనందరం జంపి వారి రక్తముతో తండ్రియగు జమదగ్నికి తర్పణములిచ్చెను రాముడాశ్చర్యముతో పరశురాముడు రాజులనేల జంపె? రక్తముతో తర్పణములిచ్చుట యేమి? ఆ వృత్తాంతము దెలియ జేయుడని విశ్వామిత్రుని కోరెను విశ్వామిత్రుడు రామునకు పరశురాముని వృత్తాంతము జెప్పందొడంగె 176

## పరశురాముని చరిత్ర

గద్యము - తొల్లికార్తవీర్యార్జునుడన రాజు అసమానబలపరాక్రమములతో
మాహిష్మతీపురమును బాలించుచుండెన్ను 177

కం - అర్జున నామంబున నిల
నిర్జరులకుగూడ వెరపు నెలకొను నటులన్
దుర్జయుడై శత్రువులను
నిర్జించుచు నేలె బలము నెరపించివడిన్ 178

తే గీ -కార్తవీర్యుడు వేటాడ కాన కేగి
క్రూరమృగముల గొట్టుచు కోర్కి దీర
నలని సొలసియు నటజూచె నపని విభుడు
నిర్మలోదక మున్నట్టి నిండు కొలను 179

తే గీ -సంతసంబున నటకేగ నింత గొలిచె
వ్యాఘ్రముల తోడ గోవులు వారిద్రావ
దలచె నాతడు నిటనెక తాప సుండు
ఉండగా నేవు గాకున్న నుండవిట్లు 180

కం - అనిమదిని నిశ్చయించియు
జనపతి పరివారమంత జనుదేరంగా

కనువిందు చేయ జాలిన

మునివరు జమదగ్ని వాస భు మిని గాంచెన్ 181

గద్యము - జమదగ్నియు రాజును పరివారసవాతముగ సత్కరించి అతిథి మర్యాదలనాదరించెను వారి(శమనుబో కార్చి కొంత తడవు ముచ్చటించి తనకామధేనువునర్చించి షడ్రసోపేతముగా భోజనంబిడివారిసంతృప్తుల జేసెను కార్తవీర్యార్జునుడు కామధేనువు యొక్క మహిమను జూచి దానిని తనకిమ్మని బదులుగాఅనేక గోవులును ధనంబునిచ్చెదనని మునిని వేడుకొనియెను జమదగ్ని యందులకంగీకరింపమి రాజుకోపించి అధికారగర్వమ్మున కామధేనువును దోలుకొనిపోవుచు అడ్డగించినజమదగ్నిని అతని శిష్యులను బంధించి కామధేనువుతో గూడ తననగరవైన కేగెను సాయంనమయమున ఆ(శమమునకువచ్చిన పరశురాముడు బంధింపబడియున్న తం(డిని జూచి సంగతిదెలిసి మండిపడి తం(డినవమానించిన కార్తవీర్యుని రాజధాని కరిగి తన పరా(కమముతో వారలనెదిరించి యుద్ధమున కార్తవీర్యార్జుననిజంపి కామధేనువును దోలుకొని ఆ(శమమునకు వచ్చెను కార్తవీర్యుని పు(తులు పగసాధింప పెద్దసైన్యముతో పరశురాముడా(శమునలేని సమయమున వచ్చి సమాధినిష్ఠయందున్న జమదగ్ని తలనరికి అచ్చటి వారందర జంపి వెడలి పోయిరి ఆ(శమమునకు వచ్చిన పరశురాముడు తం(డిమరణమునకు చింతించి లోకమునగల రాజులందర జంపి రాజవంశము నాశన మొనరింతునని (పతిజ్ఞజేసెను అందులకాతడు పరమేశ్వరుని గూర్చిఉ(గతపమొనర్చి ఆమహాదేవునివలన అనేక వరముల బడసి ఆ వర(పభావమున అసమానబల పర(కమసంపన్నుడై మహిష్మతీపురమునకు జని కార్తవీర్యుని కుమారులనందర జంపి (పతిరాజ్యమునకేగి ఆరాజులజంపి ఆరక్తముతో తం(డికి తర్పణములిచ్చెను లోకమల్లకల్లోల మయ్యెను అంతకశ్యపుడు పరశురామునిదురంతము నరికట్టి శాంతిని నెలకొల్పదలచి పరశురాముని భూమిని దానమిమ్మనికోరెను పరశురాముడుతనుజయించినభూమినంతనుకశ్యపునికి ధారవోసి

అతనిఅనుమతిని వశిష్ఠునవముద్రతీరమునకేగి **తపము** జేసికొనుచుండెను కశ్యపుడుఆయారాజ్యముల నాయా రాజ**వంశీయుల** కప్పగించి శాంతినినెలకొల్పెను అనియాచరిత్ర **నంతయుదెల్పి** విశ్వామిత్రుడు తనఅగ్రజయగు సత్యవతియు పరమసాధ్విగాన తనపాతివ్రత్యశక్తిచే శరీరముతోడనే దివమున కరిగి మరల**నందుండి** కౌశికి యనుపేర నొక పవిత్రనదియై దివినుండి **భువికి దిగి** హిమవత్పర్వత ప్రాంతమున ప్రవహించి తూర్పుసముద్రమున **గలియు** చున్నది అకౌశికీనదియందు స్నానమొనర్చిన మానవులు **తమ** సర్వపాపములను బాసి దివంబున కరుగు నట్లుగా **విష్ణుదేవుని** వలనవరముపొందిన సత్యవతి తానుపవిత్రయగుట**యే** గాక యితరులనుగూడ పవిత్రము చేయగలిగినది నేనును **మిమ్ములను** మీ జనకులకప్పగించి కౌశికీనదీతీరమునకు **బోయి** తపమొనరించుకొందునని రామలక్ష్మణులతో **సంభాషించుచు** ముందునకుసాగెను ప్రాతఃకాలమునకు గంగాతీరమును జేరి**రి అందు** ప్రాతర నుష్ఠానమొనరించి 182

## గంగావతరణము

పరమపవిత్రయును విష్ణుపాదోద్భవయునగు గంగానదిని **జూచి** రాముడుభక్తిపురస్సరముగా నమస్కరించి -

కం - అసుర నదితీరమునన్
భాసురముగ నిలచి రామ భద్రుండనియెన్
భాసించి త్రిపథగామిగ
వాసిల్లెను యెట్టులనిన వారల తోడన్ 183

గద్యము - గంగాచరిత్రనెరిగించి గంగత్రిపథగామినియెట్లయ్యెనో **వివరింపుచు** విశ్వామిత్రుడిట్లనియె 184

కం - హిమవత్పర్వత మొకపరి
సమజాతంబైన హేమశైల తనూజన్

సమమగు నని బెంఢ్లాడియు
హిమవత్పర్వతము గనియె నిద్దరు సుతలన్ 185

కం - అందున పెద్దది గంగయు
పొందుగ సుమచిన్నతనయ పొలుపుగ నుండన్
అందఱు ఛిందెడి వారల
చందము గన్నిశైలఱాజు సంతస మొందెన్ 186

కం - సురలందరు వేడుకొనన్
సరియని ధ్యాగంగనిచ్చె సంతసమొందన్
పరుగులు బెట్టెను గంగయు
మురియుచు లోకులకు భుక్తి ముక్తిని గూర్పన్ 187

కం - రెండవ కూతురు నా యుమ
దండి మగండైన శివుని దలచి తపంబున్
పండించి బొందె భవునే
కొండల రాయుని యనుంగు కూతురు పేర్మిన్ 188

గద్యము - హిమవంతునిపెద్దకూతురగు గంగలోకపావనియైనది ఉమపరమేశ్వరునిపత్నియైనది పార్వతిపుత్రార్థియైపరమేశ్వరునితో క్రీడింప పెక్కువత్సరంబులుగడచెను శివుని తేజము పార్వతియందు వెలువడిన లోకభయంకరమగుమహాశక్తియుద్భవించ ప్రళయమగునని దేవతలు భయపడి వారిక్రీడ కంతరాయము గలిగించిరి అప్పుడు శివుని తేజము పర్వతము వలె క్రింద బడిన దానిని అగ్నిదేవుడు గ్రహించెను ఒకానొకప్పుడు మునులు యజ్ఞము చేయుచుండ యజ్ఞగుండమున నున్న అగ్ని అచ్చటనున్న మునిపత్నులం జూచికామించి వారిని గవయ గోరెను అగ్నిదేవుని భార్యయగు స్వాహాదేవి భర్తకు పాపముంటకుండుటకై తానే మునిపత్నులరూపములతో భర్తనుగలసెను అగ్నియు ఆరుమారులామెయందుతనలోనున్న శివతేజమును పొందించెను మహాపతివ్రతయగు అరుంధతిరూపమును ధరించ లేక పోయెను తనగర్భముందున్నశివతేజమునుభరింపజాలక స్వాహాదేవి గంగయందుపడలెను పుత్రకామినియైనపార్వతి కోరిక

కంతరాయము గలిగి నందున నామె దేవతలపై కోపించి వారికి సంతానము గలుగ కుండునటుల శపించి బహుభర్తృకవుగమ్మని భూమినిగూడ శపించెను కొంతకాలము గడచిన వెనుక తమదేవసైన్యమున కధిపతి గావలెనని దేవతలుబ్రహ్మనువేడిరి బ్రహ్మయు పార్వతి శాపమువలన మీకు సంతానముగలుగదు అగ్నియందున్న శివతేజము స్వాహాదేవిద్వారాగంగయందువిడువబడియె అందుండి దివ్యపురుషు డుదయించగలడు అతడే మీదేవ సేన కధిపతికాగలడని జెప్పెను తరువాత గంగాదేవి శివుని యొక్క ఆ దివ్య తేజమును భరింపజాలక కామధేనువును సంప్రదించి హిమశైల తలమున స్రవింపజేసెను దానివలననాప్రాంతమంతయు బంగారము వెండి తామ్రము మొదలగు లోహమయ మయ్యెను సీసము తగరము మొదలగుధాతువులు గూడనందుండి వెలువడెను అందునొక పిండమునుండి యొకకుమారు డుద్భవించెను అచ్చటనున్న కృత్తికలనియెడి మునిపత్నులు ఆ బాలునికి చన్నిచ్చి పెంచిరి ఆర్గురుకృత్తికలవద్దను ఆరుముఖంబులపాలుద్రావి యాతడు షణ్ముఖుడయ్యె కృత్తికలచేపెంచబడియె గాన కార్తికేయుడనియు గర్భస్రావమునబుట్టె గాన స్కందుడనియు బిలువబడెను ఆ బాలుడే కుమారస్వామియను పేర దేవసైన్యమున కధిపతియయ్యె నని జెప్పి విశ్వామిత్రుడు గంగత్రిపథగామినియైనవిధంబెరిగించెదను రామా! పూర్వము మీ అయోధ్యానగరమును సగరుడను రాజు పాలించుచుండెను 189

## సగర చక్రవర్తి చరిత్ర

కం - ధర్మాత్ముడు సగరుడు నిజ
కర్మల నొనరించి నిత్య కర్మరు డయ్యెన్
మర్మము లేకను ప్రజలను
ధర్మము దప్పకను అతడు దయతో నేలున్ 190

కం - సంతతి లేకను సగరుడు
చింతిల్లుచు భృగువు గూర్చి జేసెనుదపమున్
సంతోషించియు నాభృగు
వంతట నాతనికి నిచ్చె నతి సంతతిన్ 191

గద్యము - ఆవరప్రభావమున సగరునకు పెద్దభార్యకు అసమంజుడును రెండవభార్యకు అరువదివేలమందికుమారులును గలిగిరి అసమంజుడురాజమదగర్వంబున నగరమందలిప్రజలను బీడించుచు వారి పిల్లలను సరయూనదిలో ముంచి వారలేడ్చుచుండ ఆనందించెడివాడు వాని దుండగములు సహింప జాలక ప్రజలు సగరునకు మొర బెట్టుకొనిరి 192

కం - తనయుని దుర్మార్గమ్మును
గనుగొని సగరుండు చాల కళవళ పడియెన్
తన ప్రజలు సుఖము నొందగ
తనయుని విడనాడి ధర్మ తత్పరు డయ్యెన్ 193

తే గీ -దుష్టు డగువాడు తనకెంత యిష్టుడైన
తల్లి యైనను తన(ప్రియ తనయుడైన
శిక్ష జేయంగ వలె ప్రజా రక్షకొఱకు
రాచధర్మంబె యదియగు రాజు కెపుడు 194

గద్యము - వరప్రసాదమున జనించిన వాడును యువరాజుగా నున్న వాడునగు యునవుంజుని ప్రజాక్షేమముకొఱకు రాజ్యబహిష్కారమొనరించిన త్యాగపురుషుడు సగరచక్రవర్తి ఒకసారి సగరుడు యజ్ఞము జేసి యాగాశ్వమును విడువ దానివెంట సగరుని రెండవ భార్యయందు జనించిన పుత్రులందరును బయలువెడలిరి అశ్వము దేశదేశముల దిరుగుచుండ ఇంద్రుడు భీతిల్లి సగరుని వలన తనపదవికి ముప్పు వాటిల్లునని భావించి యాగాశ్వమును పాతాళంబున దాచెను సగరపుత్రులు అశ్వమునుగానక భూమియంతయుగాలించి పాతాళమున వెదుకుటకై భూమిని త్రవ్వదొడంగిరి అందువారు కపిలమహాముని ఆశ్రమము నందు మేయుచున్న గుఱ్ఱమును జూచి

కపిలమునియే దానిని హరించెనని వానిని జంపబూనిరి తన్ను జంపవచ్చు రాజకుమారులను జూచి కపిలుడు క్రోధముతో వారల భస్మముగమ్మని శపించెను 195

-రాజు జూచెను తనయుల రాక కొఱకు
యేమి జేయంగ వలెనని యెంచి తుదకు
మనుమడగు నంశుమంతుని మరలబంపె
వారి జాడలు దెలియంగ వలెనటంచు 196

ము - సగరుని పెద్దకుమారుడగు అసమంజుని కుమారుడగు అంశుమంతుడు తాతగారి సెలవంది యాగాశ్వమును వెదుక బయలుదేరెను అంతటను వెదకి కపిలుని ఆశ్రమమున కేగి విషయము దెలిసికొని బూడిదకుప్పలైయున్న పినతండ్రులగాంచి వారి మరణమునకు వగచిన అచ్చటనున్న గరుత్మంతుడతని నోదార్చి యజ్ఞాశ్వమును గొనిపొమ్ము నీ ఎత్రులకు ముక్తి గలిగించుము దివిజగంగనుదెచ్చి యిట ప్రవహింప జేసిన వారు ముక్తి బొందగలరని జెప్పెను అంశుమందుడశ్వమును గొని అయోధ్యకేతెంచి సగరునకు జరిగిన విషయమంతయు నెరిగించిన సగరుడును పుత్రశోకమున బొగులుచు యాగవుు వరినవావ్తి గావించి అంశుమంతునయోధ్యానగరమున కభిషిక్తునిగావించి శరీరమువిడచి దివమునకేగెను అంశుమంతుడు చాలకాలము రాజ్యమును పాలించి తనపుత్రుడగు దిలీపుని రాజుని జేసి తపోభూములకేగెను దిలీపుని తరువాతనీతని కుమారుడు భగీరధుడయోధ్యకు రాజయ్యెను ఆ భగీరథుడు దివిజగంగను దెచ్చి తనపితృపితామహులకు ముక్తిని గలిగించవలయునని బ్రహ్మను గూర్చి తపమొనర్చెను బ్రహ్మయువానితపమునకు మెచ్చి దివిజగంగను భువిపై భరించగల వాడా పరమేశ్వరుడు దక్క అన్యుల తరముగాదు గాన నీవాశివుని ప్రార్థించిన నీకోరిక సఫలము కాగలదనిబల్కెను భగీరథుడు శివుని అనుగ్రహముబొందుటకు శివుఎ గూర్చి తపమొనరించెను భగీరథుని దృఢసంకల్పమునకు భక్తికిని మెచ్చి కరుణానిధియగు నాగరశకుంరుడు

సగరపుత్రులకు ముక్తిని ప్రసాదించి భగీరథుని ప్రయత్నము సఫలముజేయనెంచి పరమపావని యగు గంగ భువిపై దిగిన భూమియంతయు మునిగి పోవునని ఆ గంగను ధరింప నిలచితనజటాజూటము విప్పెను - 197

తే గీ - పద్మభవునాజ్ఞ తలదాల్చి పరుగులెత్తె
కలుష హారిణి యాగంగ కదిలె భువికి
పొంగు పొంగుల వచ్చెడి గంగ జూచి
అవని కేముప్పు గలుగు నటంచు వేగ 198

తే గీ - శివుడు ఆకాశగంగను శిరము నందు
పట్టి బంధించె జడలతో గట్టిగాను
ఆ భగీరథుకోరిక నాదరించి
ఇలను ప్రవహింప బిందువులిచ్చె మూడు 199

తే గీ - ఆకసమునుండి దిగివచ్చి హరుని శిరము
నుండి దిగజారి భువిపైకి చేరెకిగంగ
పరుగులిడి యాభగీరథు పథమునెరిగి
తడుపుచును భూమి సాగర తలము జొచ్చె 200

తే గీ - రాజపుత్రుల పాపపు రాశి దొలగి
కలుషములు బాసి వారు నాకమును కరుగ
కలుగ నాభగీరథునికి గార్యసిద్ధి
తిరిగి తిరిగయ్యె నీగంగ త్రిపథగ మి 201

గద్యము - శివుని జటాజూటమునుండి వెలువడిన మూడుబిందువులును భువిపైపడినస్థలమే బిందుసరోవరమనియు మానససరోవరమనియు పేరుగాంచెను అబిందుసరోవరమునుండి గంగ ఏడుపాయలుగా ప్రవహించి 1) హ్రాదిని 2) పావని 3) నళిని యనుమూడుపాయలు హిమవత్పర్వతమునుండిప్రవహించుచు తూర్పుసముద్రమున గలియుచున్నవి మరియు 4) జక్షువు 5) సిత 6) సింధువు అనుపేరులతో పుణ్యనదులై పశ్చిమతీరమునకుజనిపశ్చిమసాగరమున జొచ్చెను 7) మిగిలిన సప్తమపుణ్యనది మహారథుడగుభగీరథుని

వెన్నంటి బరువిడదొడంగె ఆ గంగాప్రవాహమునుగనుగొనిసురవరకిన్నర కింపురుష గరుడగంధర్వాదులుఆపవిత్ర తోయములగ్రుంకులిడి భగవంతుడగు నా మహావిష్ణువును ధ్యానింపదొడంగిరి అట్లుప్రవహించుచు జహ్నుమహాముని తపోభూమి నంతయుముంచి ముందుకుసాగుచుండ జహ్నుడు కోపించిఆనీటి నంతయు త్రాగివైచెను అంత భగీరథుడు తనకార్యమునెరిగించి గంగనువిడువుమని మునినిప్రార్థించిన జహ్నుడాగంగను తనవీనులగుండా విడిచిపెట్టెను అప్పటినుండియు గంగ జాహ్నవి యనిపిలువబడెను హిమవత్పర్వతశిఖరమున బిందుసరోవరమునుండి దిగిన గంగఉత్తర భూభాగమంతయుదడుపుచు తూర్పుసముద్రమున జొచ్చియందుండి పాతాళంబునకేగి సగరపుత్రుల చితాభస్మములపై ప్రవహించి వారిని పునీతులను జేసెను దేవతలందరునుభగీరథునిగొనియాడిరి భగీరథుడును అయోధ్యకేతెంచి చిరకాలము రాజ్యసంపదలను పుత్రసంపదలను బొంది అత్యమందు భగవత్సాన్నిధ్యముజెందెను ఆభగీరథుని ప్రయత్నమువలన దివినుండి భువికి వచ్చిన గంగ భాగీరథి యైనది దివినుండి భువి^ భువినుండి పాతాళమునకు బయనించెగావున నీగంగత్రిపథగామి- యైనది కల్మష రహితయు పాపహరమును పరమ పవిత్రయు నైయుండె ఈగంగాచరిత్ర విని వారికి గంగాస్నానముజేసిన ఫలములభించును 202

కం - గంగాచరితము వినినన్
మంగళములు గలుగు ననిన మహిలో శ్రేష్ఠుకున్
గంగను దర్శించిన నా
గంగను మునిగినను ముక్తిగలుగుట అరుదే! 203

గద్యము - అని చెప్పిన విశ్వామిత్రుని వచనములకు రాముడు సంతుష్టాంతరంగుడై మునివెంట ముందున కరిగెను 204

## క్షీరసాగరమథనము

గద్యము - విశ్వామిత్రుడు రామలక్ష్మణుల తోడను మునులతోడను

బయనములు సాగించుచు విశాలా నగరము జేరెను అంతరాముడు
గురుదేవా! ఈపట్టణము పేరేమి? దీనినెవరు పాలించుచున్నారు?
దీనివిశేషమేదైన గలిగిన తెలియజేయవలెనన మునిచెప్పందొడంగె-
205

కం - ఇదియొక పుణ్యక్షేత్రం
విదిత కృతయుగమందు పూర్వమింద్రుని చేతన్
పదవీ చ్యుతులై దైత్యులు
విదితమ్ముగ బ్రహ్మచేరి వేడిరి వానిన్ 206

కం - అమరులు మమ్ముల నెప్పుడు
సమరత్వము బలిమివలన నణగగజేయన్
యమ బాధనొందు చుంటిమి
అమరత్వము మాకు నెట్లు నలవడు జెపుమా 207

**కం** - అనివేడ నా విధాతయు
వినిపించెను వారికపుడు వివరము తోడన్
చని మీరలమృత లాభము
పనిబడి సాధించి దెచ్చి పడయుడి శుభముల్ 208

**గద్యము** - బ్రహ్మవలన అమృతమును సాధించు నుపాయము దెలిసి
కొని దైత్యులు మందరపర్వతమును కవ్వముగాజేసి వాసుకిని త్రాడుగాబట్టి
దేవతలను గూడ బురస్కరించుకొని క్షీరసాగరమును మథించసాగిరి
ఆపాలసముద్రమునుండి ముందుగా హాలాహలముద్భవించెను
**ఆ**విషవాయువు సోకినంతనే దానవులు మృత్యువాతంబడజొచ్చిరి
**దేవతలు** సొలిపోయిరి వారుభయభ్రాంతులై పర్వతమును
**వ**దిలిపారిపోయిరి ఆమందరగిరి సముద్రమున మునిగె పొంగిపొరలుచు
వచ్చెడి హాలాహలమును గని హరివిరించిలిరువురు
నాయాపదదొలగింపమని శివుని ప్రార్థించిరి ఆశ్రిత జన రక్షకుడును
ఆర్తత్రాణపరాయణుడును లోకరక్షకుడునగు నాపరమేశ్వరుడా
హాలాహలమంతయుపానముజేసి కంఠమందు నిడుకొనియె
అప్పడినుండియు శివుడు గరళకంఠుడను నామము బొందెను

కంఠమునందున్న గరళమువలన కంఠము నీల వర్ణమయ్యె దాన
నాతడు నీలకంఠుడని చెప్పంబడియె - 209

కం - హాలాహల మంతయు దిని
కోలాహల మెల్ల నడచి కూరిమి తోడన్
మేలు గలుగంగ భక్తుల
కీ లీలగ నమృతఫలము నిచ్చెను శివుడే 210

గద్యము - భక్తవత్సలుడగు శివుడు గరళము భక్షింప దేవదానవులు సముద్రమథనమునకు బూనుకొనిరి గానిసముద్రమందు మునిగిన పర్వతమునెత్తజాలక విష్ణువును ప్రార్థించిరి 211

కం - ముందుకు వచ్చెను విష్ణువు
మందరగిరినెత్త గోరి మహిమాన్వితమౌ
సుందర రూపము విడిచియు
పొందుగ కూర్మంబు నయ్యె భూధరమెత్తెన్ 212

కం - హరిహరు లీవిధముగ తమ
పరివారములైన భక్త వరులను గావన్
గిరినెత్తె కూర్మమై హరి
గరళము దినిహరుడు సుధను గలుగగ జేసెన్ 213

గద్యము - శ్రమించెడి తమబిడ్డలు సజ్జనులైనను దుర్జనులైనను వారికాఫల మందజేయుటకే తలిదండ్రులు జూతురు అట్లే భగవంతుడు తనబిడ్డలగు దేవదానవులకు నమృతమందించెను పాలసముద్రమునుండి ముందుగా ధన్వంతరియు నప్సరోగణమును ఐరావతమును ఉచ్చైశ్రవమును చంద్రుడును కౌస్తుభమణియు లక్ష్మీదేవియు కామధేనువును కల్పవృక్షమును జనించెను తరువాత నమృతము లభించెను ఆఅమృతమును జూగడనే దైత్యులు భుజబలగర్వితులై దేవతలకు బెట్టుటకంగీకరింపక అమృత భాండమెత్తుకొనిపారిపోయిరి వారిదుర్మార్గమును దీనులగు దేవతలను జూచి శ్రీహరి తనమాయతో జగన్మోహినియై తనరూపవిలాసములతో రాక్షసులను భ్రమింపజేసి అమృతమంతయు దేవతలచే త్రాగించెను

తన పుత్రులగు దైత్యుల కమృతములభించలేదని దితిదేవతలపై కోపించి ఇంద్రునిజంపగల్గు కుమారుని బడయుటకై కడు నిష్ఠమెయితపమొనరించి గర్భముధరించెను అదితెలిసి ఇంద్రుడామె అశుచియై నిద్రించు సమయమునఆమె గర్భస్థపిండమును విచ్చిన్నముజేసెను అంత నాపిండము ఏడువ్రక్కలై సప్తమరుత్తులను పేరనేడుగురు పుత్రులు అంగుష్టమాత్రులై యాకసమున సంచరింప దొడగిరి ఆ దితి తపముజేసిన దీతపోభూమి దీనిని ఇంద్రుడు గొప్ప పట్టణముగారూపొందించెను ఇక్ష్వాకువంశీయులు దీనిని పలించిరి వారిలో సుమతియను నాతడు ఇప్పుడీపురమును పాలించుచున్నాడు అనిజెప్పి నగరమున బ్రవేశించెను విశ్వామిత్రుని రాక నెరిగినవాడై సుమతి వారలనెదుర్కొని వారలనతిధిమర్యాదలతోనాదరించెను తిరిగి ప్రాతః కాలమున న రాజు వద్దసెలవంది విశ్వామిత్రుడు రామలక్ష్మణులతోను మునులతోను మిధిలానగరాభిముఖుడై పయనముసాగించెను 214

## అహల్య చరిత్ర

కం - వనములు నదులు గమించుచు
జనపదములు గడచి గడచి జనుచుండగనే
జనహీనంబై దుర్గమ
వనమొక్కటి గానబడియె వారల కచటన్ 215

గద్యము - రాముడాప్రదేశమును జూచి గురువర్యా! ఈవనము తపోభూమి వలెనుండియు పాడుపడి యున్నదే మని యడుగవిశ్వామిత్రుడు రామా! ఇదిపూర్వము గౌతమ మహామునిఆశ్రమము గౌతముడు తన పత్నియైన అహల్యతో నిందుండెడివాడు ఇంద్రుడహల్య సౌందర్యమును జూచి మోహించి కామాంధుడై గౌతముడాశ్రమమున లేని సమయమున గౌతముని రూపుదాల్చి అహల్యను గలసెను వారిరువును సురతక్రీడలనుండ గౌతముడాశ్రమమునకువచ్చి తన

ఆకారముతోనున్న ఇంద్రునిజూచి కోపముతో మండిపడి
అంగహీనుడవుగమ్మని ఇంద్రుని పాషాణమవుగమ్మని అహల్యను
శపించెను తదుపరి ఇందహల్య దోషములేదని గ్రహించి
దశరథనందనుడగు రాముని పాదరజమున తొల్లిటి నీ స్త్రీరూపు
నొందగలవని బలికి హిమవాలయమునకు
బోయి తపముజేసుకొనుచుండెను అహల్య శిలయై
సహస్రవర్షములనుండియు నిరాకకొఱకెదురుచూచుచుండె
నిత్యకన్యయగు అయోనిజయై యుండి విధివశంబున నిటుండెనన
రాముడు గురుదేవా! ఈ అహల్య చరిత్ర నెరిగించుడని వేడుకొనియె
విశ్వామిత్రుడామె చరిత్రజెప్పదొడంగె 216

కం - వారిజభవు డొక పరిసతి
జేరి సరస భాషణముల వెలగుచు ~ డన్
గోరిక బెనగొన పణితో
శారద వెలిబుచ్చెనొక్క సందేహంబున్ 217

కం - ఎన్నో రూపంబులతో
చెన్నొందగ నీవు సృష్టిజేతువు గాదే
యెన్నందగు సౌందర్యం
బన్నిట యందేది జెప్పు డిపుడే యనగన్ 218

కం - చక్కదనంబున నిలలో
మక్కువగలిగించు నదియె కానిని యనగా
మిక్కిలి చాతుర్యము తో
చక్కని యొక చిన్నదాని సవరించు మనన్ 219

కం - సతి మాటలు విని [ ] మ్మయు
సతి నేర్పుర జేసెనొక్క యంగన నపుడే
అతులిత సుందరియగు నా
ఆకృతిఁగని వాణియప్పుడు హర్షముతోడన్ 220

కం - అన్నుల మిన్నగు నీసతి
కన్నుల పండుగయొనర్చు కాంతుడెవండో

మన్నించి దెల్పుమనగా
పన్నుగ గౌతమ మునీంద్రు పత్నిగ వెలయున్ 221

తే గీ -ఇంతచక్కని బాలిక నీయ దగునె
తపసి గౌతముడీమెకు దగునె పతిగ
యెంత కఠినము నీమది యెంచి జూడ
నడవి పాలుగ జేసితి యందమంత 222

తే గీ -ఇంద్ర భోగములకు దగ్గ యిందువదన
యెట్టు జేసితి వాముని జెట్టబట్ట
అనిన సతిజూచి బల్కెనా యజాడు వేగ
చేసి నప్పుడె నుదుటిపై జెక్క బడియె 223

తే గీ -ఇంద్రుగూడిన పాపాన యిలనునీమె
శిలగ నిలచును వేయేండ్ల జీవితాన
పరమ పురుషుని పాదమ్ము బడిన యంత
కలుషములు బాసి నిలచును కన్యగాను 224

గద్యము - ఎంతటి వారికైనను కర్మను దాటవశముగాదు అనివిధిచేతనే వచింవబడియె గాన ఓరావహా! నీపాదరజమువన నీమెనుదోషరహితనుజేయుమన రాముడు తనపాదముతో నాశిలనుదాకెను అహల్యనిద్రనుండిలేచినట్లుగ లేచి చేతులుజోడించి
225

శ్రీనాథ నారాయణ వాసుదేవా
శ్రీరామ భక్తప్రియ చక్రపాణే
శ్రీపద్మ నాభాచ్యుత కైటభారే
శ్రీరామ పద్మాక్ష హరే ముకుందా 226

కం - రామా దశరథ రామా
రామా నా పావశమన రవికుల సోమా
శ్యామల రూపా దేవీ
రామా కల్మష విదార రాఘవ రామా 227

గద్యము - అని స్తుతించి విశ్వామిత్రునకు ప్రణమిల్లి యతని అనుమతి బడసి గౌతమమహాముని తపము జేయుచోటికి బోయి పతిమన్ననలకుపాత్రురాలయ్యెను విశ్వామిత్రుడు రామలక్ష్మణులతో మిథిలాపురికేగెను 228

## సీతా స్వయంవరము

కం - జనకు డనురాజు మిథిలకు
జనకుండై యేలుచుండె జనులను దయతో
జనకుని వైరాగ్యమ్మా
మునివరులకు గూడ చాల ముదమొనరింపన్ 229

ఉ - ఆ జనకుండు సంతతము నాత్మను నిల్పును తత్త్వచింతలో
రాజస భావమున్ విడచి రాగమునెన్నడు జేరనీకయే
స్త్రీ జన మెంతయుండినను చిత్తము నెప్పుడు దైవమందునే
రాజిల జేయుచున్ తనదు రాజ్యము సేయుచు నుండు నెప్పుడున్
230

కం - దశరథ భూపతి యాగము
దశదిశలన్ వెలయజేసి ధన్యత నొందెన్
దశరథుని వోలె తానును
యశమును బుణ్యంబుగలుగ యజ్ఞము జేతున్ 231

కం - అని మదిని దలచి జనకుడు
తన గురువుల యాజ్ఞ వడసి దగు లగ్నమునన్
ఘనమగు యాగము సేయగ
ననువగు నొక భూమి దున్న నాజ్ఞ నొసంగెన్ 232

ఆ వె -భూమి దున్నుచుండ భూమిలో నొకపెద్ద
మందసంబు గాంచి మనుజ విభుని
చారులు దెలుపంగ జనియె నుప్పొంగుచు
తనదు భాగ్య మనుచు దలచి రాజు 233

ఆ వె -ముందసంబు దెరువ మాణిక్యము నుబోలు
ముద్దులొలుకు పాప మోము జూచి
తనదు భాగ్యమెన్న దరమౌనె యేరికి
యజ్ఞ ఫలము దొరికె ననుచు రాజు 234

గద్యము - వేదవేదాంగ పండితుల బిలువనంపి బాలిక దొరికిన విధానముదెలియజేసి అనపత్యుడనగు నాకీ కన్యలభించుట మంచిది యే యన వారును పంచాంగంబులు పరికించిఘడియలు లెక్కించి- 235

కం - ఏలా సందియ మిక నీ
బాలిక లభియించె నీదు భాగ్యము వలనన్
శ్రీ లక్ష్మియె యన జెల్లును
మేలౌన రింపంగ బుట్టె మేదిని యందున్ 236

గద్యము - అయోనిజయగు నీబాలిక లభించుట నీపూర్వపుణ్యవిశేషము ఈమెయేగాక వేరొక పుత్రికనీకు జనించునని బలికిన జనకచక్రవర్తి మహదానందంబున నాబాలికకు జాతకర్మాదులు నిర్వర్తించి ధరణీదేవి గర్భంబున జనించె గావున ధరణిజ యనియు నాగేటిచాలున బయలుబడె గావున సీతయనియు జనకునికి వరపుత్రికయైనందున జానకి యనియు బేరులు పెట్టి అల్లారు ముద్దుగా బెంచుచుండ జనకచక్రవర్తి రాణిగర్భము ధరించి యొకబాలికను బ్రసవించెను ఆబిడ్డకు ఊర్మిళయని పేరుబెట్టిరి సీతాఊర్మిళలు మిథిలానాథు నింట నతిగారాబముగా పెరుగుచు చెలికత్తియలతో నాటపాటలయందు బ్రొద్దు బుచ్చుచుండిరి చంద్రవంశీయులలో దేవరాతుడనురాజు మిథిలా నగరమును బాలించుచుండును మహాబలసంపన్నుడై సజ్జనుడై యుండెను తనపరాక్రమముతో ప్రజాకంటకులగు రక్కసులను సంహరించెను దేవతలు దేవరాతుని ప్రశంసించియొక మహాధనువునిచ్చి ఇది మహేశ్వరునికోదండము త్రిపురాసురుల జంపిన దాదిగా నిదియిచ్చటనే యున్నది నీవు మహాపరాక్రమవంతుడవు మహేశ్వర భక్తుడవుగాన దీనిని బరిగ్రహింపదగినవాడవు

అనిజెప్పిదీవించిరి అప్పటినుండియు నది మిధిలా నాథునింట
నిత్యపూజలందుచున్నది ఆ మహాధనువున్నదాదిగా మిధిలానగరము
శత్రువుల కజేయమై యున్నది అంతనొక్క నాడు - 237

సీ - చెలికత్తియలతోడ జేరి జానకిదేవి
బంతులాడుచు చేతి బంతివిసర
ధనువున్నపేటిక దరిజేరి క్రిందకు
పోవగ జూచియా చెలతు లంత
కందుకమ్మును బట్టకళవళబడుచుండ
వామహస్తంబున వనిత సీత
మందసంబును దేల్చి వారిదాని క్రిందున్న
చేబంతి బట్టి యాచెలుల కివ్వ 238

తే గీ -జనకుడది జూచి యెంతయొ చకితుడయ్యె
తనయ సామాన్య తరుణి గాదని దలంచి
ఈ ధనుస్సును ఎక్కడ నెవ్వ డోపు
వనిత చేపట్ట గలుగును వాడె యనుచు 239

## శివ ధనుర్భంగము

కం - చ టించెను నలు దిక్కుల
దీటుగ ధనువెక్కువెట్టు ధీరుని కొఱకున్
పాటలగంధిని జేకొన
మేటి మగండైన వాని మేదిని యందున్ 240

తే గీ -దేశదేశాధి నేతలౌ ధీరులంత
సీతచే పట్టగా గోరి చేరి రచట
కొండ వలెనున్న శివుని కోదండ ముగని
దండి మగలైన వీరుల గుండె లదరే 241

కం - ఎట్ట ఎదుట శివ ధనువును
బెట్టగనే దండిమగలు బిరంబులతో

నట్టిటు గదపగ లేకను
నట్టే నిలచుండి రంత నందరు జూడన్ 242
తే గీ - వీరు లందరు ముందురా వెరచి రంత
ధనువు మోపెట్ట రెవ్వరీ ధరణియందు
సీతకోరిన వరునకు జేయ కిట్లు
ప్రతిన జేసితి వెఱ్ఱినై ప్రజలముందు 243
తే గీ - జానకీ దేవికిక పెండ్లి జరుగు టెట్లు
అనుచు జనకుడు చింతించి యడలుచుండ
వచ్చె రాముడు నచటికి వైభవముగ
సీత జేకొన గలుగు విజేత యనగ 244
గద్యము - విశ్వామిత్రుడు రామలక్ష్మణులతో సభాప్రవేశము జేయగనే జనక మహారాజు సింహాసనము నుండి లేచి భక్తిప్రపత్తుల విశ్వామిత్రునకు ప్రణమిల్లి సూర్యచంద్రుల వలె మెరిసిపోవు తేజోవిరాజులగు రామలక్ష్మణులదెస జూచి వారలయభివాదము లందుకొని ఆదరసత్కారముల వారి నాశీనుల జేసెను 245
సీ - కాక పక్షములతో కదుముద్దు లొలుకంగ
కాకుత్థ్సుడా విల్లు కలియ జూచి
గురువు నానతి గొనిగుణమును సారించి
వామ హస్తంబున వంచి దాని
నారిని బిగియించి నలినాక్షు డంతట
వీరుల హృదయాలు వెల్ల బార
ఎక్కువెట్టి విరువ నెంచిన రాముని
ధాటికి యావిల్లు దాళలేక 246
తే గీ - ఫెళఫెళా రావముల విల్లు ఫెళ్లు మనియె
దండి మగలైన వీరుల గుండెలదర
సభను గలయట్టి పెద్దల సంజ్ఞ లుడుగ
రాజు హృదయాన సంతోష రాశి నిండ 247
గద్యము - ఒక్క నిమేష మాత్రము నిశ్శబ్దమైన సభ తిరిగి కలకలమయ్యె అంతజనక చక్రవర్తి రాముని గౌగలించుకొని శిరము మూర్కొని సీతకు

దగిన జగజెట్టి ఈతడే యని సంతసంబున విశ్వామిత్రుని జూచి - మునివరా! ఈ ధీరుడెవ్వరి తపఃఫలము? నాతనయ జానకిని చేపట్టి నన్ను ధన్యుని జేయ నేతెంచిన శ్రీమహావిష్ణువు వోలె వెలుగొందుచున్నాడు ఈతని తలిదండ్రులెవరు? ఆనతీయ వలయుననన విశ్వామిత్రుడు రాజా! నీవనినట్లితడు కారణజన్ముడు కోసలాధీశుడగు దశరథమహారాజు జ్యేష్ఠపుత్రుడు పట్టమహిషియైన కౌసల్యాదేవి గర్భ శుక్తిముక్తాఫలము అసమాన బలపరాక్రమ తేజో విరాజుడు లోకకంటకి క్రూర నిశాచరియగు తాటకను వధించి మారీచుని తృళ్లడగించి సుబాహుని జంపి గౌతమపత్నియగు అహల్యకు శాపోపశమనము గావించి నీ ధనుర్యాగము జూడ నిచ్చటికేతెంచె నని జెప్ప రాజును సభాసదులును సంభ్రమాశ్చర్యముల రాముని గొనియాడిరి జనక చక్రవర్తి గురువగు శతానందుడు రాముని గౌగలించుకొని రామా! నీవు నిజముగా కారణజన్ముడవు నాతల్లియగు నహల్యనుద్ధరించిన మహనీయుడవు నా జననీజనకులిన్నాళ్ళకు కలిసికొనిరని రాముని కొనియాడి విశ్వామిత్రుని జూచి - మహాత్మా! మీశిష్యుడగురాముని బలపరాక్రమములకు కొరతయుండదు! నా తల్లికి శాపోపశమనము జేయించి మమ్ముధన్యులం జేసితిరి మీకివే నా మనఃపూర్వక వందనములు మిమ్ముసేవించి తరించని వారుందురా! రామచంద్రా! ఈ మహాత్ముని సేవించి ధన్యుడవైతివి ఈ విశ్వామిత్రుని తపశ్శక్తి అత్యద్భుతము ఈతడు సృష్టికే ప్రతిసృష్టి జేసిన అపరబ్రహ్మ రాజర్షియై బ్రహ్మర్షియై ముల్లోకముల బ్రఖ్యాతిజెందెను అని జెప్పరాముడు - మాగురువర్యులు మాకెన్నియో చరిత్రలు దెలియజేసిరి గాని తమ్ము గురించి యేమియు జెప్పలేదు మీరీ మహాత్ముని చరిత్రనెరిగించి మమ్ముధన్యులంజేయుడన శతానందుడు విశ్వామిత్రుని చరిత్రనిట్లు జెప్పందొడంగె 248

## విశ్వామిత్రుని చరిత్ర

తే గీ -దిశలు గొనియాడ గాధియు దేశమేలి
తనయు నే రాజుగావించి తపము కరిగె

తండ్రి యాజ్ఞను తలదాల్చి ధర్మ ముగను
రాజ్యమేలెను నాతడు రాజసముగ 249

కం - అరివీర భయంకరుడై
కరమురముగ ప్రజలనేలె కౌశికు డంతన్
పరివారముతో నొకపరి
నరుదెంచెను వేటలాడ నటవీ స్థలికిన్ 250

తే గీ - పరుగులెత్తెను మృగముల బట్టి బట్టి
అలసి జూచెను రాజొక ఆశ్రమంబు
మునివసిష్టుని దరిజేరి మ్రొక్కి నిలచె
ఆ మునీంద్రుడుగని రాజు నాదరించె 251

గద్యము - వసిష్టుడు విశ్వామిత్రమహారాజు నతిథిసత్కారములతో నాదరించి తనకామధేవును నర్చించి రాజునకును పరివారమునకును మృష్టాన్నంబుల దృప్తిగావించెను విశ్వామిత్రుడా కామధేనువు మహాత్మ్యంబున కచ్చెరువంది దానిని తనకిమ్మని వసిష్టుని వేడుకొనెను వసిష్టుడందుల కియ్యకొనమి వారిరువురి మధ్యను వాదోపవాదముల తో పాటు యుద్ధము గూడ సంభవించెను విశ్వామిత్రుడు వసిష్టుని తపశ్శక్తనెరుంగక తన శరాసనమున అనేక వాడిబాణములు ప్రయోగించి ఆశ్రమమును గప్పివైచెను వసిష్టుడు తన మంత్రశక్తిచే బ్రహ్మదండమును నిలపెట్టి నిశ్చింతగా సమాధి నిష్టయందుండెను విశ్వామిత్రుడు ప్రయోగించిన అస్త్రశస్త్రములన్నిటిని ఆ బ్రహ్మదండము మ్రింగుటయు ఆశ్రమమునకే విపత్తును గలుగకుండుటయు జూచి విశ్వామిత్రుడాశ్చరమునొంది బ్రహ్మశక్తిముందు తన రాజశక్తి పనిజేయదని నిశ్చయించి తనరాజ్యమునకు బోయి రాజ్యము పుత్రుల కప్పగించి తపము జేయువనములకు బోయెను 252

తే గీ - వాయు భక్షణ జేసియవారి దీక్ష
ఉగ్రతపమును జేయుచు నుండ నంత
కౌశికుని తపమింద్రుని కన్ను గుట్టె
నింద్ర పదవిని గోరియే యీ తపమ్ము 253

తే గీ - అనుచు నింద్రుడు నెంతయో యడలి వేగ
బంపె మేనక యనునొక పడతినపుడు
వచ్చె శృంగారమున మౌని వద్ద కామె
తళుకు మెరుపుల తిగన తపము జెరుప 254

ఆ వె - ఆడి పాడి మిగుల నందాలు జిమ్మించి
తళుకు బెళుకు లీను తరుణి గాంచి
మౌని తపము వీడి మానిని చే పట్టి
రాసకేళి దేలె రాజఋషియు 255

గద్యము - విశ్వామిత్రుడా మేనక తో పెక్కువత్సరంబులు క్రీడించె మేనకయు గర్భము ధరించి యొక శిశువును గని దివమున కరిగెను విశ్వామిత్రుడు తన తపశ్శక్తి వ్యర్థమైనందున చింతించి తిరిగి మరింత దీక్షతో తపమొనరించెను మేనకావిశ్వామిత్రులకు జనించిన శిశువే కణ్వమహాముని ఆశ్రమున బెరిగి శకుంతలయను పేరున పెద్దదయ్యెను దుష్యంతుడామెను వివాహమాడి భరతుడను బాలుని బడసెను ఆ భరతుని వలన భరతవంశ మారంభమయ్యెను 256

## త్రిశంకుని చరిత్ర

తే గీ - పూర్వ కాలము నొకరాజు పుణ్యమూర్తి
రాజ్యమేలె నయోధ్యకు రాజు గాను
సకల సద్గుణశాలి సౌజన్య మూర్తి
పేరుబొందె త్రిశంకుడు పెద్దగాను 257

గద్యము - ఆత్రిశంకుడు అనేక యజ్ఞయాగాదులు జేయుచు పుణ్యాత్ముడని పేరుపడసెను అతడు శరీరము తోడనే దివంబుకేగ వలెనని కోరిక గలవాడై గురువగు వసిష్ఠుని కడకేగి తన మనోరథ మెరిగించెను అందులకనువగు యజ్ఞము జేయించుమని కోరిన వసిష్ఠుడాతని కోర్కి నిరాకరించి జ తస్యమరణంధ్రువమ్ అనునది రిత్తబోవదు గాన నీ పేరాశను విడచి నీ పెద్దలు జనిన మార్గమున బోవుమని మందలించెను గాని త్రిశంకుడు తన కోరిక వీడలేక వసిష్ఠపుత్రులజేరి వారిని

ప్రతిమలాడెను వారును తమ తండ్రివలెనె జెప్పి నీ యాశఫలింపదు మాజనకుని మాటకన్యథా జరుగదనిరి రాజుకోపించి మీరు మాపురోహితులై యుండి మావలన జీవించెడి మీరు మాటధిక్కరింతురా! మిమ్మిపుడే దేశబహిష్కారము జేయింతును మరియొకరి నాశ్రయించి నాకోరిక దీర్చుకొనగలవాడను మహాతపోధనుడగువిశ్వామిత్రు నాశ్రయించిన వారు నా కోరిక మన్నించగలరని గురువును గురుపుత్రులను దూషించెను వసిష్ఠపుత్రులు కోపించి ఓరీ గురుద్రోహీ! మాజనకులగు వసిష్ఠుల వారి కంటెను విశ్వామిత్రుడు గొప్పవాడా! అతడు నిన్ను బొందితో కైలాసమునకు బంపునా! చాలు చాలు కోరరాని కోరికలు గోరి వాటిని దీర్చ లేదని గురుదూషణ జేసితివి గాన చండాలుడవు గమ్మని శపించిరి అంతత్రిశంకుడు రాజోచిత వేషమంతరించి నల్లని శరీరమును చింఎరిజుత్తును జీర్ణ వసనములును అసంబద్ధమైనమాటలు గల్గి పిచ్చివాడుగా మారి నగరము ప్రవేశించెను అయోధ్యాపుర వాసులును అంతిపురప్రజలు ను తమ రాజును గుర్తించ లేక పిచ్చివానిగా భావించి తరిమి గొట్టిరి అప్పుడు త్రిశంకుడు అడవుల బట్టి తిరుగుచు విశ్వామిత్రుని ఆశ్రమమునకు వచ్చి అతనిపాదముల బడి దుఃఖించెను విశ్వామిత్రుడు వానిని త్రిశంకుని గా గుర్తించి వానివలన విషయమంతయు విని తన్ను దూషించి రాజును శపించిన వసిష్ఠపుత్రులను చండాలురగునటుల శపించి రాజునూరడించెను ఆవన మందలి మునులను ఋషులను బిలిపించి త్రిశంకుడు కష్టితో కైలాసమేగు నటుల నెక యజ్ఞము చేయింపుడన - వారును చండాలుని చేత యజ్ఞము జేయించుట కిష్టములేకను విశ్వామిత్రుని వలన భయమును గల్గియేమన జాలక మిన్నకుండిరి అది గ్రహించి విశ్వామిత్రుడు తన తపోశక్తినంతయు వెచ్చించి అతని చండాలత్వము నివారించి యాగమున కర్తుని గావించెను 258

తే గీ -యాగ మొనరించి యతని చే యాగమునకు
తానె కర్తయు భోక్తయు తానె యగుచు
తన తపోబల మతనికి ధార వోసె
పరుల కుపకార మొనరించు భవ్యమూర్తి 259

గద్యము -   విశ్వామిత్రుని తపశ్శక్తి వలన త్రిశంకుడు శరీరముతో పైకెగరేసి
ఆకసమునకు వచ్చు త్రిశంకుని జూచి దేవతలు ఈవపరేసెను
సహించమని త్రిశంకుని క్రిందకు దిరగదోసిరి త్రిశంకుడేడ్చుచు
క్రింద పడబోవ విశ్వామిత్రుడు జూచి తనతపశ్శక్తి నంతయు వెచ్చించి
ఆకాశ మధ్యము న వానికొక స్వర్గము నిర్మించి అందునికి దిక్పాలాదుల
గల్పించి వానినందే నిల్పి ఇంద్రభోగములు నింతు మిథ్యాభోగము
లనుభవించ జేసి తనమాటను నెగ్గించుకొనెను విశ్వామిత్రుని చే
సృజింపబడిన యాస్వర్గము త్రిశంకు స్వర్గ మను పేర బిలువబడినది
బ్రహ్మ సృష్టికి మారుగా సమస్తమును గల్పించి సృష్టికి ప్రతిసృష్టి
జేసిన బ్రహ్మావతారము విశ్వామిత్రు డంత వరకును తానుజేసిన
తపమంతయు ఖర్చుకాగా తిరిగి తపమొనరింపసాగెను సమాధి నిష్టలో
కొన్నివేల వత్సరములు గడిచెను   260

## శునశ్శేపుని కథ

తే గీ - అంత నొకనాడు నొకబాలు డొరి తోడ
ప్రాణ భీతిని యేడ్చుచు పరుగు లెత్తి
వచ్చి కౌశికు పాదముల్ వద్ద నిలువ
కరుణ తోడను వానిని గౌగలించి   261

కం - ఏమిర బాలుడ నీకిపు
డే మయ్యెను నీకు శతృలెవ్వరు యిటులన్
యేమనిరి నిన్ను యీవిధి
యేమిటు లరుదెంచి నాప్ప యెరుగం జెప్పుమా   262

గద్యము - అని అడుగ నాబాలుం యేడ్చుచు తన్ను తలిదండ్రులు
యజ్ఞపశువుగా రాజున కమ్మివేసిరనియు తాను తలిదండ్రులకు
మధ్యముడ ననియు పెద్దవానిని తండ్రియు కనిష్టుని తల్లియు విడి
లేక తన్ను మాత్రము ధనాశచే రాజున కమ్మివేసిరనిన వానిమాటలవిని
దివ్యదృష్టితో విషయ మంతయు గ్రహించెను అయోధ్యను బాలింపు

అంబరీషుడు యజ్ఞము జేయ గోరి యాగాశ్వమును విడువ ఇంద్రుడా అశ్వము నపహరించి విఘ్నముసేయదలచెను అశ్వము దొరకమి రాజు యెంతయో చింతించి యాగము పూర్తిగావించునుపాయము పండితుల వలన దెలిసి కొని యాగాశ్వము నకు బదులుగా నరపశువును పయోగించుటకై తలిదండ్రుల అనుమతిని లభించిన బాలుడే బలిపశువు గావలెనని అందులకే తలిదండ్రుల అనుమతిని శునశ్శేపుని దీసికోని పొవుచుండిరి శునశ్శేపుని దీనావస్థను జూచి విశ్వామిత్రుడు వానికి బదులుగా తన కుమారులలో నొకనిబొమ్మన వారలంగీకరించలేదు తండ్రిమాటను తిరస్కరించినందున తనపుత్రులనందరను వంద సంవత్సరములవరకును చండాలులగునట్లు శపించి శునశ్శేపున కొకమంత్ర ముపదేశించి యజ్ఞస్థలమున పఠింపు మని జెప్పి బంపెను శునశ్శేపుడట్లే బలిపీఠమున నిలువబడి మంత్రము పఠించెను దాన వాని శరీరము నరకబడక నల్లేయుండె విశ్వామిత్రుని శక్తి దెలిసిన వాడుగాన దేవేంద్రుడా అశ్వమును గొనిదెచ్చి రాజునకిచ్చి శునశ్శేపుని విడిపించెను విశ్వామిత్రుని శక్తివలన శునశ్శేపున కాయువును రాజునకు యజ్ఞఫలమును లభించెను ఇట్లు తన తపశ్శక్తి నంతయు నితరులకొఱకు వెచ్చించి తిరిగి విశ్వామిత్రుడు తపముజేసెను అతని తపొదీక్షకు సంతసించి బ్రహ్మవానిని రాజర్షివి గమ్మని దీవించెను కాని విశ్వామిత్రుడు బ్రహ్మర్షిగావలయునని మరలనుగ్రతపమొనరించెను వాని తపముజెరువ ఇంద్రుడు రంభను బంపెనుగాని విశ్వామిత్రుడుచలించక రంభను నూరువత్సరముల వరకును శిలగానుండ శపించి తపస్సమాధినుండి గదలకనుండెను దేవతలందరును బ్రహ్మర్షివైతివని కొనియాడిరి గాని అతడు దీక్షచాలించలేదు అప్పుడు వసిష్ఠుడేతెంచి నీవు బ్రహ్మర్షివైతివని బల్కిన పిమ్మట విశ్వామిత్రుడు తపము చాలించెను అట్టి మహాత్ముడీ బ్రహ్మర్షియని విశ్వామిత్రుని పలువిధముల స్తుతించెను శతానందుని వలన విశ్వామిత్రుని చరిత్రనంతను విని రామలక్ష్మణులు ఆశ్చర్యమును ఆనందమును బొంది జనకమహారాజు శతానందవిశ్వామిత్రుల బురస్కరించుకొని

శ్రీరామునకు సీతాదేవినియ శ్రీసీతారామకల్యాణ పత్రిక వ్రాయించి
తన మంత్రుల నయోధ్యాపురమున కనిపనిసవారును 263

## జనకుని పంపున చారులయోధ్యకరుగుట

కం - జనకుని పంపున మంత్రులు
జనిరయోధ్యకు నువేగ చదురున గలయా
జనపతి దశరధు తోడన్
వినిపించిరి రాజునాజ్ఞ వినయము గదురన్ 264

కం - సంతసమున నా దశరధు
డంతట నావార్త దెలుప నందరు గూడన్
సంతోషించిరి పరిజను
లంతిపురము జేరిదెల్పి రా శుభవార్తల్ 265

కం - జనకునితో వియ్యమ్మ ది
తన భాగ్యంబనుచు బల్కి తగు మర్యాదల్
జనకుని మంత్రుల కప్పుడు
ఘనముగ జేయించి యిచ్చె కానుకలెన్నో 266

కం - మన రాముని పెండ్లి యనుచు
వినగనె యా నగరమంత వేడుక తోడన్
ఘనముగ శృంగారించిరి
కనుగొనగా నాఅయోధ్య కళకళ లాడన్ 267

కం - మిథిలా ధీశుని మంత్రుల
నధికముగా సత్కరించి యాదరమున దా
నధిక ధనవస్తుజాలము
విధియని దశరథుడొసంగె వేడుక దీపన్ 268

గద్యము - దశరథ మహారాజు తన బంధుమిత్రులతోడను మంత్రి సామంతాదులతోడను పరివారజనంబు తోడను చతురంగబలంబులు వెంటరా భేరీ మృదంగంబులు ఘనభోంతరాళములు మిన్ను ముట్ట

మంగళాశీర్వాదాపేతముగా శ్రీరాముని పెండ్లికి బయిలుదేరెను వివాహమున కు వలయుసంభారము లత్యధికముగా ఇక్ష్వాకువంశీయుల ఔన్నత్య మ్ముట్టిపడ ప్రజలు వేనోళ్లస్తుతి వాక్యముల ప్రశంసింప జనకమహారాజు నగరు ప్రవేశించెను జనక చక్రవర్తియు మంత్రి సామంతాదులతో దశరథమహారాజు నెదుర్కొని ఇంద్రసౌధమును మించుమందిరమున వార్లలవిడియించి సకల మర్యాదల నాదరించెను దశరథ మహారాజు రామలక్ష్మణులను గౌగలించు కొని విశ్వామిత్రులనకు వందనమాచరించి వారిసేమమడిగెను మరునడు సభాభవనమున జనక చక్రవర్తి వసిష్ఠ విశ్వామిత్ర శతానందుల బురస్కరించుకొని దశరథ మహారాజును బిలపించి సత్కరించెను గురువుల వానతి తన కుమార్తెయైన సీతను శ్రీరామునకును ఊర్మిళను లక్ష్మణునకును తన తమ్ముడైన కుశధ్వజుని పుత్రికలగు మాండవీశ్రుతకీర్తులను భరతశత్రుఘ్నులకును ఇచ్చి వివాహము జరిపించుటకై అనుమతించుడని దశరథుని వేడుకొనెను దశరథుడానందంబున జనకుని గౌగలించుకొని తన అంగీకారమునెరిగించెను గురువగు వసిష్ఠుడు ఉభయ వంశములను కీర్తించి పవిత్రమైన ఈ చంద్రార్క వంశములకలయిక లోక కల్యాణ హేతువగునని కొనియాడెను 269

## ... వంశీయుల వంశక్రమము

- ... వంశీయుల వంశక్రమంబెరిగించెను - బ్రహ్మకుమరీచియు మరీచికి కశ్యపుడును కశ్యపునకు సూర్యుడును సూర్యునకు మనువును మనువునకు ఇక్ష్వాకుడును బుట్టిరి ఆ ఇక్ష్వాకుడే అయోధ్యానగరము నిర్మించెను అప్పటినుండియు వీరికి ఇక్ష్వాకులని పేరు వచ్చెను ఇక్ష్వాకునకైదవతరమున పృథుడును పృథునకు త్రిశంకుడును త్రిశంకునకు హరిశ్చంద్రుడును హరిశ్చంద్రునకు లోహితాస్యుడును లోహితాస్యునకు దుంధుమారుడును వానికి యువనాశ్వుడును యువనాశ్వునకు

మాంధాతయు మాంధాతకు ఆరవతరమున సగరుడును సగరునకు అసమంజుడును అసమంజ నకంశుమంతుడును అంశుమంతునకు దిలీపుడును దిలీపునకు భగీరథుడును బుట్టెను ఆ భగీరథుడే దివిజగంగను గొని దెచ్చి తన పితృ పితామహులను తరింపజేసెను భగీరథునికి కకుత్స్థుడు బుట్టె అప్పటినుండియు వీరు కాకుకత్స్థులైరి కకుత్స్థునకు రఘువుబుట్టె ఆ రఘువునకు ఎడవతరమున మహా భక్తుడగు నంబరీషుడు అంబరీషునకు నహుషుడు నహుషునకు యయాతియు బుట్టిరి యయాతికి నాభాగుడును అతనికి దిలీపుడును దిలీపునకు రఘువును రఘువునకు అజుడును అజునకు దశరథుడును దశరథునకు రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు నుదయించిరి ఓ జనక మహారాజా! ఈ సూర్యవంశమందలి రాజులందరును అనమాన తేజోవంతులును పరాక్రమసంపన్నులును దైవబ్రాహ్మణ భక్తి తత్పరులును త్యాగధనులును శీలవంతులునై ప్రసిద్ధినొందిరి ఈ రఘు వంశవీరుల చరితంబతి పవిత్రమైనది వీరితో నీవు సంబంధము జేయుట నీ సుకృతమనవచ్చును అని వసిష్ఠుడు బలుక జనకుడు తమ చంద్రవంశ రాజుల వంశక్రమంబెరిగింపుమని శతానందుని కోరెను అంత శతానందుడు చంద్రవంశీయుల క్రమంబెరిగించెను

చంద్ర వంశపు రాజులలో నిమిచక్రవర్తిబలపరాక్రమ శాలియు వితరణవంతుడును సకలసద్గుణ శీలియై ప్రసిద్ధివడసెను అతనికి మిథియను వాడు బుట్టె ఆ మిథి చక్రవర్తియే యీ మిథిలా నగరము నిర్మించెను అతని పేరు మీదనేయిది మిథిలానగరమయ్యెను మిథికి జనకుడును అతనికి ఉదావసుడును అతనికి నందివర్ధనుడును నంది వర్ధనునకు సుకేతుడును సుకేతునకు దేవరాతుడును అతనికి బృహద్రథుడును బృహద్రథునకు మహావీరుడు నతనికి సుధృతియు సుధృతికి దుష్టకేతుడును అతనికి హర్యశ్వుండును వానికి మరుండును అతనికి ప్రతింధకుడు నతనికి కీర్తిరథుండును వానికి దేవమీఢుడు నతనికి సురవీరుడు వానికి మహీధ్రకుడునతనికి కీర్తిరాతుడు వానికి [illegible]రోముడు ఆ మహారోమునకు స్వర్ణరోముడు అతనికి

బ్రాహ్మరోముడు అ బ్రాహ్మరోమునకు జనక చక్రవర్తి కుశధ్వజులు జన్మించిరి వీరి పుత్రికలే జానకీ ఊర్మిళా మాండవి శ్రుతకీర్తులు పవిత్రమైన ఈ చంద్రవంశీయులు సూర్యవంశీయులతో వియ్యమందుట శుభప్రదమైనది సమతుల్యములగునీయుభయ వంశీయుల కలయిక లోకకల్యాణహేతువని శతానందుడు కొనియాడెను అంత జనక చక్రవర్తి మహదానందమున సీతాకల్యాణ మహోత్సవమునకు తగు సంభారములను సమకూర్చుకొని వివాహమాయత్తపరచెను దశరథుడు కుమారులునలుగురకును పెండ్లికిగావలసిన యేర్పాటులు గావించెను
270

## సీతారామ కల్యాణము

కం - సీతారాముల పెండ్లని
అతురబడసాగిరపుడు సచ్చరిత్రజలున్
జాతము రండని పిలచుచు
జాతరగా వచ్చిరంత జనులుత్సుకతన్ 271

తే గీ - నగరమంతయు నిండెను నాదములను
రాజ భవనమ్ములన్ని రంగులమరె
వచ్చపచ్చని తోరణాల్ పల్లకీలు
పెండ్లిపందిరి అంతయు ప్రభలు జిమ్మె 272

కం - రామయ్య పెండ్లియనుచును
భామలు కడునంతసమున బహుయత్నములం
దేమరక జేయుచుండిరి
నీమముపీడకయె వారు నింపిరి వసువుల్ 273

గద్యము - రామలక్ష్మణభరతశత్రుఘ్నులను పెండ్లికుమారులంజేసి యింతులు కైదండలియ్య కల్యాణవేదిక వద్దకు దీసుకొనివచ్చిరి 274

కం - మెల్లగయేనుగు దిగి రఘు
వల్లభుడనుజులను గూడి వచ్చుటగనియా

పల్లవ పత్రాక్షులపై
మల్లెలు సేసలును జల్లెమగువలు వేడ్కన్ 275

కం - మంగళ రూపుడు రాముడు
మంగళ వాద్యముల తోడ మగువలు బాడన్
శృంగారమ్ములు బొందుచు
బంగారపు గద్దెపైన బాగుగవెలిగెన్ 276

కం - గురువులు వసిష్టులప్పుడు
మరి మరిఘడియలను జూచి మంచిదటంచున్
బరిణయ మొనరింపంగా
తరుణులు దేవలయునిపుడు తడయకననగా 277

ఆ వె -సీత పెండ్లియనుచు చెలికత్తియలు వేగ
ఎంత ఎంత సొగసు వేడుకలను
జేసిదిద్దిరపుడు సీతమ్మనుదుటను
తిలకముంచి కాటుకలది కనుల 278

కం - చెంగావి పట్టుచీరను
రంగులు మెరియంగ గట్టి రమణులు వేడ్కన్
బంగారు జరీ రవికతొ
శృంగారము జేసి నిలిపె శ్రీలక్ష్మియనన్ 279

తే గై -చుక్క బొట్టు బెట్టి చక్కని నుదుటను
ఇందురేఖ చెక్కులందుపదిద్ది
కాంత సొగసెచించె కనక భూషలకంటె
ననుచు దిష్టిదీసి రితికలపుడు 280

కం - కలహంసలనడకలతో
ఘలుఘల్లని అందియలును గజ్జెలు మ్రోగన్
తొలకరి మెరుపులేయనగన్
వెలుగులు జిమ్ముచును వచ్చి వెలదులు నిలువన్ 281

కం - హారమ్ములు పతకమ్ములు
పేరులుగా పలకసరులు పెక్కొ నగలున్

తీరిచి పాపట బొట్టులు
పౌలీజ గంధులను తండ్రి వద్దకు దేగన్ 282

కం - ముద్దులొలుకు సీతమ్మను
ముద్దుగ జనకుండు రామమూర్తి కినిచ్చెన్
పెద్దలు దీవెన లీయగ
ముద్దియ తెల్లరును మిగుల మురియుచునుండన్ 283

కం - యుగయుగములు కొనియాడగ
జగమందలి జనులు మెచ్చ జానకి దేవిన్
జగదీశున కర్పించెను
తగునని దీవించి దేవతలునుతి యింపన్ 284

కం - శ్రీరాముని కల్యాణము
కోరిజనక రాజు సీతకోరికదీర్చన్
శ్రీరమ్యమ్ముగ జేసెను
ధారుణిగల ప్రజలు మెచ్చె తగునని బొగడన్ 285

గద్యము - జనకమహారాజు శ్రీరామునకు సీతను లక్ష్మణునకు ఊర్మిళను భరతునకు మాండవ్యిని శత్రుఘ్నునకు శ్రుతకీర్తిని యిచ్చి వైభవోపేతముగా కల్యాణములు జరిపించెను ఆ సీతారాముల కల్యాణ వైభవము వర్ణింప వేయి శిరసులు గలిగి రెండు వేల జిహ్వాలుగల ఆదిశేషునకే అలవిగాదన సామాన్య మానవుల వశమా! వధూవరుల రూపలావణ్యము లుగ్గడింపుచు జనుల మందానందమునొందిరి విశ్వామిత్రుడు వధూవరులందీవించెను జనక చక్రవర్తియు దశరథ మహారాజును విశ్వామిత్రుని స్తుతించి ప్రణమిల్లిన వారి దీవించి హిమవత్పర్వతము దరికి కౌశికీ నదీ తీరమునకు తపము జేసికొననేగెను 286

## పరశురాముని గర్వభంగము

దశరథ మహారాజు జనక చక్రవర్తి అనుమతిని కుమారుల తోడను [illegible]

బయనవమ్యోను [illegible]
వస్తువాహనంబులతో పరిచారికా [illegible]
భారమనస్కుడై ప్రియపుత్రి [illegible]
శివుని విల్లు నెక్క [illegible]
ముండిపడి క్రోధాగ్నుల [illegible]
నడ్డగించెను [illegible]

కం - నరుడెవడో శివధనువున్
విరచెను గర్వంబుతోడ [illegible]
పరశువు దాల్చిన రామున్
నెరుగడె బ్రతుకంగ [illegible] [illegible]

కం - వీరులెవరైన గలరే
వీరుండే పరశురామ వీడుడుకక [illegible]
వీరులగు రాజులందరు
బీరంబులడంగి జనిరి బీతిల్లపడిన్ [illegible]

కం - ఈ వీరునిగానకయే
బోవగలడె నన్నుదాటి భూమిని [illegible]
చేవగల వీరుడెవడో
రావలెనా ముందుకిపుడు రణమున్ [illegible] [illegible]

గద్యము - అట్లు చండ మార్తాండునివలె [illegible]
జూచి దశరథుడు భయముతో చేతులు జోడించి [illegible]
మన్నించుమని వేడుకొన వానినొక్కవైపు [illegible]
లక్ష్మణుడు ముందుపడి మహారౌద్రముతో [illegible]
వచ్చి - [illegible]

కం - వృద్ధుడవు బ్రాహ్మణుండవు
యుద్ధము సేయంగ వచ్చి [illegible]
పద్ధతిగాదని జూచితి
సిద్ధముగానుంటిరమ్ము సేయుము [illegible] [illegible]

కం - రాజుల జంపితి నంచి
రోజున బీరములు [illegible] రోషము [illegible]

తేజము జూపెదవేయీ
రాజుల దెలియంగ లేవె రఘువంశజులన్ ॥ 293

కం - రాచకులము జెరిపిననీ
పీచమడంచెదను జూడు విప్రుడవనుచున్
జూచితి నిక నిన్ను విడువ
గాచుకొనుము నేడు నీకు కాలముమూడెన్ 294

గద్యము:- అని ఖడ్గము దీసిన లక్ష్మణునాపి రాముడు ముందుకు వచ్చి జామదగ్ని ముఖము వీక్షించుచునాతని వద్దనున్న వైష్ణవ శరాసనమందు కొనియె దానితో పరశురామునిలో నున్న శ్రీమహావిష్ణువు అంశను గూడ గ్రహించెను అంత పరశురాముడు రాముని కన్నులలో వైష్ణవ శక్తిగనుగొని రాముడు సామాన్య మానవుడుగాడని నిశ్చయించి తన అవివేకమును అహంకారమును వదలి రాముని శ్రీమహావిష్ణువుగా గొనియాడియాతని అనుమతిని తపోభూమికిజనియె క్షణములో గల్గిన మహోపద్రవము చల్లారెనని దశరథ మహారాజు సంతసించెను 295

కం - దశదిశలు మారుమ్రోగగ
దశరథరాముండు గదలె ధరణిజతోడన్
పశుపతి కృపయేయిదియని
దశరథ భూపతియు జనియె తనయుల తోడన్ ॥ 296

కం - జయజయ నాదంబులతో
జయమని భటవర్గమెల్ల జయమని బొగడన్
జయఘోషంబులు బల్కన్
జయలక్ష్మితో జనియె రామ చంద్రుడు పురికిన్ ॥ 297

గద్యము - ఇది ఆత్రేయ గోత్రోద్భవులును ఆర్వేల నియోగి బ్రాహ్మణులును చాగంటి వంశీయులునగు జోగిరాజుగారి ధర్మపత్నియు శివభక్తి దురంధరురాలును శ్రీవామలింగేశ్వర చరిత్ర ~ మనుకావ్యకృతి కర్త్రియునగు గౌరీదేవి విరచితంబగు గౌరీ రామాయణము నందలి బాలకాండ సంపూర్ణము

# గౌరీరామాయణము

## అయోధ్యాకాండము

శా - శ్రీరాముండు సమస్తలోకనుతుడై సీతాసమేతుండునై
జేరెన్ సీమకు దేవదుందుభులు జైజై శబ్దముల్ సేయగన్
కారుణ్యాలయుడైన రాఘువునిపై కాంతామణుల్ పుష్పముల్
నీరేజంబులు సేసలక్షతలతో నివాళులందివ్వగన్ 1

ఉ - స్వాగతమయ్య రామగుణసాంద్రజగన్నుత దివ్యతేజసు
స్వాగత మోయి నీకు నిలసజ్జన పోషక దేవదేవ మా
స్వాగతమందు కొమ్ము నిజసాధ్విసతీమణి సీతతోడను
స్వాగత మోశుభాంగ పరిచారిక బృందము సేవలందుమా 2

కం - స్వాగతము రామచంద్రా
స్వాగతమో దేవవినుత సాకేతవిభూ
స్వాగతము వధూవరులకు
స్వాగతమని జెప్పినీరజాక్షులు బొగడన్ 3

కం - కర్పూర పళ్లెరమ్మున
కర్పూరారతులు దెచ్చి కాకుత్స్థునకున్
కర్పూర గంధా సీతకు
కర్పూర నివాళు లివ్వ కుడు వేడుకతో 4

గద్యము - శ్రీరాముడు సీతాసమేతుడై భేరీ మృదంగములు మ్రోవ అంతఃపుర ప్రవేశము జేస గృహదేవతల నర్చించి దేవబ్రాహ్మణ ప్రీతిగావించి పరివార జనములుగొనియాడ తలిదండ్రుల కానందము గలిగించి సుఖంబునుండెను 5

కం - సతితోడను శ్రీరాము
డతులిత సౌభాగ్యములను అందుచునుండన్
సతులందరు సీతకు సరి
పతివ్రతలై వెలుగు చుండ్రు పట్టణమందున్ 6

ఉ - నిత్యము రాజు సంతతిని నిండుగ జూచును జన్మ సార్థకం
బత్యధికంబుగాదనకు నచ్చెనటంచును సంతసించుచున్
సత్యము దప్పకుండ పురసంపద బెంచును యెల్లవేళలన్
సత్య వచస్కుడీతడని సజ్జనులందరు మెచ్చుచుండగన్ 7

కం - నలువురు కొమరుల తోడను
తొలకరి మెరుపులను బోలు తోయ జగంధుల్
కలకల లాడుచునుండగ
నలరును దశరథుడు మనసునందునసెపుడున్ 8

కం - సంతోషమ్మున దశరథు
డెంతయు మురియుచును దనకు నిలలోనింకే
వంతలు లేవని జూచెను
చెంతను గలన అద్దమందు చెంపలు నెరియన్ 9

కం - తనకర్తవ్యంబిదియని
మనమున దేచంగదాని మనలకనపుడే
చనియెను గురువుల కడకున్
వినిపించెను విషయమంత వినయముతోడన్ 10

కం - ముద్దుల కొమరుని రాముని
గద్దెను గూర్చుండ జేయగా దగునికన్
సుద్దులు జెప్పెదరనిమీ
వద్దకు వచ్చితిని యిదియెవరమగునాకున్ 11

కం - తడయక మంచిది లగ్నం
బెడమేమియు లేకవేగ నేర్పరుప వెన్
గడు వేమిలేదుగనుకను
వడిగా జరిపింపవలెను వలసినపనులన్ 12

కం - భూపతి మాటలు వినగనె
తాపసి పంచాంగములను దగుపరికించెన్
దావునగల సుముహూర్తం
బీపగిది శుభంబటంచు నెరిగించెదగన్ 13

ఆ వె - రాజు సంతసమున రాజ్యాభిషేకమ్ము
దగ్గరయ్యెననుచు దత్తరమున
జనకరాజుతోడ సరిబంధువుల బిల్వ
సమయమ్మైననింక చాలదయ్యె 14

కం - భరతుడు శత్రుఘ్నుండును
సరియగు సమయంబుకైన జనుదెంచరొకో
మరియాదగ తగు జనులను
సరివారలనైన బిలువ జాలనటంచున్ 15

కం - ఏమైనను గానిమ్మని
నీమమ్మును విడువజాల నేనిపుడనుచున్
రాముని రాజుగ జేసియు
కామితమును దీర్చుకొందు కడు శీఘ్రమునన్ 16

## రాముని పట్టాభిషేకమునకు దశరథుడాయత్తము జేయుట

గద్యము - అని దశరథ మహారాజు వసిష్ఠుని వద్ద శుభం బనిపించుకొని సభకేతెంచి మంత్రి సామంతాదులు సభాసదులగు పెద్దలకును తనమనోభీష్టంబెరిగించి మీయందరి కంగీకారమ్మైన నేటికి మూడవదినంబున శ్రీరాముని రాజ్యాభిషిక్తుని గావించనేర్పాటు చేయవలెనన సభాసదులందరునను సంతోషాంతరగులై జైశ్రీరామచంద్రునకు జై యని అభిష్టానందంబులు వ్యక్త పరచిరి పట్టాభిషేకమునకై యే యే సంభారములు సమకూర్చవలయునో గురువుల యానతి దక్షులగు నాయకుల కొప్పగించి శీఘ్రమే నగరుశృంగారము చేయనానతిచ్చెను రాజాజ్ఞననుసరించి పురజను లమితానందమున పట్టణమలంకరింప నుద్యుక్తులైరి రాజవీధిని రాజభవనములనే గాక నగరవీధులను ఇండ్లనుగూడ అలంకరింప తదుత్తర క్షణముననే ఆయా పనులందు నిమగ్నులైరి 17

ఆ వె -సత్యలోకమందు శారదాబ్రహ్మలు
సంతసమున చర్చ జరుపుచుండ
దివ్యవీణ బట్టి దేవహితము జేయ
ధరణి శాంతిబొంద తపసివరుడు 18

ఆ వె -నారదుండు వచ్చి నారాయణుడు దేవ
కార్యమంత మరచి కాంతతోడ
భూమియందునున్న భూరి సౌఖ్యములను
బొందదలచి రాజ్యమందుచుండె 19

కం - కావున నేదోనెపమున
నావలకార్యంబు జెరపి యడవికి బనుపం
గావలయును మీరందరు
నీ విధి జూడంగ దగునె యిలపై గనరే 20

గద్యము - అని బలికిన న రదుని వాక్యములకు కొంత తడవు యోచించి 21

కం - వాణిని జూచి విరించియు
జాణతనమునందు నీకు జాలరు యెవరున్
రాణియగు కైకవలనన్
రాణింపగ జేయుదనుజ రాజును జంపన్ 22

గద్యము - పతిమాటలకు సరస్వతి సమ్మతించి 23

ఆ వె -అత్తగారి మీత పెత్తనంబును జూవ
అదియె సమయమనుచు నంబుజాక్షి
కైకవరమనునొక కారణంబును జూపి
రాచకార్యమందు రభసజేసే 24

గద్యము - శ్రీరాముని పట్టాభిషేకమునకై ప్రజలందరును యత్నములు
జేయుచు నగర శృంగారమొనర్చుచు - 25

సీ - ఏ వీధి జూచినా యేవాడ జూచినా
యెన్నియో సందడుల్ మిన్ను ముట్ట
రాచనగరునంత రంగులు దీర్చంగ

వచ్చిరి పనివారు హెచ్చుగాను
కైకేయి మేడలో కట్టంగ వచ్చిరి
పచ్చని తోరణాల్ పల్లవింప
ఆసంబరము జూచి యాశ్చర్యమును బొంది
మంధర కైకతో మనవిసేయ 26

తే గీ -రామరాజ్యాభిషేకమ్ము రమణి వినగ
సంతసమ్మున తనమది సంభ్రమింప
నెంత శుభవార్త జెలితివే యింతి నీవు
కన్నులారగ జూతుమే చిన్నిరాము 27

గద్యము - అని అమందానంద కందళిత హృదయారవిందయై సంభ్రమంబున చిత్తంబు చంచలించు అట్టి శుభవార్త జెప్పిన మంధరకు తన మెడలోని ముత్యాల హారము కానుకగానిచ్చెను మంధరయు తన సహజమైన ఈర్ష్యాభావంబున కైక ఆనందమును జూచి పకపక నవ్వుచు నా హారమును విసరివైచెను అది చూచి కైక తెల్లబోయి ఏమే! నీకేమైన మతిభ్రమణము కలిగెనా? నా ముద్దులబిడ్డ రాముని రాజ్యాభిషేకమను శుభవార్త చెప్పిన నిన్ను బహూకరింప బూనిన నా చేతలు నీకింత వేళాకోళముగా నుండెనా? ఆనందపారవశ్యమున పొంగిపోవు నా హృదయమును నీవు ఖిన్నబరచుచున్నావన - మంధరయు నీ వెంత అమాయకురాలవమ్మా! నిజముగా నీకుమారుడే గద్దె నెక్కినట్లు పొందగిపోవుచున్నావు రాముడు రాజైన కౌసల్య రాజమాతయగును నీకేమి యెరిగినది? ఇంతవరకును కౌసల్య పట్టమహిషియు ఇటుపైన రాజమాతయుకాగలదు ఆ గౌరవమునీకేది ఆమె చేతి క్రింద దనబత్తెములందు కొనబోవుచున్న నీ కానందమెట్లు కలిగినది? నీకు దెలియకుండగనే నీకుమారుడింటలేని సమయమున ముసలిరాజు నీ కన్నుగప్పి రాముని రాజ్యాభిషిక్తుని జేయుచున్నాడు నీ మగడు నిన్నే ప్రేమించునని నీ చెప్పుచేతలలోనుండునని విఱ్ఱవీగుచున్న నీకీ శాస్తి చేయదలచియే కౌసల్యాదేవి మందిరమున మంతనములు జేసి సమస్త కార్యములు నిర్వహించుచుండెను నీకు మాట మాత్రమైనను జెప్పెనా? కౌసల్య రాజునుతన వైపునకు

ద్రిప్పుకొనికుమారుని గద్దెనెక్కించుచున్నది చూచితివా ఆమె నేర్పు! మరినీవో సవతియు భర్తయునేకమై సవతి కొడుకును రాజును జేయుట విని పొందగిపోవుచున్న వెఱ్ఱి బాగులదానవు ఇటుపై నీ బ్రతుకే మగునేయని నేనేడ్చుచుండ నీకు చీమకుట్టినట్లైన లేదు యిక నీవును నీ దాసినగునేనును కౌసల్యాదేవి చేతి క్రింద బ్రతుకు నీడ్వవలసినదేగదా! ఇది నీకు సంతోషదాయకమా? అని మంధర పలుక సరిగా నా సమయముననే దేవతల పంపున సరస్వతి తనమాయను కైకయందు ప్రవేశింపజేసెను సరస్వతీమాయాప్రభావంబున కైకమనస్సు సంకుచితమైన భావములతో కల్లోల మయ్యెను మంధరమాటలే చెవులయందు మార్మోగు చుండెను 28

తే గీ - ఏమి జేయుదు నాకింక నేది తెరవు
ఏ యుపాయమ్మున భరతుడేలుభువిని
నాదుభాగ్యమ్ము పండంగ నడుపుబెట్లు
మంధరానీవె దెల్పుమా మంచిమాట 29

తే గీ - అనుచు కైకమ్మ యెంతయో యడలు చుండ
మనమునందున నుప్పొంగి మంధరపడి
కైక కెరుగంగ జేసెను కాంతనీకు
విభుడు మున్నిచ్చె వరములు వేడుకొనుము 30

కం - భరతుడు భూమిని యేలగ
వరమును గైకొనుము ముందు వసుధేశునిచే
తిరముగ రెండవ వరమున
నరుగవలెను రామచంద్రుడడవుల కనిసన్ 31

కం - మంధర జెప్పిన మాటల
సందేహము దీపకైక సఖియతోననియెన్
ముందుగ భరతుని బిలచిన
నందరికిని మేలుగాదె యతివరో వినుమా 32

గద్యము - కైకసందేహమును పార్ద్రోలుచు మంధర - భరతుడు వచ్చువరకును యీకార్యమాగునా? భరతుడు లేనిసమయమున

తనకార్యము చక్కబెట్టుకొనుచున్న కౌసల్యను జూచియైన దెలిసికొనవేమి? ఎట్టి సందేహమును నీమది జొరనీయకుము నీకుమారుని గద్దె నెక్కించి రాజమాతవు కమ్ము అందులకు రాముని దు రము సేయుటయే సేమమని మంధర సేయు హిత బోధవిని కైక సంతసించి మాసిన చీరగట్టి అలక గృహమున శయనించెను 33

## కైక దశరథుని వరములు వేడుట

గద్యము - దశరథ మహారాజు రాముని పట్టాభిషేకమునకై వలయు సంభారముల యత్తపరచుటలో కొంత యాలస్యము జేసి తదుపరి ఈ శుభవార్తకైకకెరిగించిన యెంతయో సంతసించునని ఆనంద సాగరమున నోలలాడుచు మందహాసముతో కైకమందిరమున కేతెంచెను మందిరమంతయు చిన్నబోయి నిశ్శబ్దముగా నుండెను చెలికత్తియలును అక్కడక్కడ నక్కియుండిరి దశరథుడు తత్తరపాటుతో ఎటుజూచినను కైకజాడ దోపమి ఒక చెలినుద్దేశించి మీ యేలికసాని యెందున్నది? మందిర మంతయు చిన్నబోయినదే! నాదేవేరికేయాపదయు రాలేదుగదా? అని అడిగిన నామె కైక శయనించిన గది జూపెను దశరథుడు భయాందోళిత మనస్కుడై అందు(బ్రవేశింప కైక - 34

ఉ - నల్లని చీరగట్టి నరనాథుని రాకనెరింగి యుండియున్
మెల్లన యున్నురంచునట మేదిని పైబడి యుండెనంతనా
పల్లవపాణిదేచెతన పాలిట మృత్యువువోలె ముందటన్
నల్లని ముంగురులే జెదరి నాగిని యట్టుల భీతిగొల్పుచున్ 35

ఆ వె -కైక నట్లు జూచి కలవరపడుచును
యువిద కేవిపత్తు జొడమెననుచు
దరికి జేరి చాల తత్తరపాటుతో
తనువు నంటి జూచి దశరథుండు 36

తే గీ -ఏమియాపద వచ్చెనే యింతినీకు
నెవ్వరెదురాడిరే జెప్పు యేమియొదవె

ఇంత శుభవార్త నీ కెరిగింత మనచు
సంతసంబున వచ్చితి సఖియ జూడు 37

కం - నాయెడ దేషము గలిగిన
యీ యెడ దయ జూపి నన్ను నేలుముదేవీ
నీ యెదకు గలిగియుండిన
నేయాపదనైన దీర్తు నిది నిజమనియెన్ 38

గద్యము - దశరథుని చేయి దాకినంతనే తోకద్రొక్కిన యురగాంగన వోలె మండిపడుచు కైక పతిచేతిని నెట్టివైచి యిక నీ దాసితో నీకేమి పన్నియున్నది? నీ కిష్టమైన చోటికి బొమ్ము నా కర్మకు నేనేడ్తునుగాని ఒరులకేలయని చేలాంచలము మోమున గప్పకొని భోరున విలపించెను దశరథుడు నుభయ విహ్వాలుడై కైక నక్కున జేర్చుకొని బుజ్జగింపుచు నీకు గలిగిన కష్టమేమి? చెప్పుము నీ ఆపద దీర్చిగాని నేనన్నముముట్టను నీయాన నన్ను నమ్ముము నీవిట్లుండ నా హృదయము వ్రక్కలగుచున్నది లెమ్ము నీకేమి కావలయు నోయీ దాసునకానతిమ్ము మోమెత్తి నన్ను జూడుమని చెక్కిలి పుణుకుచు కన్నీరు దుడిచెను కైకయు నాకేమియు నిప్పుడివ్వనక్కరలేదు మున్నిచ్చిన వరములు దయచేసిన జ లును అనగా రాజు - 39

కం - ఇచ్చిన వరములకేలను
మచ్చిక తో గోరుకొమ్ము మగువరొయిపుడే
నచ్చిన వరములు వేడిన
నిచ్చెదనిక సంశయంబ దేలని బలికెన్ 40

గద్యము - కైకయు ముప్పిరి గొను సంతసంబున నాకు మున్నిచ్చిన రెండు వరములును దయసేయుడు 41

కం - భూమిని భరతుండేలును
రాముడు నరుగంగవలెన రణ్యంబులకున్
నీ మది సంకోచింపక
నా మది కోరికలు దీర్చు నాథా యనగా 42

గద్యము - కైకమాట వినగనే దశరథుడశనిపాతముపై బడి నటులను భూమి బ్రద్దలై తానందు కృంగిపోవునటులను దద్దరిల్లి వెనుతుఫ నుకు

గదలు వృక్షము పగిది గడగడ వణికి పోవుచు ఒడియందున్న కైకను ఒక్క త్రోపు త్రోసి దిగ్గున లేచి ఓసీ! ఇదియేమి కోరిక నీవు నన్ను పరీక్షించుచుంటివా లేక నీమది(భమించినదా? రాముడు జ్యేష్ఠుడై యుండ భరతుడు రాజ్యముసేయునా? శ్రీరాముడు కోమలగాత్రుడు అడవుల కేగుటయా? నీవేయనుచుంటివా? లేక యేదేని భూతమావిర్భవించి పలికించుచున్నదా? భరతుని కంటెను నీకు రామచంద్రుడే యెక్కువని పలుమారు పలికెడిదానవే ఏదీ ఒకసారి నా దెసజూచి బలుకుము నీమాటలేనా ఇవి? నేనే పొరపాటున వింటినా? అన కైక దృఢముగా ఓ రాజా! ఇన్ని మాటలేల నాకిచ్చిన వరములలో ఒకటి భరతుడయోధ్యాపురి సింహాసనమధిష్ఠించవలెను రెండవది రాముడు పదునాలు గేండ్లరణ్యాలలో తపోవృత్తితో నుండవలెను నీవు సత్యసంధుడవేని ఇచ్చిన మాట నిలుపుము నిత్య సత్యవ్రతులగు నీ యిక్ష్వాకు వంశీయుల గౌరవము నిలుపుము లేదా నీ సత్య దీక్షను త్యజించి నీ ఇచ్చవచ్చినట్లుండుము నామాటకు భిన్నముగా జరిగిననేనిపుడే నీ యెదుట ప్రాణత్యాగము జేసుకొందును అని కఠినముగా శాసించెను దశరథుడు మొదలు నరికిన తరువువోలె నేలగూలి విలపించుచు ఓసీ కైకా! 43

ఉ - ఇంతటి క్రూరురాలవని యెన్నడు నేను దలంచలేదు నీ
యంతర మందురామునెడ నత్యధికంబుగ ప్రేమనిండియున్
ఇంతట నేమివచ్చె నిపుడీవిధి బల్కగ రామచంద్రుపై
పంత మదేలనే చెలియ పంకజనేత్రుడు యేమిజేసెనే 44

తే గీ -యేల రాముని యడవుల కిట్లు బనుప
యేమి జేసెను నీయెడ నెరుగ జెపుమ
యొక్కసారైన మదిలోన యోచనమ్ము
జేసి బల్కుము నాదెస జూచి యిపుడు 45

కం - రాముడు భరతుండనుచును
యేమియుభేదంబులేక నెప్పుడు నీవున్
ప్రేమగ పెంచిన విధమును
భామరో గమనించియైన బల్కుముదేవీ 46

తే గీ - నాదు ప్రాణము రాముడు నాతి వినుము
రాముడేలేక నేలేను రమణి జూడు
భరతుడే భూమినేలును పడతి నిజము
రామునా నుండి విడదీయ రమణి తగదు 47

గద్యము - రాజ్యము నీవును నీ భరతుడును యేలు కొనుడు గాని రామునరణ్యములకు బంపుమనుట మాని మరియొక పేదియైన గోరు కొమ్మని దశరథుడు కైక పాదములపైబడి బ్రతిమలాడ కైక తోక త్రొక్కిన పామువోలె - చాలు చాలు న భరతుడా! నా యందును నా పుత్రుని యందును నీ ప్రేమ యెంతటిదో యిప్పుడే తెలియుచున్నది నా వరములు మార్చపని లేదని నిష్కర్షగా బలికెను దశరథుడును తాను ముందు కైక కిచ్చిన మాటను దప్పిన అసత్య దోషమొదవును కాని నిన్ననే సమస్త సభాముఖంబున రామునకు రాజ్యాభిషేక మొనర్తునని ఇప్పుడు కాదనిన అదియు దోషమేగదా! ఇందేది కర్తవ్యము యేది నిషిద్ధము అనుద్వైధీభావము వలన హృదయము కొట్టుమిట్టాడ దుఃఖమువలన ఇదమిత్థమని నిశ్చయింపజాలనివాడై బిట్టుగా విలపించుచు ఓసీ కైకా! దుష్టురాలా! రామునడవులకంపి నన్ను జంపి నీవే పట్టముగట్టు కొనుము అని హృదయము వ్రయ్యలగుచుండ నేలగూలెను కెకయు దీని పరిణామమేమగునేయనియు తన పంతమునెగ్గి రాజమాతను కాగలనా అనియు యోచించు చుండెను 48

## వసిష్ఠుడు రఘువంశవీరుల చరిత్ర రామున కెరిగించుట

గద్యము - శ్రీరాముడు తన రాజ్యాభిషేకము గురించి సీతతో జెప్పుచు ఆ రాత్రి కేళీ భవనమున విలాసముగా ప్రొద్దుపుచ్చెను ప్రాతః కాలమున వందిమాగధులు స్తోత్రవచనములతో మేల్కొలుప లేచి కాలకృత్యంబులు నిర్వర్తించుకొని సంధ్యానుష్ఠానములాచరించి శుచియై గురువులగు వసిష్ఠ వామదేవాదుల యానతి కులదైవంబుల నర్చించి ఇష్టదైవముల కభిషేకార్చనలు జేసెను అప్పుడు వసిష్ఠుడు రామా! నీవు నిర్మల మనస్కుడవై కులదైవముల నర్చించవలెను గాన ధర్మపత్నియుతుడవై

పెద్దల నారాధింపుము యీ రోజంతయు ఉపవాసముండి రేపు పట్టాభిషిక్తుడవుగావలయును అని ఇక్ష్వాకు వంశీయుల గూర్చిదెల్పుచు - ఇదిగో ఇతడు సూర్యుడు యీ సూర్య భగవానుడు మీవంశకర్త సుమా అని అతని మ్రొక్కించెను 49

తే గీ - నీదు పూర్వీకులందరు నిమముగను
సత్యధర్మంబులను నిల్పి సంతసంబు
ప్రజల సౌఖ్యమ్ముకే తమ ప్రాణములను
త్యాగమొనరించి పాలించి ధన్యులైరి 50

గద్యము - ఇతడు మీ వంశీయులలో పేరుగాంచిన త్యాగధనుడు దిలీపుడు ఇతడు పెద్దకాలము ప్రజారంజకముగా పాలించి 51

కం - భూవిభుడు దిలీపుడు తన
భావము నంజంతజెంది పలికె గురునితో
భావము నింపెడి తనయుల
నే విధిబొందంగ గలుగు నెరుగంజెపుమా 52

గద్యము - అని అడిగిన రాజునుగనుగొని వసిష్ఠుడునందినిధేనువు నర్చించిన నీకు సంతానముగలుగునని వారలకాపని నియోగించెను దిలీపుడు తన ధర్మపత్నియగు సుదక్షిణాదేవితో గురువు నానతి ఆ ఆశ్రమమున నుండి భక్తి శ్రద్ధలతో నందినీధేనువునర్చించుచు ప్రతి దినమును సూర్యోదయమున నా గోవును గొని హిమవత్పర్వతారణ్యముల మేపుచు సంధ్యాసమయమునకు తిరిగి ఆశ్రమమునకు వచ్చుచుండెడివాడు సుదక్షిణాదేవియు ఆ గోవున కెదురేగి పాదములు గడిగి పూజించుచు దానిఆహారపానీయములనే మరక సంరంక్షించుచుండెడిది ఒక్కనాడు దిలీపుడు గోవును మేపుచు ఆ ప్రకృతి సౌందర్యమును దిలకించు చుండ 53

కం - హిమగిరి సౌందర్యమునకు
నమితానందంబునొందియలరుచునుండన్
సమయంబైనను దెలియమి
క్రమముగ చీకట్లుక్రమ్మి కాంతులు జెదరెన్ 54

తే గీ - సింహమొక్కటివచ్చెనా చేరువకును
కామధేనువును బెట్టార్చి గావుమనగ
నదరి పడి రాజు విల్లమ్ముసందు కొనియె
వేయ శరములు పెక్కులు విఫలమయ్యె 55

కం - గిరిదాకిన చందమ్మున
నరపతి బాణంబులెల్ల నాశముగాగన్
పరిపరివిధముల మదిలో
వెరపు గలిగి నిలిచె నంతవీరవరుండున్ 56

గద్యము - అంతన సింహము మనుజ బాషణములతో ఓ రాజా! ఈ అడవి యంతయు నా అధీనము ఇందే జంతువులు ప్రవేశించినను నాకాహారమగును ఇది ఈశ్వరాజ్ఞ కావున ఈ ధేనువును నాకాహారమయ్యెను దీనిని విడచి పొమ్ము నన్ను జయింపజాలవు నీ ప్రయత్నము మాని బిమ్మన రాజు ఓ మృగరాజమా! నేనీ దేశపు రాజును ప్రజారక్షణ ప్రాణి రక్షణ నా కర్తవ్యము నా రక్షణలోనున్న యీ ధేనువు నాగురుదేవుల సొత్తు కావున గోవును విడచి మరియొకదానితో నీయాకలి దీర్చుకొను మన సింహము అయిన నీ శరీర మాంసము మాత్రమో గావలయునని బలికెను దిలీపుడు వెంటనే ధరున్బాణములు క్రింద బడవైచి సింహము ముందు మోకరిల్లి ఓ సింహరాజమా! ధేనువును విడచి నన్నాహారముగా గైకొని నన్ను ధన్యుని జేయుమని కన్నులు మూసికొని భగవంతుని ధ్యానించుచుండె అప్పుడు సింహము ఓ రాజా! నీ గురుభక్తికిని కర్తవ్య పరాయణతకును త్యాగనిరతికిని మెచ్చితిని నేను నందినీ ధేనువునే నిన్ను పరీక్షింపగోరి యీ సింహరూపము ధరించితిని నేడు న దుగ్ధంబులు నీవును భార్యయు గ్రోలుడు దాన నీకం బలవరాక్రవం నంవన్నడగం కుమారుడుదయించునని బల్కి ధేను రూపమును బొందెను రాజును మహాప్రసాదంబని ఆశ్రమము జేరి గురువు నాజ్ఞను బొంది నందినీ ధేనువు క్షీరము భార్యయు దానును పానము జేసి గురువు నొద్ద సెలవొంది భార్యను దోడ్కొని అయోధ్యానగరమున కేగెను ఆ దిలీపుని

వరపుత్రుడే మీ ప్రపితామహుడగు రఘుమహారాజు రఘు మహారాజు అనమాన బలపరాక్రమవంతుడును ప్రజారంజకుడును యశోభూషనుడును వితరణ శాలియునై పెక్కేండ్లయె ధ్యను పాలించెను ఒకానొకప్పుడు విశ్వజిత్ అనెడి యాగము జేసి తన ధనమంతయు భూసురులకు దానమిచ్చి నిర్ధనుడయ్యెను అట్టి సమయమున వరతంతుమహాముని శిష్యుడు కౌత్సుడను వాడు గురుదక్షిణ గానరువదినాగులు కోట్ల సువర్ణనాణెముల నివ్వదలిచి ధనార్థియై రఘుమహారాజుకడకు వచ్చెను రాజును మృత్తిక పాత్రతో కౌత్సున కర్ఘ్య పాద్యములనిచ్చి యాదరించెను కౌత్సుడు ధనమడుగుటకు సంకోచించి యూరకుండెను వని సంకోచమును అవసరమును తెలిసి రాజు కోశాగారము ఖాళీగా ఉండుట గమనించి కౌత్సునకు ధనము తెచ్చి ఇచ్చుటకై కుబేరుని పై దండెత్త సిద్ధమయ్యెను అని చెప్పుచున్న వసిష్టుని చూచి రాముడు - గురువరా! కుబేరుని పై దండెత్త నేల? మంచిపని చేయుటకు కుబేరుని ధనమడిగిన కాదనునా అన రామునికి వసిష్ఠుడు రామచంద్రా! రాజగువాడు తన భుజబలముతో ధనమును సంపాదించవలెనే గాని ఇతరులను యాచించరాదు రఘువు ధర్మపరాయణుడు ధనము దానము చేయునేగాని యాచించునా? అందువలననే కుబేరుని వద్దనున్న ధనమును తన భుజబలముతో సంపాదించి కౌత్సున కివ్వదలచెను అదియే రాజ ధర్మం అది తెలిసి కుబేరుడు రఘువు దనశీలతకు మెచ్చి అతని కోశాగారమున కనక వర్షము కురిపించెను 57

తే గీ -కనక వర్షమ్ము గురియించి కౌత్సునకును
ఇచ్చె నాతని గురుభక్తి మెచ్చుకొనుచు
దాన శౌండిమముగ నర్థిదనిపి రాజు
దాన శీలుండి తండన ధన్యుడయ్యె 58

గద్యము - కౌత్సుడును రాజునాశీర్వదించి ధనమునుకొని పోయిగురువునకర్పించి ధన్యుడయ్యెను ఒకప్పుడు రఘుమహారాజును పరీక్షింప పరమేశ్వరుడు సన్యాసివేషమున రాజనగరికరిగి భిక్షమడిగెను రాణియు బంగరుపళ్ళెరమున తండులంబుల నిడి 59

తే గీ - తరుణి తన చేత భిక్షను దగధరించి
తపసి వరునకు బెట్టనా తాపసియును
మగువ గనుగొని యామెపై మరులుగొనియె
సాధువ చింతలో బడి చావబోయె 60

గద్యము - అది కర్ణాకర్ణిగా రాజునకు దెలిసెను 61

తే గీ - రాజువ నిని గొనితెచ్చి రమణినొసగ
నా విభుని త్యాగమును మెచ్చి యతివరుండు
శివుడు దానని ఇచ్చెని చిన్నిపుత్రు
అతడె మీ పిత మహుడగు నజుడు సుమ్ము 62

గద్యము - అ యజ మహారాజును తాత తండ్రుల వేలె పరాక్రమ శాలియు వితరణ శీలియు అమర ప్రేమికుడును ఏకపత్నీవ్రతుండునై పేరు బొందెను అజుడు తన బలపరాక్రమములతో ఇందుమతిని స్వయంవరమున పరిణయమాడి యామెను తన ప్రాణసమానముగా భావించి ఇంద్రసౌఖ్యంబులందుచు నొక పుత్రుని బడసెను ఆ ఇందుమతియు అజుని వంశము పండించు పుత్రుని గని శాపగ్రస్తయగు గంధర్వకన్యగ న పుత్రోదయమ్మై నంతనే శావ విముక్తయ్యై దివంబునకరిగెను అజుడది సహింపజాలక ఆమెకై పరితపించుచు పసివ డగు దశరథుడు యుక్తవయస్కుడగు వరకు వైరాగ్య భావముతో నుండి దశరథునయోధ్యకు పట్టాభిషిక్తుని జేసి తపోవనములకరిగెను ఎంతటి భోగభ గ్యములున్నను యావనమునందే భార్యను గోల్పోయి ప్రియపత్నియగు ఇందుమతీ వియోగమున కుములుచు రాజ్య సుఖములు త్యజించిన త్యాగమూర్తుడు ఏకపత్నీ వ్రతుడునై విఖ్యాతి గ ంచనని తెల్ప రాముడు - మహాత్మా! ఇందుమతికి శాపమేల కల్గినన వసిష్ఠుడు ఇట్లు చెప్పెను ఒకప్పుడొక గంధర్వకన్య న రదుని వలన భు లోక ్గేషములు వినుచు మ తృప్రేమ యొక్క విశేషమును విని మ తృప్రేమను ంందునట్లును మ తృమూర్తి యగునట్లును అనుగ్రహించుమంఎ బ్రహ్మను వేడెను ఆమె కోరికను మన్నించి బ్రహ్మదేవుడు ఆమనొక రాజకుమార్తెగ జన్మించ తలితండ్రుల ప్రేమను

పొంది ఒక మహారాజునకు ఇల్లాలై మాతృత్వము బొందునట్లును వరమిచ్చెను ఆమెయే ఇందుమతిగా పుట్టి అజుని పత్నియై దశరధునకు జన్మనిచ్చి శాపోపశమనము గావించుకొని తిరిగి దివమున కరిగెను

నీ తండ్రియగు దశరధుడు నిత్య సత్యవ్రతుడును ధర్మపరుడును త్యాగశీలియునై యుండెను ఇట్టి మహోన్నత ఇక్ష్వాకువంశమున జన్మించిన నీవు ప్రజారక్షణకై ప్రాణత్యాగము జేయగల దిలీపుని వలె త్యాగమూర్తివిగను మహావితరణ శీలియైన రఘుమహారాజువలె దానపరుడవుగను అజమహారాజువలె ఏకపత్నీవ్రతుడవుగను నిగ్రహ వైరాగ్య సంపన్నుడవుగను నీ తండ్రియగు దశరధమహారాజు వలె సత్యవంతుడవుగను ప్రజారంజకముగా పాలింపుము అని వసిష్ఠులు బలుక రాముడు గురుదేవుల పాదములంటి మీ ఆదేశము సర్వదా పాటింతునని ప్రతిజ్ఞాపూర్వకముగా బలికెను సీతారాములు గురువుల యానతి ప్రకారము తత్సమయోచిత కార్యములందు నిమగ్నులైరి శ్రీరాముని పట్టాభిషేకమహోత్సవమునకు లక్ష్మణుడును సంతుష్టాంతరంగుడై అంతిపురమునకేగెను

## ఊర్మిళ పట్టాభిషేక చిత్రమును చిత్రించుట

ఆ రాత్రి లక్ష్మణుడును శయనమందిరమున కేగుసరికి ఊర్మిళయొక చిత్రపటము చేబూని ఆలోచనా నిమగ్నయై పతి రాకను గమనించక యుండె అంత సౌమిత్రి ప్రియ సతిని జేరి 63

తే గీ - ఇంతినీకింత యోచనయేల చెపుమా
నాదురాకయు నెరుగకే నాతినీవు
చేయ బూనినయాగొప్ప చేతలేమి!
అనుచు దరిజేరి వీక్షించె నచటనున్న 64

తే గీ - రత్నమయ గద్దె యందున రామచంద్రు
నంక తలము సీతమ్మ యలరుచుండె

భరత శత్రుఘ్నులిరువురు పార్శ్వమందు
ఛత్ర చామరముల బట్టి చేరి కొలువ 65

తే గీ - రత్న మణిమయ కాంతులు రంగులీన
మకుటమును రాజు రాముని మస్తకమున
నుంచగా చూచి ప్రజయెల్ల నుత్సవమున
పలికె జేజేలు రాముని భక్తి మీర ॥ 66

తే గీ - పటము జూచిన సౌమిత్రి పడతి తోడ
సంశయంబున మదికొంద సంభ్రమింప
కాంతయీ పటమందునే గానరాను
యింతి నను దొలగించితి వేల జెపుమ 67

కం - అనవిని యూర్మిళ బలికెను
వినయంబును ప్రేమ వెల్లివిరియగ నపుడే
నను విడచి వేరుగా నిను
గన జాలను హృదయ మందుగా కితరమునన్ 68

గద్యము - అనిన ప్రియపత్నిని గౌగిటబుజ్జగించి నవ్వుచు అయిన నిన్నును నన్నును జూపుమన ఊర్మిళ అదినఖాభవనంబు జానకి మాత్రము శ్రీరామునంకతలమధిష్టింపగలదు నేనెట్లు సభాప్రవేశము జేయగలను? అందువలన నిన్నిందు నిరూపించలేదు నీ చిత్ర మిందెచ్చట నిరూపించ వలయునే జెప్పి నా స్థానంబును గూడ జూపుమన లక్ష్మణుడా ఫలక మందుకొనబోవ నది చేతినుండి జారి క్రిందబడి పగిలెను అదిజూచి ఇరువురిహృదయంబు లందును కీడుదోచి భయ కంపితులైరి గడగడ వణికి పోవుచున్న యూర్మిళ నక్కున జేర్చుకొని ఆమెభయము దీర్చుచు లక్ష్మణుడు 69

తే గీ - చిత్రపటమున కింతగా చింతయేల
పటము పగిలిన పట్టమ్ము భంగమగునె
చింత మానుము పట్టాభిషేకమంత
గాంచి వ్రాయుము పూర్తిగా కాంతనీవు 70

గద్యము - ఆనందప్రదమైన యియ్యవసరంబున వంత దగదు

రమ్మని శయ్యకడకుదీసికొనిపోయెను వారలకారాత్రిక్షణము వలె గడచినట్లుగా వేకువను సూచించు భేరి మృదంగ వాద్యములు వినంబడియె 71

## రామలక్ష్మణులు కైకమందిరమున కరుగుట

పట్టాభిషేకమునకై వలయు సంభారములన్నియు సమకూర్చి దశరథ మహారాజుతో విన్నవింప సుమంత్రుడు కైక మందిరంబున కేగెను మందిరమంతయు నీరవమై నిర్లిప్తమై దోచెను దశరథుడు చింతా క్రాంతుడై ఆసనమున తలవాలవైచుకొని జేరబడి యుండెను చెంతనే మహాపాసుర మర్దనియట్లు రౌద్రాకారంబున నిలువ బడిన కైక విగతి కేశినియై నల్లని చీరతో అలంకార హీనయై రాజును గొంపోవ నేతెంచిన మృత్యుదేవతవేలె భయంకర మూర్తిగ దోచిన సుమంత్రుడు భయభ్రాంతుడై రాజానకును రాణికిని నమస్కరించెను అతని నమస్కారమందు కొనకయే కైక - శ్రీరామునికు వెంటనే దీసుకొని రావలసనదిగా రాజాజ్ఞ అని పలికెను అంతట సుమంత్రుడు శ్రీరాముని మందిరమునకేగి యువరాజానకు జయ మని బలికి తండ్రిగారి యాజ్ఞ నెరిగించెను శ్రీరాముడు లక్ష్మణునితో కైకెయి మందిరమున కేగెను నిశ్శబ్దముగ నున్న మందిరమును ఖిన్న వదనుడగు జనకునిగాంచి మనస్సునందు కీడు దోప ముందుగా తండ్రికిని తరువాత కైకేయికిని పాదాభివందన మాచరించెను ఆనందమున ఆశీర్వదించి కౌగలించుకొను తండ్రి ఈ నాడు మౌనమెత్తకయే రామా! యని రెండు చేతులతో మొగము కప్పుకొని దుఃఖమునస్కుడై యూరకుండ రాముడు కైకతో ఎమమ్మా! తండ్రిగారిట్లున్నారేమి? నీవును దేని గురించో మధన పడుచున్నట్లు దోచుచున్నది మీ చింతకు కారణమేమి? వెంటనే ఆనతిండు అదెట్టి దుష్కరమైననూ లోకాతీతమైన దైదనను క్షణములో మీ పాదముల ముందుంచువాడను సందేహింపక సెలవిండన - కైక రామా! నీ శక్తి సామర్థ్యంబులు నేనెరుంగనా! మున్ను మీ జనకులు నాకు రెండు వరములిచ్చి యున్నారు 72

తే గీ -ఇప్పుడా వరద్వయమును ఈయలేక
ఇచ్చినా కోర్కె దీర్చుట కిచ్చలేక
సత్యభంగంబునకు దాను జాలలేక
మధన పడుచుండె మీ తండ్రి మనసులోన ॥ 73

తే గీ -పుత్ర ప్రేమతొ నీ తండ్రి చిత్రమైన
ధర్మ సంకటమందున దగులుకొనియె
తండ్రిమాటను నిలబెట్ట దగుదు వీవె
నీవె దీర్పంగ వలయునా నియమమిపుడు 74

గద్యము - అని పలికిన కైకేయి మాటలు విని రాముడు తండ్రికడకేగి తండ్రిని ఎట్టుకొని తండ్రీ! దీనికై మీరింత దిగులు చెందనేల మీకు దుష్కరమై దోచిన నేను లేనా! ఎట్టి కార్యమైనను క్షణములో సాధించి తెచ్చి మీ పాదములకడ నుంతును సందేహింపక వెంటనే సెలవీయుడన దశరధుడు రాముని గౌగలించుకొని బిట్టుగా వాపోయెను అంత రాముడు తండ్రిని విడిచి కైక పాదములంటి తల్లీ! నీవైన ఆనతిమ్ము ఎంతటి కష్టతరమైననూ సాధించి తీరెదను మీ పాదములాన మీ సెలవైన ఈ రాజ్యమైననూ లేదా నా ప్రాణమైననూ మీ చరణముల చెంతనిడెద సందేహింప వలదన కైక రామా! నీ వట్టి త్యాగమూర్తివని నేనురుగుదును మీ తండ్రిగారు నాకొసగిన వరములననుసరించి 75

కం - నీ తమ్ముడు భరతుండే
యీ తరుణమునందు ప్రజల నేలును నీవున్
ఆ తాపసులం గొలువం
గా తగు పదునాలుగేండ్లు కానన మందున్ ॥ 76

గద్యము - ఈ విషయము నీకెరిగించ లేకను సత్యమును దప్పలేకను మీ జనకులు చింతించు చున్నారన - శ్రీరాముడు తల్లీ! ఇంత మాత్రమునకే యింత దురపిల్లనేల! నేనేమి! భరతుడేమి! రాజ్యసింహాసన మధిష్ఠించుటకు? భరతుడే రాజగును నేనిప్పుడే వనముల కేగెదను అని తండ్రి వద్దకు వచ్చి తండ్రీ! సత్యవాక్య పరిపాలన మన ఇక్ష్వాకులకు ఉగ్గుపాలతో నేర్పిన విద్య మీరు చింతిల్లరాదు తల్లిగారి

కోరిక మేరకు జరిపించుదు నేనిదే వనముల కేగుదును ఇ
లక్ష్మణుడు రౌద్రాకారముతో మండి పడుచు యేమి! పెద్దతనమ
వలన మహారాజు బుద్ధి పెడతల బట్టినది కాకున్న ఆడుదా
భయపడి రాముడు జ్యేష్ఠుండై యుండ భరతునకు రాజ్యమిచ్చుటయ
రాముడు సన్యాసియై యడవుల బడి పోవలయునా? అడుగుటకు కై
యెవతె యేలుటకు భరతుడెవరు? రాజ్యము ప్రజలసొత్త
తరతరములనుండియు ఇక్ష్వాకులే రాజ్యము పాలించుచు ప్రజా
జేయుటకు మాత్రమే నియమింపబడిన ప్రజాసేవకులు అంతియే
ప్రియురాలి కోరిక మేరకు దానమిచ్చుటకధికారులు కా
వారహారాదులు అడ్డమైననూ రాముని రాజ్యాభిషేకము ఒ
తీరవలననదే ఈ రాజ్యము పైనిక రాజునకు గూడ నదికారము లేద
యిక కైక యెవతె! యని కాల రుద్రుడై యొర నుండి ఖడ్గము దీ
తండ్రి వధింపదలచెను దశరథుడు కన్నుల దెద
అమృతోపమానములగు వాక్యములాడు లక్ష్మణుని దెస పరికిం
నాయనా లక్ష్మణా! ఇటు రమ్ము తండ్రీ! ఈ అసమర్థ
వధించి పుణ్యము గట్టుకొనుము నాయీ దుఃఖభారమును దీర్చుమ
లక్ష్మణున కెదురై యాతనిని బట్టుకొనియె అంత రాముడు లక్ష్మణా!
ఏమి నీమాటలు! తండ్రిగారినా! నీవిట్లు ధిక్కరించుచుంటివి! సత్యద
పరతంత్రులగు తండ్రిగారి నెదిరించి తుచ్ఛమైన రాజ్యభోగంబ
కాశించు నీచులా ఈయిక్ష్వాకులు? కులదీపకులగు కొమరుల గ
తల్లి దండ్రులకా చింతలు? తలి దండ్రుల కోర్కెలు దీర్చల
తనయులెందుకు? అసందర్భ ప్రలాపములతో పూజ్యులైన తలిదండ్రు
నెదిరించిన నీ ముఖము నాకు జూపకుము ముందుగా వార
క్షమాపణ వేడుకొనిగాని నావద్దకు రావలదన - లక్ష్మణుడు చింతిం
అన్నా! నన్ను మన్నించి నా అపరాధము క్షమించుమన - ముందు
పినతల్లికి క్షమాపణ జెప్పుమన లక్ష్మణుడట్లే కైక పదముల బడి నను
క్షమింపు మమ్మా నీ కోరిక తప్పక నెరవేరును అని తండ్రి వద్ద
వచ్చి పాదాభివందన మాచరించి దశరథుని శోకమూర్తిని జూడగ

నేటమాటం క దుఃఖభరిత హృదయుడై వెడలి బోయెను ప్రణమిల్లు కుమారుని దీవించుటకు గూడ నేరుం క దశరథుడు కుమిలి పోయెను రాముడు కైకకు ప్రణమిల్లి తండ్రి పాదములంటి తండ్రీ! మీరు చింతిల్ల రాదు రాజ్యముగాని పుత్రులగాని తుదకు ప్రాణమైననూ సత్యము కంటె గొప్పవి కావు మీ సత్యమును నేను పాలింతును భరతుని రాజుని జేయుడు నేనైననూ భరతుడైనను సమానమే మీరు ఎచరింపక తల్లిగారిని దూషింపక ధర్మము గానుండుడు అడవులకేగ నానతిండు 77

ఏ 1 -ఇచ్చి లేదను బంటెను వాకమైన
మాట భువినుండ దతగించు మనుష్యులకును
సత్యమును దప్పి బ్రతికిన చచ్చినట్లె
సత్యవాక్యమ్ము బుధులకు సమ్మతంబె 78

ఆ వె సత్యపాలనంబు సాధుగుణంబును
ఈశ్వరదైవ చింత నిర్మలంబు
చిత్త శుద్ధి తోడ సేవించు భావమ్ము
మనుజు డెపుడు దిని మరువరాదు 79

కం కావున చింతించ కనిపు
డే విధమున నైన కైక యిప్పిట మెల్లన్
గావించు నన్ను వేగమె
దీవించుము తండ్రియునుచ తేజము మెరయన్ ॥ 80

కం - శ్రీరాముడు గుణసాగర
ధీరుడు లోకైక వీర ధీమంతుండై
కోరిక దీర్చగ తలికి
చేరువ జని మ్రొక్కి రయేగె సీతకు దెల్పన్ 81

గద్యము - నమస్కరించి వేగుచున్న రాముని కనుగొన కైక నిర్వికారచిత్తగ నిలువబడ దశరథుడేమియు బల్కక ఒక్క నిమేషమట్లే రాము చూచుచూ రామ! యని యెలుగెత్తి బిట్టుగా నేడ్చుచూ నేలబడియె తండ్రి పిలుపు విన బడినను రాముడు వెనుదిరిగి జూడక భవనము వీడి చనియెను 82

# సీతా, లక్ష్మణులతో రాముడు అరణ్యమునకేగుట

గద్యము - సీతయు ఆనంద పరవశ్యంబున ఉద్విగ్న మానసయైన యువరాణిగా నలంకరించు చెలులను పరికించుచు వారితో సరస సంభాషణలు సల్పుచు వారు కోరుచున్న కోరిక లీయ సంసిద్ధయై వరలక్ష్మివోలె దర్పణావలోకనము జేయుచుండె రాముని రాక చెలులెరింగింప సంభ్రమంబున భర్తకెదురేగెను శ్రీరాముడు సతిని జూచి తాను వనమున కేగు సంగతి యామె కెట్లెరిగింప వలయునాయని ఆలోచించుచుండ సీత పతి పాదములంటి - ఆర్యపుత్రులేలనో మరియొక విధముగా గన్పడుచున్నారు అప్పుడే రాచకార్యములగూర్చి యోచించుచున్నట్లున్నదని పరిహాస పూర్వకముగా పలికిన - దేవీ! ఇప్పుడా బెడద తప్పినది సుమ! ఆ రాజ్యభారమంతయు భరతుడే చూచుకొనగలడు నేను నిశ్చింతగా పవిత్ర తపోధనుల చూడ నేగెదను నీవు మాత్రము మా తల్లి కౌసల్యాదేవిని సేవించుచుండుము పదునాలుగు సంవత్సరములును పదునాలుగు దినములవలె గడపివచ్చెద ఇదిమదీయ జనకుని యాజ్ఞ కావున మనకు [illegible] శిరోధార్యమే కదా! అన సీత గుండె ఝల్లుమన 83

కం - పట్టము గట్టక పోయిన
పెట్టెదనిన్నిచ్చటున్న భీతిని బలికెన్
బెట్టను బట్టిన చెలిమిని
నట్టడవుల బాలుసేయుటది ధర్మంబే 84

కం - నా తనయను నీ కొసగితి
నీ తన్విని వీడబోకు యే క్షణమంచున్
మా తండ్రి జనకరాజే
మీతోడను బలికెదాని మీరుట దగునే 85

గద్యము - మదీయ జనకుని యాజ్ఞయు మీకు శిరోధార్యమే గదా! అదియును గాక 86

కం - పతితోడిదె లోకంబిల
సతికెన్నడు వేరులేదు జగమందునసే

గతియైనను పతితోడనె
సతిగడుపగ వలయునెపుడు సతిధర్మమదే 87

ఆ గీ -పూవుతోడిదె తావియు పూజ్యమగును
భర్తతోడిదె బ్రతుకును భార్యకెపుడు
పతిని వీడిన సుఖములు సతికియేల
ఊరనైనను వనమైననువిధ కెపుడు 88

ఆ వె -నిన్ను విడిచి నేను నిలువంగ జాలను
నన్ను వీడబోకు నాధనీవు
అడవియైనగాని అదినాకయోధ్యయే
అనతిమ్మునాకు నరుగుదెంచ 89

తె గీ -నగరమైనను వనమైన నాతికెపుడు
పతిని వీడక యుండుటే పద్ధతియగు
నెన్ని కష్టంబులైనను నేమియైన
పతియె లోకమ్ము భువిలోన పడతికెపుడు 90

గద్యము - అని పల్కు సీత వచనములకు సంతసిల్లి రాముడు సీతానుగమనమ్మునకు సమ్మతించె తల్లియగు కౌసల్య మందిరమున కరుగబోవ ఆమెయే వచ్చెను భరతునికి రాజ్యాభిషేకమును రామునకరణ్యవాసమును రాజు ప్రసాదించెనను వార్త క్షణములో అంతిపురమంతయు వ్యాపించెను కౌసల్య ఏడ్చుచు రాముని గౌగలించుకొని రామా! ఇది ఏమి విపరీతము? రాజ్యము కావలసిన కైకకివ్వ వచ్చును గాని నాకుమారు నడవుల కంపుటమేమి? అనివిలపించు తల్లినూరడించిన కొలదిని దుఃఖమతిశయిల్లెనేగాని శమింపలేదు కుమారుని కౌగలించుకొని యేడ్చుచు రామా! 91

## రామునకై కౌసల్య విలాపము

సంతతి లేకను మేమిల
సంతాపము చెందిచెంది సల్పిన వ్రతముల్

ఎంతో ఫలించె ననుచును
సంతపముననుంటి తండ్రి సరివారలలో 92

కం - ఎన్నడు చూలైతిని నే
నెన్నడు నినుగంట పుత్ర యి విధినాకున్
కన్న ఫలమైన జూడక
నిన్నడవుల పాలుజేసి నేనెటులుందుస్ 93

కం - తన సుతుని రాజు జేయకు
కనులారగ జూడగోరి కైక దురాశన్
తన కోరిక దీర్చుటకై
నను నీ శోకమున ముంచె నపై పగలో 94

తే గీ -ఏను కైకకు చెసిన యెగ్గదేము
నాదు పుత్రుని గాదని నందనునకు
పట్టమును గట్టగా జూచె పగనుబెంచి
నగర మెడలంగనిను జెయనాదుకర్మ ॥ 95

గద్యము - అని దుఃఖించు తల్లినూరడించి రాముడు తల్లీ! నీవిట్లు బలుకదగునా! తండ్రిగారికిని కైకేయీ దేవికినీ నామీద పగయుండునా! వారేమి చేసినను నా మేలుగోరియే జేసెదరు పవిత్ర తపోభూములలో మహాత్ముల సేవించు భాగ్యము నాకు ప్రసాదించి ఈ రాజ్యభారము నుండి తొలగించి నాకు మహోపకారము గావించిరి నేనైనను భరతుడైననూ నీపుత్రులమేగదా! నాభగ్యమునకు నన్నును రాజ్యభారము వహించు భరతుని ఆశీర్వదించుము నావియోగముతో బాధపడు తండ్రిగార్కి ధైర్యము చెప్పవలయును తండ్రిగారి అజ్ఞ నీఆశీర్వాదముతో పదునాలుగేండ్లను పదునాలుగు దినములట్లు గడిపి నీ సమ్ముఖమున కేతెంచెదను సీత గూడ నాతో తపోభూముల కరుదెంచుచున్నది మమ్ములను దీవించుమన కౌసల్య రముని శిరము మూర్కొని కన్నీటితో భోరున విలపించెను లక్ష్మణుడును రామునితో నడవులకేగనుద్యుక్తుడయ్యెను సుమిత్రయు వేదనా భరిత మనస్కయై సీతారాములను దీవించి సీతను కౌగలించుకొని అయోనిజవై జనకునింట నల్లారు ముద్దుగా పెరిగిన నిన్ను అడవుల కంపుచుంటిమి
96

తే గీ - రామచంద్రుని హృదయ సామ్రాజ్ఞివగుచు
రఘుకులంబును పండించు రాణివగుచు
నుండ నిన్నిచ్చే జనకుండు ఉవిదయట్లు
నడవినిక్కట్ల పాలైతి వకటనేడు 97

గద్యము - అని తన మెడలోని ముత్యాల హారము దీసి కోడలి మెడలోవైచి అడవుల కేగునిన్నేమని దీవింతునని దుఃఖించెను ధనుర్బాణములు దాల్చి అన్నగారికండగా నిలచిన పుత్రుని కౌగలించుకొని శిరము మూర్కొని నాయనా! నేటినుండి నీవు సీతారాములనే తల్లితండ్రులుగా భావించి అనుజ పదమునకు సార్ధకత గలిగించుము శ్రీ రాముని సేవలో అప్రమత్తుడవైయుండుము ఊర్మిళనొప్పిం, యేగుమన సౌమిత్రి తల్లికి నమస్కరించి అచ్చటనే ఖిన్నవదనయైయున్న ఊర్మిళను జూచి - దేవీ! నేను శ్రీ రాముని సేవించుటకై వెళ్ళుచున్నాను నా సేవా మార్గమున కవరోధము కలుగరాదు నేను వచ్చువరకునా తల్లిని సేవించుము ఇది భర్తగా నా ఆజ్ఞ నా మాట కాదనిన నామీద ఆన సుమా! అని బల్కిన ఊర్మిళ నిర్లిప్తయై వెనుదిరిగి విలపించుచూ శయ్యాగారముచేరెను తల్లులనూరడించి శ్రీ రాముడు సీతా లక్ష్మణులతో నారచీరలు ధరించి యడవుల కేగనున్న సమయమున సుమంత్రుడు దశరధుని పంపున రధము పూన్చి తెచ్చిన దాని నధిరోహించి సీతా లక్ష్మణులతో బయలు దేరెను వారిని చూచి పురజనులందరూ తెల్లబోయి పట్టాభిషేకము గావలసిన తరుణమున అడవుల కేగుచున్నాడదియేమి విపరీతము! అని వారందరు రామునడ్డగించిరి రాముడు వారలకు నచ్చజెప్పితణ్యములనున్న తపశ్శాలురను సేవించి రావలయును నేను వచ్చు వరకును భరతుడు మిమ్ము పాలించును అని వారందరను వెనుకకు పంపి తాను ముందుకుసాగెను కౌసల్యా సుమిత్రలు కన్నీరొలుక మందిరముల కేగివిలపింప దొడగిరి 98

## శ్రీ రాముని వియోగమున దశరథుడు మరణించుట

శ్రీరాముడు నగరమును వీడి అరణ్యమున కేగిన సంగతివిని

దశరథుడు - ఓసీ! కైకా! ఇప్పుడు నీ కండ్లు చల్లబడెనా!
సుగుణాభిరాముని నారామునరణ్యమును కంఒతివి

తే గీ -అడుదానికి భయపడు నట్టు చెనటి
ప్రజల పాలింపగా నింక బనికిరాడు
పందనైతిని నిన్ను చేపట్టినేను
ఏలుకొను మింక రాజ్యమ్ము నింతి నీవు 99

గద్యము - ఇక నీముఖము చూడనని దిగ్గనలేచి కౌసల్యాదేవి మందిరమునకు కాలినడకనే బయలుదేరెను కైకేయి నిర్ఘాంతపడి యేమియుననలేక నతనినాప సాహసింపలేక నట్టేనిలబడియె మందిరము వెలుపలకు వచ్చిన దశరథుడు పైనున్న ఉత్తరీయము జీరాడ చిందరవందరగానున్న కేశములు ముఖముపైబడుచుండ చింతనిప్పులట్లు యెఱ్ఱనైన కన్నులు నీరు జిమ్ముచుండ పాదరక్షలైననూ ధరింపక మూర్తీ భవించిన శోకముద్రవోలె నడుచు చున్న తమ ఏలికను జూచి సేవక జనులును పురప్రజలును నోటమాటరాక అట్లేనిలబడి పోయిరి దశరథుని రాక తెలిసికొని కౌసల్యపరుగుపరుగున భర్తకెదురేగి దుఃఖమతిశయిల్ల పాదములపై బడియె అతడును పాదముల వద్దనున్న భార్యను అక్కునజేర్చికొని భోరున విలపించుచున్న సతినోదార్చుచు దేవీ! నిన్నోదార్చుటకుగూడ నసమర్థుడను నీ కడుపున చిచ్చుపెట్టి నేనును పుత్రశోకమును తెచ్చుకొంటిని నేను శోకము భరింపజాలకున్నాను నీవద్ద సేద దీరుటకే వచ్చితిని ఈ జీవితమునందు నాకు రోత కలుగుచున్నది మృత్యువు దరిగా దోచు చున్నదన కౌసల్యస్వామీ! అటువంటి అమంగళకరమగు మాటలు పలుకవలదు మీరు సత్యధర్మవ్రతులు మీరేమి చేయగలరు? ఇది అంతయు నాకర్మ బిడ్డకు దూరమైతిని శాంతింపుడని రాజునోదర్చెను దశరథుడును ఆ రాత్రియంతయు రాముని గురించి యే మాట్లాడుచు కౌసల్యా సుమిత్రలతో బాటు బాధపడుచు దేవీ! ఈ పాటికి రాముడేమి జేయుచుండును? జనపదంబులుగడచి అడవులలో ప్రవేశింపనేపు జనక చక్రవర్తియనుంగు కూతురు జానకి అటవీ దృశ్యములు

జూడనేపు వెన్నెలను గూడ తట్టుకొనలేని జానకితో అడవుల దిరుగుచుంటివా! రామ! అని మరలమరల యెలుగెత్తి ఏడ్చుచు స్మృతి దప్పి పాన్పుపై ఒరిగిపోవుచుండ కౌసల్య తన దుఃఖము పశమింప జేసికొని రాజును ఓదార్చదొడంగెను. ఆ రాత్రి అంతయు నట్లే వేగించెను. మరు నాటికి రాజు ప్రాణావశిష్టుడై కౌసల్యాదేవితో - దేవీ! సమయము వానన్నమగుచున్నది. గద్దవమందు నా శిరస్సు కనుపడుటలేదు. అదియును గాక పూర్వము నాకు శాపమిచ్చిన వృద్ధుడు కనుపించుచున్నాడు. అన కౌసల్య స్వామీ? ఇవియేటి మాటలు? శాపమేమని అడుగ దశరథుగా తను వేటాడుచు శబ్దబేది బాణం మన అడవి యేనుగును జంపబోవ నది దెబ్బక ముని కుమారునకు దగిలెను. అతడు మరణించెను. అతని తలిదండ్రులు జాత్యాంధులు వృద్ధులునగుట పుత్రశోకమును భరింపజాలక మము వలెనే నీవును పుత్రశోకమున మరణింతువని శపించి అసువులు బాసిరి. మునిశాపమేల వృధాయగును. అందువలననే నన్ని శోకము గదలించుచున్నది. రాముడు విశ్వామిత్రునితో నడి కేగునపుడు నాకే బాధలేదు. నాకిది మరణ సమయమే. గురువర్యుల బిలువనంపుమన సేవకులు పరుగులెత్తిరి. అంతలో సుమంత్రుడు రథమును తీసుకొని నగరమున ప్రవేశించెను. సేవక జనుల కంగరును వనష్టలు అంతిపురమున కేగుట జూచి సుమంత్రుడు దశరథుని చెంతకేగి ప్రణామ మాచరింప దశరథుడు సుమంత్రా! సీతరాముల నడవుల కంపివచ్చితివా! అయ్యో! హా! హతవిధీ! అని రోదించుచు గురువరా ఇది యంతయు న స్వయంకృతాపరాధము శప్తుడను పుత్రశోకమున బొగులుచున్నాను మరణాసన్నుడను. భార్య కోరిక తీర్చుటకై అనుంగు బిడ్డల నడవి పాలు జేసిన పాపిని. మీరైన నన్ను మన్నింపుడన వసిష్ఠులు రాజా! విధి బలీయము. ఏది ఎట్లు జరుగనున్నదో అట్లేజరుగును. ఈ రాజ్యము భార్యాబిడ్డలు ఎవరికెవరు? శాంతింపుమన దశరథుడు అయ్యో! రామా! నిన్ను జూడక నా ప్రాణములు నిలుచుటలేదు రామా! రామా! అని యెలుగెత్తి బిలుచుచు పాన్పున పడిపోయెను

మూసిన కన్నులు తెరువలేదు అతని ప్రాణములీ అనంతవాయువు
నందు గలిసెను కౌసల్యా సుమిత్రలు గొల్లుమన అంతిపురమంతయు
శోకమునో దద్దరిల్లెను అపుడు వసిష్ఠులు ఒక్క నిమేష మట్లే
నిలబడిపోయిరి వరి శోకమును జూడజాలక మిత్రుని మరణమునకై
బొగులుచున్న సుమంత్రుని లేవనెత్తి రెమ్ము! కర్తవ్యమును
గుర్తించుము భరతుని వెంటనే బిలిపించి సంపుము రాజు శరీరమును
తైల పేటికయందు భద్రపరుచవలయును భరతుడు వచ్చు
వరకు లస్యముగా నుంచుము అని ఆదేశించి తదుపరి కార్యక్రమమునకై
సుమంత్రునితో గూడి వెడలి పోయెను ఆ సంగతి తెలిసికైక ఘోరున
విలపించుచు కౌసల్య పరుగిడి వచ్చి రాజుపైబడి రోదించెను
తన్ను దూషించిన [illegible]ల వాక్కులు శల్యములై మనసున నాటు
క ల్యా వెదముల [illegible] బింపెను 100

## భరత శత్రుఘ్నులయోధ్యకు వచ్చుట

గద్యము దశరథుని మరణవార్తను దెల్పి భరతుని రప్పించుటకె వసిష్ఠుడు
కేకయి రాజ్యమునకు భటులను పంప 101

కం - గురువుల పంపున భటులున్
పరుగున బయనములు జేసి భయవినయములన్
సరగున గిరివ్రజ పురమున
కరుదెంచియు లేఖ నిచ్చి రారాజునకున్ 102

తే గీ -భరత శత్రుఘ్నుల వేగ బంపుమనెడి
రాజ భటులను కనుగొని రాజు బలికె
దశరథేశుండు నుండగా తనయుడైన
రాముడుండంగ గురువులు వ్రాయనేల 103

గద్యము - కేకయ రాజగు యుధాజిత్తు పత్రమును జూచి
సంశయాంతరంగుడై 104

తే గీ -భద్రమేగద సాకేత ప్రభువునకును
రాణియైనట్టి మాకైక రమణితోడ

సంతసంబున నుందురే నవతులంత
అయ్యయోధ్యలో సేమమే యందరకును? 105

గద్యము - ఏమడిగినను మౌనము వహించిన భటులనుజూచి శంకితుడై అంతఃపురముననున్న భరత శత్రుఘ్నులను బిలువనంపి మీరు శీఘ్రమే అయోధ్యకు జనుడన వారును సత్వరమే తమ భటులవెంట బయనమై వెడలిరి అనేక సందేహంబులు మనస్సును కలతపరువ భరతుడు శత్రుఘ్నునవలోకించి తమ్ముడా నా మనస్సేలనో కొందలమందుచున్నది వామ భుజంబును నేత్రమునదురుచున్నవి శకునములు గూడ కీడునే దోపించుచున్నవి అయోధ్య అంతయు చిన్నబోయి అంధకారమైనట్లు నాకు స్వప్నము వచ్చినది సుమా! త్వరగా యింటి కేగి తండ్రిగ రిని చూడవలెనను కొనుచుండ ఈ వార్త ఏమీ ప్రశ్నించినను త్తర మీయక భటులు గుఱ్ఱముల బరువెత్తించిరి ఏదియో విపత్తు సంభవించి యుండనోపు తండ్రిగారు సేమముగా నుందురా! వారి కేయాపద రాలేదు కదా! అని వాపోవు భరతునితో శత్రుఘ్నుడు అన్నా! నాకునదియే భయముగలుగుచున్నది పత్రమును పనిష్కులవారు వ్రాసినట్లున్నది ఇది యేమి విపరీతమో దెలియకున్నది అని సంభాషించుచు మధ్య-మధ్య మజిలీలైనం జేయక మూడు దినములకే అయోధ్య కేతెంచిరి పట్నమంతయు నిశ్శబ్దమై యుండె యెదురైన వారును బలకరింపక తలలు వాల్చి తప్పుకొని పోవుచుండిరి కోట దగ్గరైనను జయభేరులు వినబడలేదు అదిగో పతాక మవనతమైనది అంద్రిగారికేమయినదోయని భయాందోళిత మనస్కులై తిన్నగా కైక మందిరమున కరుదెంచిరి అచ్చట సేవకులును జయము యువరాజా జయమని లోనికి తీసుకొని పోయిరి 106

## భరతుడు కైకను దూషించుట

కం - తనయుని రాకకు కైకయు
మనమున నుప్పొంగి చాల మమతదలిర్పన్
జనుదెంచి గౌగలింపన్
గని భరతుండదిరె తనువు గాలినరీతిన్ ‖ 107

గద్యము - అలంకార విహీనమై ముడిచిన కేశములు చెదరి ఏడ్చిన గుర్తుగా కనులుబ్బి సింధూర రహితమైన ఆమె మూర్తిని జూచి అమ్మ! నిదియేమి! తండ్రిగారేరి! అని ఆమెను బట్టుకొని ఘోరున విలపించిరి భరత శత్రుఘ్నులామె కిరువైపుల బట్టికొని అమ్మా తండ్రిగారి కేమయినది వారుమనలనెట్లు విడచిరి సర్వమంగళమూర్తివగు నీవిటు శోకమూర్తివైతివా? అని విలపింప కైకయు కొంతతడవు వారిని బట్టుకొని మౌనముగా దుఃఖించినది అమ్మా తండ్రిగారినెందుంచిరి ఈ వార్త అన్నగారగు రామచంద్రుడెట్లు సహించియుండె నేనిప్పుడే వారి వద్దకరిగెదనని దిగ్గున లేవ కైక కుమారుని చేయి బట్టుకొని ముందు ధైర్యమును దెచ్చుకొని బిడ్డా! ఊరడిల్లుము రాముడును లేడు అని భరతుడు గుండెరుల్లుమన ఏమి? శ్రీరాముడు మనలనువిడిచెనా అయ్యో? ఇదియేమి విపరీతమన కైక రామునకేమియు కాలేదు ఇది యంతయు నీ నిమిత్తమే జరిగినది మీ తండ్రిగారు పూర్వము నాకు రెండు వరములిచ్చియున్నారు నీవు లేని సమయంబున మీ తండ్రిగారు రామునకు రాజ్యాభిషేకము జేయ సంకల్పించిరి తరువాత నాకు తెలిసినది నాకిచ్చిన రెండువరములలో మొదటిది నిన్నయోధ్యానగరమునకు పట్టాభిషేకము చేయమనియు - కైక మాట పూర్తి చేయకుండగనే భరతుడు నన్నా! నన్ను రాజును జేయుట యేమి అని కంగారుగా బలుకు భరతునితో వినుము రెండవ వరముగ రాముని పదునాలుగు వత్సరములరణ్యములకుపవలెనని కోర్క మీ తండ్రిగారు సత్యవ్రతులుగాన అట్లేజేసిరి కాని నీవు వచ్చు వరకుండక రామా! రామా! అనుచు దివంబున కరిగిరి అప్పటికే సీతా లక్ష్మణ సహితుడై రాముడరణ్యమున కరిగెనన భరతుడు క్రోధ రముతో మండిపడుచు - ఓసీ కైకా! నేనెప్పుడైననూ రాజ్యము గావలెనని నీతో జెప్పుకొంటినా? కుమారునికి రాజ్యమిచ్చుడ కొఱకు భర్తను పొట్ట బెట్టుకొంటివా? సుగుణాభిరాముని శ్రీరామునరణ్యముల కంపితివా? ఓసీ! నీవంటి దుష్టురాలి కడుపున బుట్టుట నా దౌర్భాగ్యము నిన్ను క్షమింపరాదు పతిఘాతినివి నిన్నిదే నాఖడ్గమునకు బలియిత్తునని

ఒరనుండి ఖడ్గము దీసె శత్రుఘ్నుడన్నను బట్టుకొని అన్నా! ఏమిటిది స్త్రీ చాపల్యము చేనేనె కోరియుండవచ్చును అంతమాత్రమునకె జనకులు చనిపోవుదురా! ఇది అంతయు మన ప్రారబ్ధము తల్లిని జంపి మాతృహత్యయు స్త్రీ హత్యయు జేయబోం మన భరతుడు చేతియందున్న ఖడ్గము విసరివైచి ఛీ! నీవు నాకు తల్లివిగావు నీ ముఖము జూడనని శత్రుఘ్నుడు వెంటర కౌసల్యాదేవి మందిరమున కేగెను భరతుని రాకవిని కౌసల్య గోడుగోడు నేడ్చుచుండ ఆమె దరిజేరి తల్లీ! నన్ను క్షమింపుము

## కౌసల్య భరతునూరడించుట

నా నిమిత్తమే ఇన్ని ఉపద్రవములుగలిగె నిర్భాగ్యుడను తండ్రిని పోగొట్టుకొని మీకు తీరని యన్యాయముగలుగ జేసి శ్రీరామునడవులపాలు జేయుటకు కారణభూతుడను నాకు రాజ్యము కావలెనని కలనైనాగోరలేదు నా దురదృష్టము వలన కైక నాకీయవస్థ కలిగించినది నీకీ శోకము గలింగించిన పాపిని నేను పుట్టక బోయిన తండ్రిగారు మరణించెడివారు కారు పితృద్రోహిని భ్రాతృద్రోహిని నన్నేమి జేసినను పాపముండదు తల్లి నన్ను జంపి కైకమీద పగదీర్చుకొమ్ముఅని పాదములబడి విలపించుచున్న భరతుని లేవనెత్తి అక్కున జేర్చుకొని కన్నీరు దుడుచుచు కౌసల్య నాయన! నిన్ను చంపుకొందునా! 108

తే గీ -ఎన్ని నోములు నోచియు యెన్ని వ్రతము
లెన్ని చేసియు కంటిమో చిన్ని తండ్రి
యొందరకు మ్రొక్కి యుంటిమో యెన్నినాళ్ళు
దైవ వరలబ్ధిచే మీరు దక్కినారు 109

గద్యము - ఎందర దైవములం నర్చించితిమిరా మీ కొఱకు విసిగి వేసారి పుత్రకామేష్టియాగము జేసి కన్నబిడ్డలు మా వరపుత్రులు బాబూ మీరు మీ మీద ప్రేమ చేతనే గదా తండ్రిగారు దివంగతులైరి నేను పాషాణసదృశను గనుక ప్రాణములి బొందిని వీడకున్నవి కైక ఏమిజే ్నది నీవేమి జేసితివి ఇది అంతయు నా ప్రారబ్ధము

కన్నబిడ్డకు దూరమై భర్తను పోగొట్టికొంటిని మీ తండ్రిగారితోపాటు నన్నును చితియందుంచి నా దుఃఖము చల్లార్చుమని ఏడ్చెను అంత సుమిత్ర కౌసల్య భరతుల నూరడించి ధైర్యము జెప్పుచుండ భరతుని రాక విని వసిష్ఠులు వచ్చిరి భరతుడు వారికినమస్కరించి గురువర్యా! నాకారణముగ తండ్రిగారి మరణమును అన్నగారి అరణ్యవాసమును సంభవించె నాకెట్టి శిక్ష విధించిన నా పాపము శమించునో మీరె జెప్పుడు అని దుఃఖించు భరతునోదార్చుచు నాయనా విధి బలీయము ఏది ఎట్లు జరుగనున్నదో అట్లే జరుగును దీనికి నీవుగాని నీ తల్లిగాని కారకులు గాదు లెమ్ము ధైర్యము తెచ్చుకొని ఇంతవరకును తైల పేటిక యందుంచిన నీ జనకుని కగ్ని సంస్కారము గావించి నీ ధర్మమును నెరవేర్చుము అని అతనిని లేవనెత్తి తత్సమయోచితమగు కర్మకాండలు జేయించెను భరతుడును గురువుల యానతిని పితృకర్మలు జేసి అపార ధనకనక వస్తువులను గో భు హిరణ్యములను దాన ధర్మములు జేసి దీన బ్రాహ్మణ తృప్తి గావించెను 110

కం - గురువులు వసిష్ఠులప్పుడు
పురజనులను బిలచి మీరు పొందుగ నపుడే
భరతుని రాజుని జేయన్
స్థిరమగు సమ్మతిని దెలియ జేయుండనగ 111

తే గీ - పౌరులందరు భరతుని ప్రభువుజేయ
సమ్మతించిరి యెంతయో సంతసమున
దశరథీశుని పుత్రులు ధర్మపరులు
రాజుగాదగు వారలీ రాజ్యమునకు 112

గద్యము - అంత వసిష్ఠుడు ప్రజల సమ్మతి ననుసరించి మంత్రిసామంతాదుల బురస్కరించుకొని భరతునితో - కుమారా! నీవీ రాజ్య సంహాసనమధిష్ఠించి ప్రజలను పాలించవలయును ఇన్నిరోజులు రాజ్య మరాజకమగుట యుక్తముగాదు ఇదినీ తండ్రిగారి యాజ్ఞ గూడనైయున్నదన భరతుడు స్వామీ! రాముడు జ్యేష్ఠుడైయుండ యతని రాజ్యముధర్మవిరుద్ధముగా నేనెట్లు పాలింతును! ఈ రాజ్యమునకు రాముడే రాజు నేనిదేవెళ్ళి రాముని దోడ్కొని వత్తును నా

మాట మన్నించి మీరును నాతో దయ సేయవలయును అని బలికి కొంత భటవర్గముతో శత్రుఘ్నుడు వెంటరా అరణ్యాభిముఖుడై బయలుదేరెను

## శ్రీరాముడు గంగను దాటుట

శ్రీరాముడు సీతాలక్ష్మణులతో సుమంత్రుని రథముపై నగరమును వల్లెలను గమించుచు గంగాతీరమునకేగి అచ్చటినుండి సుమంత్రుని వెనుకకుబంపి తాను ముందునకుసాగెను అచ్చట నుండెడి బోయలు తమయేలికయైన గుహుని వద్దకు వెళ్లి 113

ఉ - శ్రీరఘువీరుడంట తన సీతను జేకొని వన్యభూములన్
జేరగ వచ్చెనంట వనసీమలలో పదునాలుగేండ్లకున్
క్రూరమృగమ్ములుండునని గొంచెము గూడనెరుంగలేక చి
న్నారిని వెంటబెట్టుకొని నట్టడవిందిరుగంగ వేడ్కతో 114

కం - అన విని గుహుడను బోయడు
చని రామున కెదురు నడచి సాష్టాంగబడెన్
ముని వేషంబున మీరీ
వనములు దిరుగంగనేల వచ్చితిరనఘా? 115

గద్యము - అన వినిరాముడు గుహుని తో- 116

కం - ముని వేషమ్మున మేమీ
వనములు దిరుగంగ నొక్క వ్రత నిష్ఠమెయిన్
చనుదెంచితి మీ గంగకు
ననుప వలెను నీవు మమ్ము నావల దరికిన్ 117

గద్యము - అంత గుహుడు రామునితో స్వామీ! 118

కం - నీ పాదరజము సోకిన
నా పాషాణమ్ముగూడ నాడుదియయ్యెన్
నా వడవ కేమి వచ్చునొ
నీ పాదము గడుగనిమ్ము నీరజ నేత్రా 119

ఆ౭ -నాదు జీవనంబు నానావయేగదా
దాని భద్రముగన దాచుకొందు
గడవ నడిపి నాదు పాపల బోషింతు
సగతి సేగుబోకు పడవ నిపుడు 120

గద్యము - అనిన గుహుని పల్కులకు శ్రీరాముడు నవ్వుకొనుచు నీ లక్ష్మైమెట్లో అట్లేకానిమ్ము మమ్ము తీరము జేర్చి పుణ్యముగట్టుకొమ్మని బల్క గుహుడు గంగాజలముతో రామునిపాదములు గడిగి శిరసున జలుకొని పూవులతో రాముని పాదపద్మములు పూజించి రామచంద్రా! పదునాలుగువత్సరములు గడపి కాలము పూర్తికాగానే! రావలయును సుమా! నీ గాక కొఱకెదురు చూచుచుందుము నీవురాని పక్షమున నేనగ్నిని ప్రవేశించి ప్రాణములు విడుతును సుమా! అని పదేపదే మ్రొక్కినవాని కభయ మిచ్చిరాముడు సీతాలక్ష్మణులతో పడవ నధిష్ఠించెను జానకీదేవి పడవనెక్కి ఆగంగను దోసిట ధరించి భక్తి పురస్సరముగా మృదు వచనముల - 121

కం - నదిజూచి పలికె జానకి
యిదె మ్రొక్కెదనమ్మ గంగ యీవనసీమన్
బదునాలుగేండ్లు గడిపియు
పదిలముగను దిరిగివచ్చి పట్నముజేరన్ 122

కం - జననియగు కైక కోరిక
జనులెల్లను తీరపదీర్చి జనిపురమునకున్
దన వారల జేరంగా
కని కరమును జూపి బ్రోవుగంగాదేవీ 123

కం - పదునాలుగు వర్షంబులు
పదునాలుగు దినములట్లు బాగుగ గడపన్
ఎదురేమి గలుగనీయకు
పదముల మ్రొక్కెదను తల్లి పాలింపగదే 124

కం - అని సీతమ్రొక్కు చుండగ
కనుగొని రాముండు సతిని కలకలనగుచున్

మాట మన్నించి మీరును నాతో దయ సేయవలయునని అని పలికి కొంత భటవర్గముతో శత్రుఘ్నుడు వెంటరా అరణ్యాభిముఖుడై బయలుదేరెను

## శ్రీరాముడు గంగను దాటుట

శ్రీరాముడు సీతాలక్ష్మణులతో సుమంత్రుని రథముపై నగరమును పల్లెలను గమించుచు గంగాతీరమునకేగి అచ్చటినుండి సుమంత్రుని వెనుకకుబంపి తాను ముందునకుసాగెను అచ్చట నుండెడి బోయలు తమయేలికయైన గుహుని వద్దకు వెళ్ళి 113

ఉ - శ్రీరఘువీరుడంట తన సీతను జేకొని వన్యభూములన్
జేరగ వచ్చెనంట వనసీమలలో పదునాలుగేండ్లకున్
క్రూరమృగమ్ములుండునని గొంచెము గూడనెరుంగలేక చి
న్నారిని వెంటబెట్టుకొని నట్టడవిందిరుగంగ వేడ్కతో 114

కం - అన విని గుహుడను బోయడు
చని రాముని కెదురు నడచి సాష్టాంగబడెన్
ముని వేషంబున మీరీ
వనములు దిరుగంగనేల వచ్చితిరనఘా? 115

గద్యము - అన వినిరాముడు గుహుని తో- 116

కం - ముని వేషమ్మున మేమీ
వనములు దిరుగంగ నెక్క వ్రత నిష్ఠమెయిన్
చనుదెంచితి మీ గంగకు
ననుప వలెను నీవు మమ్ము నావల దరికిన్ 117

గద్యము - అంత గుహుడు రామునితో స్వామీ! 118

కం - నీ పాదరజము సోకిన
నా పాషాణమ్ముగూడ నాడుదియయ్యెన్
నా పడవ కేమి వచ్చునొ
నీ పాదము గడుగనిమ్ము నీరజ నేత్రా 119

ఆ.వె - నాదు జీవనంబు నానావయేగదా
దాని భద్రముగను దాచుకొందు
గడవ నడిపి నాదు పాపల బోషింతు
నడతి సేగుబోకు పడవ నిపుడు 120

గద్యము - అనిన గుహుని పల్కులకు శ్రీరాముడు నవ్వుకొనుచు నీ లక్ష్యమెట్లో అట్లేకానిమ్ము మమ్ము తీరము జేర్చి పుణ్యముగట్టుకొమ్మని బల్క గుహుడు గంగాజలముతో రాముని పాదములు గడిగి శిరసున జలుకొని పూవులతో రాముని పాదపద్మములు పూజించి రామచంద్రా! పదునాలుగువత్సరములు గడవ కాలము పూర్తికాగానే! రావలయును సుమా! నీ రాక కొఱకెదురు చూచుచుందుము నీవురాని పక్షమున నేనగ్నిని ప్రవేశించి ప్రాణములు విడుతును సుమా! అని పదేపదే మ్రొక్కినవాని కభయ మిచ్చిరాముడు సీతాలక్ష్మణులతో పడవ నధిష్ఠించెను జానకీదేవి పడవనెక్కి ఆగంగను దోసిట ధరించి భక్తి పురస్సరముగా మృదు వచనముల 121

కం - నదిజూచి పలికె జానకి
యిదె మ్రొక్కెదనమ్మ గంగ యీవనసీమన్
బదునాలుగేండ్లు గడిపియు
పదిలముగను దిరిగివచ్చి పట్నముజేరన్ 122

కం - జననియగు కైక కోరిక
జనులెల్లను తీంపదీర్చి జనిపురమునకున్
దన వారల జేరంగా
కని కరమును జూపి బ్రోవుగంగాదేవీ 123

కం - పదునాలుగు వర్షంబులు
పదునాలుగు దినములట్లు బాగుగ గడవన్
ఎదురేమి గలుగనీయకు
పదముల మ్రొక్కెదను తల్లి పాలింపగదే 124

కం - అని సీతమ్రొక్కు చుండగ
కనుగొని రాముండు సతిని కలకలనగుచున్

వినుమా లక్ష్మణ జానకి
వనమనుచో నెంతభయము వంతను జూపెన్ 125
తే గీ -గంగనడిగిన పుణ్యంపుగతులనిచ్చు
రాజ్య సంపలెల్లిచ్చు రమణినీకు
వదులుకొని రాజ్యభోగముల్ వచ్చినావు
కుడువు మీకందమూలముల్ కుందరదన 126
కం - అనవిని జానకి సిగ్గున
తన పతి దెస జూచి మిగుల తడబడి పలికెన్
నను మన్నింపుడు మీతో
వన ఫలముల నారగింప వరమౌ నాకున్ 127
కం - ఓడదిగి నాలుగడుగులు
చేడెను చేపట్టినడువ సీతయు బలికెన్
ఓడను గట్టున గట్టుడి
ఓడ మనము వచ్చుదనుక నొడ్డున నుండున్ 128
తే గీ -ఓడవద్దను కార్యము లోడవద్ద
నేడ దిగిపోవమరల నీయోడదేల
మనము పదునాలుగేండ్లకు మరలిరాగ
నపుడు దొరకదె దాటగ నంబుజాక్షి 129
గద్యము - అని శ్రీరాముడు సీతకు ధైర్యము జెప్పుచు గుహుని వెనుకకు
బంపి ముందునకు సాగెను కొంతమేర నడచు సరికే జానకి కాళ్లు
నొప్పులు ఋట్టి స్వామీ! 130
తే గీ -ఎంతదూరము బోవలెనింకమనకు
అడవియనగను నిదెగాదె అవని నాథ
ఇందు వసియింప జెల్లదే యిచ్చటనిలువు
నడువ జాలను యికనేను నాథవినుమ ॥ 131
కం - అన విని రాముడు సీతను
గనుగొ దయతోడననియె కాననమనగా
దినవలె ఫలమూలమ్ములు
గనవలె నిటుపైని నీవు కష్టములెన్నే ॥ 132

తే గీ - మిథిలపురి నుండి వచ్చిన రథమొయనగ
కది వచ్చితివడవికి కాంతనీవు
కష్టమైనను సుఖమైన గలసి యింక
ననుభవింపగవలెను యీ యడవి యందు 133

ఆ వె - రాజ్య భోగమ్ములను వీడి రమణి నీవు
వచ్చియున్నావు వనముకు వనితగనుము
అడఎయన గాదు పుట్టిల్లు అతివనీకు
యెండ వానల దిరుగాలి యిందునింక 134

గద్యము - అని సీతకు ధైర్యము జెప్పుచు చేయిబట్టినడిపించుచు ముందునకు సాగెను సీతయు ఛాయవలె రామునినుసరింప దారిలో వారికి కొన్ని కోయగూడెములగుపడెను అందలి స్త్రీలు వారలంజూచి ధనుర్బాణములు ధరించిన రామలక్ష్మణుల నడుమ మెరవు తీగవలెనున్న సీతతో - నీవెవ్వతెవు? ఆ పురుషులివురు నీకేమగుదురన సీత- 135

ఆ వె - వెనుక వచ్చుచున్న వీరుడా పురుషుడు
మరది యగును నాకు మగువలార
రాముజూపి నవ్వి రాజీవలోచన
సిగ్గు జెంది సీత శిరసు వంచె 136

కం - తన నాథుని జూపించిన
జనకాత్మజ భావమెరిగి జనపద వనితల్
మనమార నవ్వు కొనుచును
జనుదెంచిరివారి వారి సదనంబులకున్ 137

గద్యము - కతిపయ పయనంబులతో రాముడు భరద్వాజమునీంద్రు న్నాశ్రమమున కరుదెంచెను భరద్వాజుడు రాముని అవతార పురుషునిగానెరింగి అతని ఆగమనము లోక కల్యాణమునకే యని సంతసించి వారల నతిథి సత్కారముల నాదరించెను కొంత తడవు రామునితో ముచ్చటించి రామా! ఇచ్చటి కనతి దూరమున చిత్రకూటమను పర్వత రాజమొండుగలదు నీవందు నివాస మేర్పరుచుకొనుము 138

కం - నిత్యము ఫల పుష్పంబుల
నత్యంతము నిండి యుండు నా వన మందున్
అత్యంత పావనంబై
నిత్యము సుఖ వాసమునకు నెలవై యుండున్ 139

కం - ఆవనము నందునెప్పుడు
పావన తోయములతోడ బరగు సరస్సుల్
ఆవన శోభను గనుగొన
దేవతలే ముదముజెంది దిగుదురు భువికిన్ 140

కం - అనితన శిష్యుల బిలచియు
జనిపిరికిదెలుపవలయు సరియగు దారిన్
అని గురులాదేశింపగ
వినయముతో జనిరివారి వెంటను శిష్యుల్ 141

గద్యము - శ్రీరాముడా ముని బాలుర సహాయంబున చిత్ర కూటము ప్రవేశించి అందొక పర్ణకుటీరమేర్పరచుకొని సీతా లక్ష్మణులతో వసింపదొడంగెను ఆ ప్రాంతమునకే క్రూర మృగముల జొరనీయక లక్ష్మణుడు సర్వదా అప్రమత్తుడై యుండి రుచికరములగు ఫలమూలములందెచ్చి సీతారాముల కర్పించుచు వారి సేవల నేమరక జేయుచుండె సీతాదేవి సుకుమారి యయ్యును నిత్యము ఆ పర్ణశాలను అలికి ముగ్గులు బెట్టుచు ఆ ప్రదేశమంతయు శుభ్రపరచుచు అందలి చెట్లను మొక్కలకులనతి శ్రద్ధగా బెంచుచు నందలి మృగపక్షి శాచికములకు మెత్తని తృణాదులనేరి మేతలు బెట్టుచు వాటిలో నాడుచు బాడుచు సందనమున ప్రొద్దుబుచ్చు చుండెను శ్రీరాముడు నిత్యము అనేక చరిత్రలు సీతా లక్ష్మణుల కెరిగించుచుండ వారికా అరణ్యవాసము ఆనందప్రదముగానే యుండెను 142

## భరతుడు చిత్రకూటమున కరుగుట

తే గీ - చిత్రకూటము నందునా సీత తోడ
ఆడుచును బాడుచును యుండె ననుజుగూడి

గద్య ౧ - అంతనొక్కనాడు లక్ష్మణుడు కంగారుగావచ్చి అన్నా! యేదియో సైన్యమీ వైపు వచ్చుచుండె నా ధ్వని విని అటనున్ననెక వృక్షమెక్కి జూడ ఆ సైనికులయోధ్యావాసులవలెనున్నారు పతాకముగూడనట్లేయున్నది ముందుగా వచ్చునది భరతుడుగా నేపునన రాముడు - భరతుడెందులకు వచ్చును? కారణమేమైయుండునో! యన సీత - పదునాలుగు వత్సరములు గడచిన వెనుక మీకు రాజ్య మప్పగించ వలసియున్నదిగదా! ఆ అవకాశముగలుగకుండ యిప్పుడేమీమీద దండెత్తనేపు ఆ తల్లికుమారుడుగాడా! మీమీద పగదీర్చుకొనుట కిదియే సమయమని సైన్యముతో వచ్చుచున్నాడని దోచుచున్నదన రాముడు జానకీ! భరతుడన నేమనుకొంటివి అతడు నా బహిఃప్రాణము అంతటి కరినేక్తులాడ దగదు అని సీతను మందలించుచున్నరామునితో లక్ష్మణుడు అన్నా! వదినగారి మాటయే సత్యమని నాకును అనుమానమన రాముడు లక్ష్మణా! మీకు భరతుని తత్త్వము దెలియక నిట్లనుచున్నారు నీకంటెను సీత కంటెను గూడ భరతుడు నాకు ప్రియమైనవాడు అతని నట్లు బలుకుట సహించలేనని జెప్పుచుండగనే భరతుడు పరుగుపరుగున వచ్చి రామునిపాదములపైబడి దుఃఖించెను శ్రీరాముడు వానిని లేవనెత్తి ఆలింగనమొనర్చుకొని - నాయనా! నీ విట్లు నావెంట నరణ్యములకు రాదగునా? అటు తండ్రిగారి నొంటరిగా విడచి ఎందులకు వచ్చితివో అడుగ భరతుడు దుఃఖించుచూ అన్నా! తండ్రిగారే మనలవిడచి దివంగతులైరి అనగానే రాముడు నిశ్చేష్టుడై దుఃఖము వలన నేటమాటరాక భరతుని భుజములు బట్టుకొని - ఏమంటివి? తండ్రిగారు దివంగతులైనారా! నేనువచ్చిన తదుపరినేమయ్యె? వారి మరణమెట్లు జరిగెను? ఇందరుకుమారుల ముండియు వారి బాధదీర్పలేకపోతిమే? అని వాపోవునగ్రజునిగని భరతుడు అన్నా! దీని కంతటికిని కారణ భూతుడను నేను నిన్నరణ్యములకనిపి తండ్రిగారిని స్వర్గమున కంపిన దుష్టురాలు గర్భమున జన్మించిన పాపిని నాకే శిక్షయు జాలదు నాకు కలనైనను

రాజ్య కాంక్ష లేదు సుమా! నన్ను నమ్ముమని రాముని చేతులు బట్టుకొని బిట్టుగా విలపించెను రాముడు భరతునోదార్చుచు నాయనా! దుఃఖింపకుము దీనికి కారణం నీవుగాని కైకేయీ దేవిగాని గాదు అంతయు దైవప్రేరితము కైకేయీదేవికి నీ మీదకంటెను నా మీదనే ప్రేమ యధికము అది తెలియకామెను దూషించుచున్నావు నీవెన్నడును తల్లిను నిందించరాదు నీవే గాదు ఎవరును కైకను దూషింపరాదు కైకేయిదేవిని దూషించిన నామీద ఆన సుమా! అని భరతుని లేవనెత్తి శత్రుఘ్ను గౌగలించుకొని కన్నీరు జాలువార గురువులగు వశిష్ఠులకు నమస్కరించి నలుగురు కుమారుల ముండియు మరణసమయమున ఒక్కరును లేకపోయితిమి పుత్రశోకమున మరణించిరి ఇందులకు బాధ్యుడను నేనేయని నా మనస్సుదహించుచున్నది అని దుఃఖించెను అంత వసిష్టుడురామా! అంతయు విధిప్రేరితము నీవు సామాన్యుడవుగావు కారణజన్ముడవు సామాన్యమానవుని వలె దుఃఖింపదగదు లెమ్ము తండ్రిగారికి తర్పణములిచ్చి నీ పుత్ర ధర్మము నెరవేర్చుమన రాముడు సీతా లక్ష్మణ సహితుడై నదికిజని స్నానముజేసి శుచియై పురోహితులగు వసిష్టుని అనుమతిని తండ్రికి తిలోదకములనిచ్చి సత్తుపిండితో పిండప్రదానమొనర్చె తత్సమయోచిత కృత్యముల నాచరించి అనేక గోభూహిరణ్యంబులు భూసురోత్తములకు మనస్సంకల్పముగా ధారవోసి ఆశ్రమమునకు వచ్చి కందమూలములతో నందరికిని సంతృప్తి గలిగించి కూర్చున్న సమయమున భరతుడు రాముని పాదములకడ గూర్చుండి అన్నా! మనమిప్పుడయోధ్యకేగవలయును నిన్నుదోడుకొని పోవుటకే వచ్చితిని తల్లి కౌసల్యాదేవి దుఃఖమున కృంగిపోవుచున్నది తండ్రిగారి బాధను దీర్చలేకపోతిమి తల్లినైనను సుఖపెట్టవలయును తమ్ముని తోడను వదినగారి తోడను బయనముకావలయును లెండు - 144

ఆ వె -అన్ననీవు యిపుడె అందరు మెచ్చంగ
రాజ్యమేల వలయు రమ్యముగను
కనకంపు మనుచు కైకగోరెనుగాని
అరుగుమనుచు తండ్రియాజ్ఞలేదు 145

గద్యము - నీవును తొందరపడి వచ్చివైసితివి ఇంతఉపద్రవము జరిగినదన రాముడు భరతా! తండ్రిగారడవికేగుమని జెప్పవలయునా! వారి సత్యవ్రతమునుగాపె డవలదా! 146

ఆ వె - తండ్రిగారి యాజ్ఞ తలదాల్చి నడచుట
పుత్ర ధర్మమదియె పుడమి యందు
సత్యధర్ములైన సాకేత నాధుని
మాటమీరరాదు మనకునెపుడు 147

కం - కావు పదునాల్గేండ్లను
ఈవనవాసంబు దీర్చి యేతెంతువడిన్
నీవు నిజపురమునకు జని
గావ వలెను ప్రజలనెపుడు కారుణ్యముతో 148

కం - రజనీకాంతుడు సూర్యుడు
నిజగతులను దప్పరెపుడు నీవును అట్లే
ప్రజలను యేలుము దయతో
నిజబంధుజనంబుకెల్ల నెచ్చెలివగుచున్ 149

గద్యము - అన భరతుడు దుఃఖితుడై నీవులేని పురముననే నుండజాలను నేను అరణ్యావాసము జేయుదును నీవు పురికేగుమన రాముడు భరతునోదార్చి మన ఇక్ష్వాకు వంశీయులు సత్యసంధులని పేరు వడసిరి నేను పదునాలుగేండ్లు వనవాసము చేతునని వచ్చితిని మట నిలుపుకొన జాలని అసమర్ధునిగా జేయుకుము నీవును తండ్రి పనుపున రాజ్యమేలవలసినదే దానికి దిరుగులేదు నామాట కాదనిన నా మీద ఆన సుమా! అన భరతుడు అయిన నీ పాదుకలనిమ్ము వానినె రాజుగా జేసెదను తమ్ముడగు శత్రుఘ్నుడే రాజప్రతినిధియై పాలింపగలడు నీవు వచ్చుదనుక పురము జొరనని ప్రతిజ్ఞజేసి వచ్చితినిగాన నీవు వచ్చుతనుక నందిగ్రామము నందేవసింతును సరిగా పదునాలుగేండ్లు గడచిన పిమ్మట నీవు రాని పక్షముననే నగ్ని ప్రవేశించి ప్రాణవములు విడుతునందదనుక దినములు లెక్కించుకుందునన రాముడు నీ అభీష్టమెట్లో అట్లే కానిమ్మని తన

పాదుకలనిచ్చి ఆలింగనము జేసికొని సాగనంపె రామ పాదుకల శిరమున నిడుకొని భరతుడును శత్రుఘ్నుడును వెనుదిరిగి చూచుచూ సైన్యముతోగూడ బయలువెడలిరి కతిపయదినములకు నందిగ్రామము జేరికొని అచటనే రామపాదుకలకు పట్టాభిషేకము జేసితానును కందమూలముల దినుచు తపోవృత్తితో నుండెను ఈ పదునాలుగేండ్లను ప్రజలనుండి పన్నులు వసూలు చేయరాదని వారి సౌకర్యము కొఱకు ఖజానాలోనున్న ధనమునే వినియోగించవలెనని శత్రుఘ్నునకు జెప్పి అయోధ్యకు బంపి తాను నందిగ్రామముననే యుండెను శత్రుఘ్నుడు అయోధ్యకేగి మంత్రుల సలహా సహకారములతో రాజప్రతినిధిగా ప్రజలకే కష్టములను గలుగనీయక పాలించుచు రాముని రాకకొఱ కెదురు చూచుచుండెను 150

గద్యము ఇది అత్రేయ గోత్రోద్భవులును ఆర్వేల నియోగి బ్రాహ్మణులును చాగంటి వంశీయులునగు జోగిరాజుగారి ధర్మపత్నియు శివభక్తి దురంధరురాలును శ్రీవామలింగేశ్వర చరిత్ర మను కావ్యకృతి కర్త్రియునగు గౌరీదేవి విరచితంబగు గౌరీ రామాయణము నందలి అయోధ్యాకాండము సంపూర్ణము

# గౌరీరామాయణము

## అరణ్యకాండము

ఉ - శ్రీరఘు రాముడంత వనసీమల లోపల సంచరింపు చున్
చేరువ నున్నలోయలను సీతకు జూపుచు నెల్లవేళలన్
వీరుడు లక్ష్మణుండు వెనువెంటను వచ్చుచు నన్న యాజ్ఞలన్
ధారణ సేయుచుండనట ధర్మము దప్పక యుండి యుండగన్ 1

ఆ వె - చిత్రకూట మందు శ్రీరాము డుండగా
వచ్చి పోవుచుండె వనజ నంబు
మునులు ఋషులు వచ్చిముద మార వారితో
వేద వాదములను వేడ్క జేయ 2

గద్యము అంత నొక్కనాడు రాముడు తమ్ముని జూచి తమ్ముడా! ఈ ప్రదేశమంతయు జనులరాకపోకలతో నిండినది దీనిని బట్టి నగరవానులు గూడ నరుదెంచ వచ్చును దానివలన మనయేకాంతమునకు భంగము వాటిల్లనేవు గాన మనమీ అడవిగడచి దూరప్రాంతముల కేగుదమనిన సీత అయ్యో! మన కీప్రాంతమంతయు బాగుగ నలవాటు వడినది ఈలతాగుల్మాదులు ఈపృగపక్షిశాబకములను వదిలిపో వలయునా! ఇంతటి ప్రశాంతవాత వరణము ను విడిచి పోవుటకు మనస్కరించకున్నదన రాముడు నవ్వుచూ దేవీ! పట్టణ సౌకర్యముల కంటెను ఈ చిత్రకూటమే నీకు ప్రియమైనదా? అంతఃపుర సౌఖ్యములను వదిలివచ్చితివి గాని ఈవనము మీదిమమకారమును వదలలేకుంటివా? అనసీత ఈచిత్రకు టము శాంతిసుఖములకాలవాలమైనది ఇచ్చటికి వచ్చిన దాదిగా మనమెంతో ఆనందముగా నుంటిమి దీనిని వీడి పోవనేల? అనిన రాముడు వైరాగ్యముతో రాజభోగములను త్యజించి వచ్చిన మనకు మరల ఈమమతను రాగములేల? గహనారణ్యములలో

ఇంకను అనేకమంది మహాత్ములను దర్శింపవచ్చును ఇంతకంటెను
ప్రశాంత స్థలము లనేకములుండును గాన యిక్కడ నుండి ముందునకు
సాగుదమన సీతయు పతిమాటను కదన లేకను ఎంతో
ప్రేమతోపెంచుచున్న ఆమృగపక్షిశాబకములను వదల లేకను
ఇంతవరకును అలుకులు ముగ్గులతో తీర్చి దిద్దిన ఆకుటీరమును
వదులుటకు బాధపడి వారివెంట నడచెను 3

కం - నదులును వనములు గడచుచు
పదియా మడ మేరగడువ పావన భూమిన్
నదియొక్కటి గనపడియెను
యెదురుగ నిలుచుండె నచట యెద్దున బులియున్ 4

కం - అది చు చిరామ చంద్రుడు
ముదమున సౌమిత్రితోడ మునియాశ్రమ మె
య్యదియో యిటనుండ నగును
విదితముగా దెలిసి రమ్ము వివరము తోడన్ 5

## రామలక్ష్మణులు అత్రి మహామునిని దర్శించుట

కం - అనవిని లక్ష్మణు డపుడె
చనియెను దెలియంగ నచటి సంగతి నంతన్
వినబడియె వేదఘోషలు
కనవడె నట నత్రి శిష్యగణముల తోడన్ 6

గద్యము - లక్ష్మణుడు తిరిగివచ్చి ఇదియొక మహాత్ముని తపోభూమి 7

కం - అన్నామన పుణ్యంబున
నున్నాడిట నత్రియనెడి యొకముని వరుడున్
మున్నూట శిష్య బృందము
ఎన్నగు గుడువకను గొలుచు నీమహానియున్ 8

కం - పులులును మేకలు నప్పుడు
చెలిమి గలిగి దిరుగుచుండె చెంతను జూడన

మలిన రహిత భావంబున
కలిసి మెలసి యున్న ఏచట కలిమిన్‌బలిమిన్ 9

కం – తమ్ముని తోడను రముం
డమ్ముని వరుజూడగోరి యరిగెను సీతన్
రమ్మని జీరుచు ముందుకు
కమ్మని వాసనలవు ల కనువిందొదవన్ 10

కం – శ్రీరాముని ఆగమనము
కూరిమితో శిష్యులెల్ల గురువుకు దెలుపన్
పేరాదరమున నత్రియు
చేరెను దాశరథి జూచి చెందెను ముదమున్ 11

తే గి –తమ్ముడును తాను సీతతో తపసి వరుని
పద పద్మమ్ములకు మ్రొక్క బరమ మౌని
చెలగి ప్రేమతొ వారి నాశీర్వదించి
అర్ఘ్యపాద్యంబు లిచ్చియు నాదరించె 12

తే గి –బ్రహ్మ తేజస్సుతోడను బ్రాహ్మణుండు
పండి పోయెను శిరమంత వెండిమించి
సత్త్వగుణమున కది ఎదర్శనము గాగ
వెలుగు చుండెను అత్రియా విపినమెల్ల 13

తే గి –కలుషదూర పతివ్రతా తిలకమైన
అత్రి యిల్లాలు అనసూయ అనగజెల్లు
జాలరెవ్వరుగూడ నాసతిని బోల్చ
తల్లి మరపించు శిష్యుల తల్లియగుచు 14

తే గి –పండిపోయిన దివ్య దంపతులువారు
పార్వతీపరమేశ్వరుల్ వార నంగ
వవనంబైన యాతపో వనమునందు
వెలుగు చున్నారు జనులకు వెలుగుజూపి 15

కం – ఆదంపతులను జూడగ
ఎదేదో దివ్యబోధ యేర్పడు మదికిన్

వేదమె రూపము నంగా
నాదేవతలే యటంచు నందరుబొగడన్ 16

సీ - అనసూయ జూచెను అతివ సీతమ్మను
తన యక్కునను జేర్చుకొని వచించె
పట్టణ మందున పలుభోగములు వీడి
పతి వెంటనడవికి పడతివచ్చె
రాచ నగరునుండు రాయంచ యన జెల్లు
రాళ్లభూముల నెట్లు రమణి నడచు
చందమామను జూడ కందిపోయెడి మేను
వనముల దిరుగంగ వలసె నేడు 17

తే గీ -అనుచు బలికెడి అనసూయ కతివ సీత
భక్తిమీరగ మ్రొక్కియు పలికె నిట్లు
పతిని సేవించు విధమును పడతిజెప్పు
మనిన సీతమ్మకానుద్దు లన్ని జెప్పె 18

కం - పతియే దైవంబనుచును
సతియెప్పుడు దలచవలను సతిధర్మమదే
గతి దప్పక నేవేళను
పతివెంటను నంటియుండ పడతికి జెల్లున్ 19

కం - ఏమరక నెల్లవేళల
నీమది లోపతిని నిలిపి నీమము తోడన్
వేమరు పతిసేవల లో
భామరొబ్రతుకంగవలెను భక్తిదలిర్పన్ 20

ఆ వె -సిగ్గు గలిగి చాలసింగారమును గల్గి
భక్తి గలిగి చాల భయము గలిగి
నయము ప్రియము గలిగి నాతినీ భర్తను
వశము జేసికొనుచు వరలు మమ్మ 21

కం - అనుచును బుద్ధులు జెప్పిన
అనసూయను జూచి సీత యతివినయముతో

మనమున నీధర్మములను
అనయము పెటింతు ననుచు నతవకు మ్రొక్కెన్ 22

గద్యము - శ్రీరాముడుసీతాలక్ష్మణ సహాతుడై అత్రిఅనసూయలకు ప్రణమిల్లి
వారల ఆశీర్వాదములంది దండకవనాభిముఖుడై బయలుదేరెను
రాత్రి సమయములందు చెట్లనీడనే వసింపుచుకతిపయదినముల
పయనించినను జనస్థానమును గానకదుర్గమారణ్యముల బ్రవేశించిరి
ఎటుజూచినను మహాభయంకరముగా నుండె 23

తే గీ -కాకు లైనను దురవా కానయందు
పిట్ట లైనను గూయవు దట్టమైన
ముండ్ల డొంకలు తుప్పలు ముందు జూడ
దండకావనమందున దారి లేక 24

తే గీ -ముందు లక్ష్మణు డాదారి ముండ్లు దీయ
సీత చేబట్టి రాముడు చేరి నడువ
ఎత్తు పల్లాల గుట్టల నెల్ల దాటి
నడువ సాగిరి యడవిని నాతి తోడ 25

తే గీ -గుట్టలై పడియున్న యాపుట్ట లందు
బుస్సుమని భీతిగొల్పెడి భుజగములును
విషము గ్రక్కుచు వాయువువిషము జేయ
పట్ట పగలైన జొరరాని యట్టి యడవి 26

## విరాధ వధ

తే గీ -పులులు సింగమ్ములైనను బులుగులైన
దిరుగ గాజ ల వచ్చుట తెరవులేక
అట్టి యడవిని గనుగొని అతివ సీత
భయము బెనుగొన బలికెను పతిని జూచి 27

తే గీ -దారి తప్పితిమో లేక దారి లేదొ
యిట్టి యడవిని జిక్కితి మేది దారి

యున్న చోటను సుఖముగా నుండ లేక
వచ్చియున్నాము దెలియకీ వనమునందు 28

కం- అని సీత బలుకు చుండగ
విన బడియెను పెద్దకేక వీనులకి బగులన్
గనుపించెను బెంజీకటి
విను వీధిని గానబడియె వికృతా కృతియున్ 29

గద్యము - అటువంటి రాక్షసునెన్నడు జూడని సీత భయముచే వణుకుచు భర్తనుకౌగలించుకొని కన్నులుమూసుకొనెను ఆరక్కసుడు గట్టిగా అర్చి సీతారాములనిద్దరిని బట్టుకొని ఆకసముపైకెగరెను అంతరాముడు ఖడ్గముతో రక్కసుని రెక్కలనుఖండించెను వాడునుకొండవలె క్రిందబడి గట్టిగాఆర్చి ప్రాణములువిడచెను అతని శరీరమునుండిఒకదివ్యపురుషుడు బయటబడి రామునకు నమస్కరించి - అయ్యా! నేనొక యక్షుడను కుబేరుని సేవకుడను కర్తవ్యమును విస్మరించి నందున అతనిశాపమునకు గురైతిని విరాధుడను పేర నరభక్షకుడనై యీదండకాటవి యందుక్రూరుడనై దీనినంతయు నిర్జనముగావించితిని నీవుమహాత్ముడవుగనుక నాకుశాపవ శమనముగావించి పుణ్యముగట్టుకొంటివి మీరీదక్షిణ దిశగావెళ్లిన మందాకినీ నదిగనుపించును ఆతీరమున కొంతమేరగడచిన శరభంగమహాముని ఆశ్రమము గనుపించునని దారిజూపి దివంబునకెగిరిపోయెను రాముడు లక్ష్మణుని సహాయముతో నారాక్షసదేహమును బూడ్చి విరాధుడు చెప్పినదిశగా పయనించెను ఆశ్రమమున శరభంగు డవసానదశలో నుండెను రామలక్ష్మణు లామునిదరికి వెళ్లినమస్కరించిన అతడును ఆనందముతో - రామా! వచ్చితివా! తండ్రీ! నీరాకకొఱకేయెదురుజూచు చుంటిని ధన్యుడనైతిని నీవుకారణజన్ముండవు ఈ దండకవన మంతయు రాక్షసమయము ఈఅసురుల దును మాడి యిందున్న తాపసులకు రక్షణకలిగించుము మరణసమయమున నీదర్శనము గలిగె నీవు శ్రీమన్నారాయణుడవు నాజన్మతరించెను నాకుసెలవొసంగు మని బల్కి ప్రాణములువిడచెను

రాముడు అక్కడనున్నమునులతో గూడి తిరిగిపయనము సాగించెను ఆవనమునగల మునులఆశ్రమముల యందుకొన్ని దినములు వసించుచు ముందుకు సాగెను అచ్చటనున్నమునులు రాక్షసభయము నివారించుమని రాముని ప్రార్థించిరి రాముడు వారలకభయమిచ్చి రాక్షససంహారమునకే తానీఅడవులకు వచ్చితినని జెప్పెను అటనుండి రాముడు మునులతోగూడ సుతీక్ష్ణుని ఆశ్రమమునకేగెను సుతీక్ష్ణుడు తపస్సుచేకృశించిన దేహముతోను మఱ్ఱిఊడలవంటి జడలతోను ధూళిధూసదమున గప్పబడియుండెను ఆమునిముఖముపవిత్రమైన తేజస్సుతో ప్రకాశించుచుండెను ఎండ్లతరబడి సమాధియందున్న సుతీక్ష్ణుడురామలక్ష్మణులట చేరగనే కన్నువిప్పి జూచిన సీతారాములను సాక్షాత్‌లక్ష్మీనారాయణులుగా దర్శించెను 30

కం – ఎదురేగి రామచంద్రుని
హృదయంబున హత్తుకొనుచు ఋషివరు డంతన్
ముద మందెను తనభాగ్యం
బిదియని పొంగుచును అర్ఘ్య మిచ్చెను వేడ్కన్ 31

కం – రామా! శ్రీరఘు రామ!
రామా! రవికులప్రదీప రాజీవాక్షా!
రామా! దనుజ విదార!
రామా! మమ్మేలు కరుణ రఘుకులసోమా! 32

తే గీ –నేనుజేసిన పుణ్యంబు నిజము గగ
నిన్ను జూడంగ గలిగెను నీరజాక్ష
నీదు రాకను గోరుచు నేనుయుంటి
నాదు ఆతిథ్యమును గొను నలిననేత్ర 33

గద్యము – అనిసుతీక్ష్ణుడానందాతిశయమున అతిథిమర్యాదలతో నాదరించెను రాముడును ఓ మహాత్మా! మేము యింకను కొంతకాలము వనవాసముచేయవలసియున్నది గానమాకు వాసయోగ్యమైనప్రదేశము జూపుడన సుతీక్ష్ణుడు రామా! నాయీ ఆశ్రమమున నీయిచ్చవచ్చినన్నిదినంబులుండి నన్ను ధన్యుని జేయుము

ఇదియెంతయో ప్రశాంత వాతావరణముగదా! అన రాముడు మహాత్మా! హింసాశాంతి అహింసలు మూర్తీభవించిన పరమపవిత్రులు మము క్షత్రియధర్మమైన పరాక్రమముతో క్రూరజంతువులను రాక్షసులను చంప దలచి తిరుగు చున్నాము ఇట్టి పవిత్రస్థలములందు హింస జరుగరాదుకావున మేముదూరముగనె యుండవలయును మమ్ము మన్నించి తగుస్థలమును జూపుడన సుతీక్ష్ణుడు అయిన మీరీమార్గమున బోయిన అగస్త్యమహాముని ఆశ్రమ మగపడును ఆయనను దర్శించిన మీకు శుభ మగును అని ఆశీర్వదించి పంపెను రాముడు సీతాలక్ష్మణసహితుడై అగస్త్యముని ఆశ్రమ సమ్ముఖుడై బయలుదేరెను హింసాతత్పరుడగు భర్తను గనుగొని 34

కం - రాముని సంకల్పంబును
భూమిజ మదినెరిగి బుగుల పొందెను దుఃఖం
బేమి! హింసింపక యె
కామితములు దీరవొక్కొ క కుత్సానకున్ 35

గద్యము - హృదయము కొందల మందదయార్ద్రహృదయగావున హింస యనిన నహింపనేరక పతితో రాక్షసులను జంపెదనని ప్రతిజ్ఞజేయుచున్నారు వారుమీకే మపకారము జేసిరని వారినిజంపుట ఇదియేటి క్షాత్రధర్మము అహింసా పరమోధర్మః అను నార్యోక్తి వినరాకో! 36

తే గీ -పరులకుపకారమును జేయ పరమ సుఖము
పరుల పీడింప దుఃఖపాపంబు లొదవు
హింస కంటెను పాప మింకేమి గలదు
హింస జేయక గడవదో యిలను మనకు 37

తే గీ -కత్తి చేపట్టి నప్పుడే కలుగు మదిని
క్రూరభావంబు లెన్నియో కుత్సితంబు
బుద్ధి కలుషితమొనరించి పురుషు నకును
మనుజ భావమ్ము లడగించి మలినపరచు 38

కం - వేషములు జూడ మునులై
భాషలు వినసాధుజనుల భావము నింపున్

భేషజ మేటికి యిపుడీ
దోషములను జేయ మీరుదొరకొను నపుడున్ 39

కం – చెప్పినది చేసి చూపిన
నొప్పును బుధజనుల మెప్పు లొందుదు రిలలో
గొప్పగు పనులను జేయక
తప్పులు సేయంగ మీకుదగునా యిటులన్ 40

తే గీ –సర్వ జీవుల దయజూడ సమ్మతమ్ము
బుధుల వాక్యమ్ములను బట్టి పోవ వలయు
హింస అనగానె నామది సంశయించె
మీకు జెప్పంగ నేపాటి మేదినీశ 41

కం – అని బలుకు జానకిసతి
వినయంబును దొడ్డబుద్ధి విని రాఘవుడా
వనితకు దెలియం జేసెను
జనహితమగు నట్టి సర్వసద్ధర్మమ్ముల్ 42

ఆ వె –ఆకులలము దినుచు నడవుల దిరిగెడి
తాపసులను జంపు దనుజు లైన
హంతకు లగు వారి హతమార్చ పాపమే
సాధురక్షణమ్ము సలుపవలదె 43

## అగస్త్య మహాముని చరిత్ర

గద్యము – సీతాదేవి మనంబున గల సంశయ [illegible] దుష్టశిక్షణ శిష్టరక్షణ నాకర్తవ్యముగాన నేన ధర్మమును విడువజాలను ఆర్తత్రాణము కంటె మరియొక పరమధర్మంబులేదు రాక్షస బారినుండి ఈసాధు పుంగవులరక్షణ మవశ్యకర్తవ్యము [illegible] యిందు పాపములేదని బోధించి తమతో వచ్చుమునులతో నాదండకవనమునందు సంచరింపుచు నుండకొంతకాలము గడచెను ఒక్కొకఆశ్రమమున కొంతకాలముండి అటునటు దిరుగుచుండ కొన్నివత్సరములు గడచెను తరువాత

అగస్త్యమహామునిని దర్శింప నేగెను తమ్ముడైన లక్ష్మణునికి అగస్త్యమునిమహాత్మ్యమును దెలియజేయుచు - దివాకరుని గమనమడ్డగించిన వింధ్యనగాధిపతి గర్వమడంచుటకై దేవతలపంపున అగస్త్యమహామునిదక్షిణ దేశతీరమునకు వచ్చెనని లక్ష్మణుడగస్త్యుని చరిత్ర దెలియజేయమని కోరెను పూర్వము వింధ్యుడు హిమవన్నగమువలె వెలుగొందవలెనని అత్యున్నతుడై పెరిగి సూర్యమండలము వరకును లేచెను సూర్యగమనమున కాటంకము గలిగినదేవతలు అగస్త్యుని వేడుకొన అతడు ఉత్తరదిక్కునుండి దక్షిణమునకేతెంచెను వింధ్యుడు అగస్త్యునకు వంగినమస్కరించెను అగస్త్యుడు వానినిదీవించి వింధ్యా! నేను మరల వచ్చువరకును నీవిట్లేయుండు మని ముని ఆదేశమున వింధ్యుడు అణగియుండె అగస్త్యుడు తిరిగి ఉత్తరమున కరుగక నిందేయుండి తపమొనర్చుకొనుచుండెను ఆమహాత్ముడు వచ్చునరికి ప్రాంతమంతయు రాక్షసమయమై యుండెనట వారిలో ఇల్వలుడు వాతాపి అనునిద్దరురక్కసులుండిరి వారుబలగర్వితులై మునులను పీడింప దొడంగిరి బ్రాహ్మణవేషంబున సాధుసజ్జనుల మోసగించి వారికాతిథ్యమిత్తుమని పిలచి ఇల్వలుడు తమ్ముడగు వాతాపిని జంపి ఆమాంసముతో వారలకు భోజనమిడి వారుతినిన వెంటనే వాతాపీ ఇటురమ్మని బిలువ వాడు అతిథులపొట్టజీల్చుకొనివచ్చెడి వాడు తరువాత నాసోదరులు ఆసాధువుల మాంసము దినెడివారు అదితెలిసియే అగస్త్యమహాముని గూడవారికి అతిథిగా వెళ్లి భోజనముమైన వెంటనే జీర్ణం వాతాపి జీర్ణం అని వాతాపినిజీర్ణించుకొనియెను ఇల్వలు డెన్నిసారులు బిలచినను వాడురాలేదు అగస్త్యుడు నవ్వుచునాపొట్టను బడినవాడు మరల నెట్లు వచ్చును? వాడు జీర్ణం బయ్యెనని ఇల్వలుడు మండిపడి మునినిజంపబోవ అగస్త్యుడు తననేత్రములనుండి అగ్నిని బుట్టించిఇల్వలుని భస్మముజేసెను అప్పటినుండియు యీప్రాంతమందలి రక్కసులు క్రూరభావములు విడచి అగస్త్యుని

శిష్యులైరి అందుచే యిక్కడరాక్షసభయముండదు అనిజెప్ప లక్ష్మణుడు వాతాపిఇల్వలులెవరు వారికా బలమెట్లు వచ్చెనన రాముడు ఆరక్కసులచరిత్రను సీతాలక్ష్మణులకెరిగించెను పూర్వకాలమున ఒకప్పుడు దూర్వాస మహాఋషి సమాధినిష్ఠనుండి లేచి నదియొడ్డున సంధ్యానుష్ఠానములొనరించుచుండ అయోముఖియను యొక రక్కసి వానిపైబడి తనకామవాంఛదీర్చికొనియెను దూర్వాసుడు వివశుడై రక్కసి సాంగత్యమువలన మలినపడిన శరీరమును నదియందుపవిత్రముజేసికొని దూరారణ్యములకుబోయెను ఆదూర్వాస మహాఋషి యొక్కతేజస్సువలన ఆరక్కసినద్యోగర్భమై ఇద్దరుసుతులను గనియె వారు తండ్రివలె క్రోధస్వభావులును బలవంతులును తల్లివలెక్రూరులునై భయంకర రాక్షసులై బ్రహ్మను గూర్చితపమొనరించి అమరులగునట్లు వరములు బడసిరి ఆవరబలగర్వమున ప్రజలపీడింపు చుండెడివారు మహాశాంతస్వభావుడును తపశ్శక్తిసంపన్నుడును అగు అగస్త్యుడు ఆరక్కసులశక్తిని హరించి వారలను హతమార్చెను ఇదియేఅగస్త్యుని తపోభూమి ఇంద్రాదిదేవతలు ఇందువిహరించుటకు వచ్చుచు ఈమహాత్మునిసేవించియేగుచుందురు ఎందరో మహాత్ములు తపోధనులుఇచ్చటసిద్ధిబొంది దివ్యలోకంబులకేగిరి అదిగో ఆశ్రమము లక్ష్మణా! నీవుముందుగా బోయి నారాకనెరిగింపుమన లక్ష్మణుడు జని ముంగిలియందున్న శిష్యులకు నమస్కరించి - 44

కం - ఇన వంశంబున బుట్టిన
ఘనుడా రాముండు వచ్చె గావున నిపుడే
చనిమీ గురువరుని తో
వినిపింపుము మాదు రాక వివరముతోడన్ 45

తే గీ - తండ్రి సత్యంబు నడుపగ తపసి యగుచు
అరుగు దెంచెనురాముడీ అడవి నుండ
అతని అనుజుని లక్ష్మణు డండ్రు నన్ను
అన్న సేవింప వచ్చితి నతని వెంట 46

కం - మా రాకలు మీగురువుకు
చేరి తెలుపుడయ్య వేగ సీతారాముల్

కోరి మిము జూడ వచ్చిరి
వారికి దర్శనమొసంగి వరలు మటంచున్ 47

గద్యము – ఆపలుకులు విని అగస్త్యమహాముని శిష్యులు లోనికేగి సాకేతపురాధినాధుని పుత్రులురామలక్ష్మణులు మీ సేవకైఅరుదెంచిరన అగస్త్యుడు సంతోషించి వారలకెదురేగి ఆదరంబునగౌగలించుకొని వారిద్రవణాపవయులను గొనిదీవించి లోనికిదొడ్కొనిపోయి అతిధిమర్యాదలనాదరించెను ఆఆశ్రమమునసర్వదేవతానివాస స్థానములను అందుప్రతిష్ఠింప బడినదేవతామూర్తులను వారినారాధింపు మౌనిసత్తముని అకుంఠితదీక్షకు రాముడాశ్చర్యమొందెను రుచికరమగుఫలము లమూలతో రామలక్ష్మణులనుసంతృప్తులనుజేసి తనవద్దనున్నదివ్యశస్త్రములను వైష్ణవశరాసనమును అక్షయతూణీరంబులను రామునకిచ్చి ఇదివిష్ణుదేవునిశరాసనము నురవరోధుల జంపియున్న దివ్యచాపము దీనితో నీవురక్షససంహారమొనర్చి దేవ బ్రాహ్మణులకు శాంతిభద్రతలు చేకూర్చుము అని దీవించెను రాముడు మహాప్రసాదంబని వానిని స్వీకరించెను వాటిప్రయోగ ఉపసంహారములను గూడదెలిసికొనెను తరువాత అగస్త్యమహాముని ఒకదివ్యమణిని కానుకగానిచ్చెను

కం – ఆముని యిచ్చిన రత్నము
రాముడు గైకొనుచు దివ్యరత్నము నిదియే
భామామణి భూషణమో
యీమణి మీకెటు లభించె నెరిగింపుమనన్ ॥ 48

## శ్వేతుడను రాజర్షి చరిత్ర

కం – చిరకాలము క్రిందట నే
బరమేష్ఠిని గూర్చి దపముబాగుగ జేయన్
దిరిగితి వనములు నదులున్
బరికించితి గడకు నొక్క పద్మాకరమున్ ॥ 49

కం – జలమిందు గలదటంచును
దలచి యు నిదిదగును నాకు దపమున కనుచున్

నలుమూలలు బరికింపగ
కలదొక మానవ శవమ్ము కసిగందకయే ॥ 50

తే గీ –అంతలో వచ్చె నొకదివ్య యానమటకు
దివ్యరూపంబుతో నట దిగియె నొకడు
శవము కడకేగి కోస భక్షించె ద ఎ
తిరిగి యాశవ మప్పుడే తేజరిల్లె ॥ 51

తే గీ –అబ్బురంబున నటకేగి యడిగి తిట్లు
హేయమగు శవమిది నీవుయెట్లు దీని
రోత లేకయె దింటివి ప్రీతితోడ
ననిన దనపాపఫలమని అనియె నతడు ॥ 52

నేను విదర్భాధిపతియగు సుదేవుని జ్యేష్ఠపుత్రుండను శ్వేతునామంబున సకలవిద్యాపారంగతుడనై శత్రువుల నిర్జించి తండ్రితరువాత రాజ్యమేలితని మహాపరాక్రమముతో స్వార్థము తోసకలభోగంబు లనుభవించి తుదకు విరక్తిజెంది నాతమ్ముడగు సురధుని రజును జేసి తపోవనముల కరిగితిని మూడు వేలవత్సరములు తపము జేస సిద్ధి బొందితిని కాయము విడిచి స్వర్గసుఖము లనుభవించు చుండియు క్షుత్తుచే తపించ వలసిన కారణమేమన పరమేష్ఠి నీవెంత సాధువర్తనుడవైనను పరులకుపకారము జేయవైతివి అన్నదానవిహీనత వలన నీకీ ఆకలిదాపురించెను ఒరులకష్టముల పాలు జేసి నీశరీర సుఖమునకే పాటుబడితివి గాన నీవు భూలోకమున కేగి నీశవమునే దినుచుండుము దినదినమునది తేజము నొంది నీక్షుత్తు బాపునన నేను చింతించి పితామహా ఎంతకాలమిట్లుగడుపవలెనన అగస్త్యమహాఋషి నీకడకేతెంచును వానివాక్కులు వినిన నీపాపము నక్షుత్తును వారించును నీవువిముక్తుడవగుదువని సెలవిచ్చెను తమదర్శనమువలన పాపవిముక్తుడ నైతినని యె నంతలో ఆశవ మంతర్హితమయ్యెను అతడును దివంబునకేగుచు 53

సీ – అన్నదాన విహీనమ్మైన దోషమ్మున

ఆకలిదప్పుల నడలవలసె
పరుల పీడించిన పాపఫలముల వల్ల
తన శరీరమె తానుతరగ వలసె
ఒరులకష్టమ్ములో నుండజేయుట వల్ల
తనకాయ మేతాను తినగ నయ్యె
స్వార్థ పరులగుచు చరియించు చుండిన
కష్టాలు బడుదురు కడకు వారు ॥ 54

తే గీ -మనుజు డెప్పుడు ధర్మంబు మరువ రాదు
తనకు గలిగిన దానిలో తగిన యంత
ఒరుల కిడి దానుదినవలె నున్నదాని
నట్లు గాకున్న సుఖము లేదందు నిందు 55

గద్యము - గావున మానవులు ధర్మమార్గమును వీడి చరించరాదు దీనికి నాజీవితమే సాక్షి యని బల్కియాదివ్యరత్నమిచ్చి బోయెను అప్పటినుండియు అది నావద్దభద్రముగానున్నది దీనిధరించ దగిన వాడవీవే గాన స్వీకరింపుమన రాముడా మునికి ప్రణమిల్లి గురువరా! ఈఅరణ్యమునకు దండకారణ్యమను పేనేలగలిగెనన అగస్త్యుడు రామునకు దండకారణ్యమును గురించి చెప్పందొడంగె పూర్వమొకప్పుడు మీఅయోధ్యానగరమును ఇక్ష్వాకుడను రాజుపాలించు చుండెడివాడు అతనికి నూర్గురు కుమారులుండెడివారు వారసమానబల పరాక్రమములుగల వీరులు వారిలో కడపటవాడు దండుడనువాడు క్రూరస్వభావుడై ప్రజల బీడింపుచుండ తండ్రివానిని గహనారణ్యముల నుండుమని పురినుండివెడలనంపె నంతవాడును రాజాజ్ఞనకు కట్టుబడి అరణ్యమున బ్రవేశించి శుక్రాచార్యుని ఆశ్రమమున కరిగి అతని అనుమతిని ఆఅరణ్యమంతయు జన నివాసమొనర్చి కొంత మంది ప్రజలతో నొకనగరమును నిర్మించుకొని అందేయదేచ్ఛగా పరిపాలించుచుండెను ఒకనాడతడు నదిలో జలకములాడుచున్న నొక సుందరిని జూచి కామించి ఆమెవెంటబడియె నామెయు నేనుశుక్రాచార్యుని పుత్రికను నీకుగురుపుత్రికను సోదరితుల్యను

గనుక నన్ను విడువుమని వేడుకొనియె గాని కామాతురుడగు దండుడామె బల్కులు లెక్క గొనక బలిమిని ఆమెనుబొంది తన దారిని బోయెను ఆమెయేడ్చుచు తండ్రి వద్దకేగి విషయమును జెప్పిన శుక్రుడుమహాక్రోధంబునే దండునివానినగరము పరివారముతో భస్మమగునట్లు శపించెను అంతనాప్రదేశమంతయు భస్మమై యెండి నిర్జలమును నిర్జనమును నైతరులతాశూన్యమై గహనారణ్యమయ్యెను అదియే దండకారణ్యమన బరగె తరువాత నా చుట్టు ప్రక్కల గల జను లాక్రోశించుచుండ శుక్రపుత్రిక వారల నాదరించి తమతండ్రి ఆశ్రమ పరిసరముల వాసముచేయుటకు దగినయేర్పాటు గావించె నని దండకారణ్యము చరిత్రరామున కెరిగించెను రాముడును అగస్త్యునకు నమస్కరించి మేమీ అరణ్యమున నివసించుటకు దగినప్రదేశము దెలియజేయుడన ఆ మునియు రామునితో రామా! ఇచ్చటకు పది యామడల దూరమునే పంచవటియను ప్రదేశము గలదు ఆసమీపముననే గోద వరీనది ప్రవహించుచున్నది ఆగౌతమీ తటమున సర్వఋతువులువును వసంతమునే దేపించును ఫలపుష్ప లతాగుల్మాదులతో నిండి హృదయముల నలరించును మీకది వాసయోగ్యమగునన రాముడు సంతసించి అగస్త్యునిసెలవంది సీతాలక్ష్మణులతో పంచవటివైపుగా పయనించెను 56

## పంచవటీ తీరమున పర్ణశాల నిర్మించుట

కం - రాముడు లక్ష్మణుడును నా
భూమిజ తమవెంట రాగ భూజంపములన్
వేమరు దలకున్ దగులగ
యేమరిక యె యేగుచుండి రెంతయొ దీక్షన్ 57

కం - కొండల కోనల దిరుగుచు
నెండల వనలకు నైన నేవిధి జూడన్
గుండెలు నదరుచు నుండిపి
యుండగలిగె సీత మిగుల యొద్దిక తోడన్ 58

కం - వల్లవపాణి తన చరణ
పల్లవములు గందిపోవ భయమందకయే
యుల్లాసముతో నెప్పుడు
సల్లాపంబులను నెరపు సఖ్యత తోడన్ 59

కం - శ్రీ రాముడు పంచవటిన్
చేరుపగా లక్ష్మణుండు సేవలు జేయన్
కూరిమి సతితో గూడన్
వేరే చింతలును లేక వెలుగుచు నుండెన్ 60

గద్యము - జటాయువు అనునొక పక్షిరాజము వారలకు సడవులలో దేడుగా నుండి ఆ పంచవటీ తీరమున పర్ణశాల గట్టుటకును ఆప్రదేశము శుభ్రపరచుటకును సహాయము జేయుచు వారిని గొలుచు చుండెను రామలక్ష్మణులు దశరథమిత్రుడగు ఆపక్షిని తండ్రికి వలెనే మన్నించు చుండిరి కాలచక్రమున ఋతువులు మారు చున్నను ప్రకృతి తనపరువమును గనపరచుచు ఆనందమును గలిగించుచుండెను
61

## శూర్పణఖ రామలక్ష్మణులదరికి వచ్చుట

కం - హేమంత ఋతువు నందున
చేమంతులు విరియబూసి చిరుజొంపములన్
హేమంపు రంగు లీనుచు
కామంబులు కలుగ జేయు కౌతుక మెప్పన్ 62

కం - పగలెల్ల బాటు పడుచును
సగ మాకలిపొట్ట తోడ సంధ్యా వేళన్
మగవారు గూడు సేరగ
మగువలు ననురాగమునను మక్కువ జూపన్ 63

కం - ఒకనాటి సంధ్య సమయుం
బొక పూపొదరింట సీత పూవులుగోయన్

అకలంకు డైన రాముం
డొక దెసపరికించి జూచె నొక జవరాలిన్ 64

కం= రాముని జూడగ నాచెలి
కాముని బారికిని జిక్కి కాకుత్థ్సునితో
నాఖుదిని దేచి నావే
నాఖుగడవు గమ్మటనుచు నాతియు బలికెన్ 65

గద్యము – ఆపడతిని జూచిరాముడునవ్వుచు నామె ఎకింట ఇటువట్టించవలెనని
సుందరీ! నీవెందుండు దానవు? నీపేరేమి? యీఅరణ్యముల
కేల్రవచ్చితివి? అనిఅడిగెను ఆమెయు నంతనంబున
రాముని దాపునకువచ్చి – నేనురాక్షసవీరుడగు రావణుని చెలియలను
నన్నుశూర్పణఖయందురు నీవంటి సుందరుని బొందిన
నాసామర్థ్యమును శక్తియుక్తులును సార్ధకము లగును
నేనాఆకాశగమనమును కామరూపమును నేర్చిన జాణను నీవు నాతోడ
వత్తువేని ఇంద్రసౌఖ్యముల బొందింతును రమ్మన 66

తే గీ –నాకు కున్నదియొక సతి నాతి వినుమ
సవతి పోరేల నీకు నీసఖియ తోడ
అఘట్ట నున్నాడు నాతమ్ము డతివ జూడు
వాడు నీకగు సరిజోడు వనిత పొమ్ము 67

గద్యము= ఆపలుకులు వినిశూర్పణఖ లక్ష్మణుని జేరి నీయన్నకంటెను
నీవుసుందరాంగుడవు నాకుదగిన వాడవు నీవే నన్నుబొందిసుఖించు
మన లక్ష్మణుడామె మాటలకు నవ్వు కొనుచు - 68

తే గీ –అన్నసేవించు చుండిన నస్వతంత్రు
నన్ను బొందిన నీకేమి నాతి సుఖము
సేవ చేయుంగ జాలవు చేడె నీవు
ప్రభువును వదలి సేవకున్ బట్టనేల 69

గద్యము – లక్ష్మణుని మాటలు విని శూర్పణఖ తిరిగిరాముని వద్దకు వచ్చి
నీవే నన్ను చేకొను మీచిన్నది నీకుదగదు దీనినిప్పుడే మ్రింగెదను
మనము సుఖముగా నుండ వచ్చునని భయంకరాకారమునుబొంది

వికృతముగా నోరుతెరచి గట్టిగాఅర్చి సీతపైదుమికిన సీతభయము
తోగడగడవడంకుచు భూమిపై బడియె రాముడు తమ్మునిదెస జూచి
దీనినిక సైరించవలదన లక్ష్మణుడు వెంటనేకరవాలమును బెరికి
దానిజుట్టు బట్టిఈడ్చి దాని కర్ణ నాసికలుగోసి విరూపిణిని జేసి
త్రోసివైచెను అంత శూర్పణఖ గోలుగోలున నేడ్చుచు రక్తములు
జిమ్ముచుండ మరింత భీకరాకారముతో పరుగెత్తెను 70

కం – ఖర దూషణులను రక్కసు
లిరువురు సోదరులు వార లింద్రుని కైనన్
వెరువరు కడు బలశాలురు
గరువమ్మున నేలుచుండ కాననమందున్ 71

తే గీ – ముక్కుజెవులను గోసిన దిక్కు లదర
యేడ్చుచునుబోయె రక్కసి యిందరుండి
వీరులగు సోదరులు గలవెలది నయ్యు
భంగపడితిని జూడరే వరులచేత 72

గద్యము – అని రక్తముగార వికారమైన మోముతో నేడ్చుచువచ్చు
శూర్పణఖనుజూచి ఖరదూషణులు బాధయు కోపమును బెనుగొన
ఆమెనూరార్చి నిన్ను విరూపిణి జేసిన వారెవ్వరు వారిపీచమడంచెదము
జెప్పుమన బిట్టుగానేడ్చుచు పంచవటి యందుపర్ణశాలగట్టుకొని
అన్నదమ్ము లిద్దరుండిరి వారు సుందర పరాక్రమములు గలిగిగర్వించి
యున్నారు వారి యొద్ద నొకచిన్నదిగలదు అది జగదేక సుందరి
యనజెల్లు అట్టిసుందరి మీవంటి శూరులవద్ద నుండవలెను
గానిఅన రాధవుల వద్దగాదు ఆఅన్నదమ్ములనుక్కడంచి
ఆచిన్నదానినిదెచ్చుకొనుడు అని వారల నారామలక్ష్మణులపై
పురికొల్పెను అదివినిఖరదూషణులు కోపమున మండిపడి – 73

## రాముడు ఖరదూషణుల సంహరించుట

కం – అరి వీర భయంకరు లీ
ఖరదూషణులుండ నిట్లు కాంతరొ నిన్నా

నరులెంత కావరమ్మున
వెరపించి విరూపి జేసి వేధించి రొకో 74

గద్యము - వారలం జంపి ఆచిన్నదాని చే నీకూడిగములు జేయించెద మూరడిల్లు మని బలికి పదినలువురురక్కసుల మహాబలవంతులను రామలక్ష్మణులపై బంపి తామునుసమరసన్నాహులైబయలుదేరిరి ఆపదినలుగురురక్కసవీరులను రాముడొక్కబాణమున దెగటార్చెను అదిచూచి దూషణుడు బిట్టుగాకేకలువైచు ప్రస్త్రాలపై బడిన రాముడు సీతనొక కొండగుహాయందుంచి లక్ష్మణునట గావుంచి తానేదూషణునితోబోరి వానినిబరిమార్చెను ఒక్కవీరు డింతమందిని జంపుట విని 75

తే గీ -ఒక్కవీరుండు నిందరనుక్కడంచె
నిట్టి బలశాలి జూడబో మింత వరకు
అనుచు నాశ్చర్యమును బొంది యా ఖరుండు
తనదు సేనాని త్రిశిరుని దగిలె ననికి 76

గద్యము- బాహుబల దర్పితుడైన త్రిశిరుడు తనమాయా బలంబున నాప్రాంతమంతయుగప్పివేయ రాముడును వాయవ్యాస్త్రంబున దానిని ఛేదించిబాణవరంవరలగుప్పించి వానిని సైన్యముతోగూడ సమయించెను అదివిని ఖరుడు కాలాంతకుని పగిది రామునిపై దుమికెను రాముడును - ఓరీ నీచా! మదబలగర్వితుడవై సాధుహింస జేయుచుండెడి నిన్నువిడువరాదు ఆకులలములు దినుచు భగవంతుని జపించుకొను సాధుజనులను మునిపుంగవులను జంపెడి నీకిక కాలముసరి రమ్ము 77

కం - ధనమును బలమును గలిగిన
ఘనుడవునై యుండి యింత కరినుడ వగుచున్
మునులను సాధుల జంపన్
మన సెటులంగీక రించె మగతన మిదియే? 78

తే గీ - మునుల జంపుట గాదు నాముందు నిలువు
సాధువుల జంపనే పాటి శౌర్య మగును
సాటి వారితో పోరాడ సామ్య మగును
రమ్ము నాతోడ బెనగుము దమ్ములున్న 79

కం – ఇంతటి బలమును గలనీ
యంతటి బలశాలితోడ నని యొనరింపన్
సంతస మయ్యెను నాకును
నంతకు పాలికిని నిన్ను నంపుదు నిపుడే 80

గద్యము – అనిమహోగ్రోద్రమతో మహాస్త్రములతో యుద్ధముజేసి వానిని యమసదనమున కంపెను అంత దేవతలు పుష్పవర్షము గురియించిరోయ్యన మేఘము నీటితుంపరలగురియించె ఖరదూషణ సంహారమువిని మునులందరును వచ్చి రామునిగొనియాడి ఈతడు శ్రీమన్నారాయణుడే గాని వేరుగాదు ఇట్టి దనుజుల సంహరింప నరులకు సాధ్యమా! అనిఆశ్చర్యానందబుల రామునాశీర్వదించుచు రామా! యిక మేము నిశ్చింతగా నుండిమాధర్మంబులు నిర్వర్తించుకొందుము ఈదుష్టుల జంపి మాకుశాంతి భద్రతలు చేకూర్చితివి ఇదిమాభాగ్యము మాకుసెలవిమ్మని తమతమ నివాసముల కేగిరి రాముడు సీతాలక్ష్మణుల కడకు వచ్చివారికి మోదము గలిగించెను తిరిగిసీతాలక్ష్మణులతో పర్ణశాల కేతెంచి సుఖంబున నుండెను 81

## అకంపనుడు రావణునకు రామునివృత్తాంతము నెరిగించుట

తే గీ –ఖరుడు మరణించి నంతన కంపనుండు
చేరె లంకకు రావణు చెంత కేగి
రక్ష సేయుము మమ్ముచే రావణేంద్ర
దనుజ కులమున కంతమ్ము దాపురించె 82

తే గీ –అనుచు నేడ్చుచు వచ్చెడి యతని జూచి
వెనుక నున్నట్టి చెలియలి వింతరూపు
నక్క జంబుగ గనుగొని అసుర విభుడు
యెవరు గలిగించి నారు మీ కీ విపత్తు 83

తే గీ –అనుచు రావణుడడుగ నేఅసురనాథ
దండకాటవి నున్నట్టి దనుజ వరుల

నందరిని బట్టియమపురి కంపు చుండ్రి
వీరులిద్దరు ససమాన వీరు లగుచు 84

గద్యము – మన ఖరదూషణత్రిశిరులను సైన్యసమేతముగా హతమార్చి శూర్పణఖ కీయవన్థగలిగించిరని జెప్పిన శూర్పణఖయు గోలుగోలునేడ్చుచు తన్నువారు పదాభవించిన విషయము జెప్పిఅన్నా! నరులై యుండియు వారుబలగర్వితులై యున్నారు వారుసామాన్యులుగారు అనమాన వరాక్రమవంతులు ఖరదూషణత్రిశిరులనే జంపినవీరులు వారినిమాయోపాయమున జంపవలయును వారియొద్దనొక జవ్వనియున్నది ఆమెసౌందర్య మద్వితీయము నీవామెను దెచ్చి యేలుకొనుము ఆమెవియోగమున రాముడునుజచ్చును కావున నీబుద్ధిబలముతో వారినణచ వలయునుగాని భుజబలముపయోగింపరాదు అనిబోధించిన రావణుడెక్కింత యోచించి వారిని మోసముతోనే జంపుదునని వెంటనే తనమిత్రుడును ఉపాయశాలియునగు మారీచు నొద్దకేగెను మారీచుడును రావణున అర్ఘ్యపాద్యంబుల నిచ్చిఆదరించి వచ్చిన పనిదెలుపుమన రావణుడు – 85

## మారీచుడు మాయలేడియై పర్ణశాలకు వచ్చుట

తే గీ –దండకాటవి నందునుద్దండు డైన
నరుడు తమ్ముని తోడను నాతితోడ
విడిసి యచ్చటిమౌనుల వేడ్కదీర్ప
సాహసంబున దనుజుల జంపుచుండె 86

కం – నాసోదరి శూర్పణఖను
ఆసోదరు లిరువురెంత యవమానంబున్
జేసియు ముక్కును జెవులున్
గోసిన నాదరికి వచ్చి గోడున నేడ్చెన్ 87

తే గీ –అడుదని యైన జూడక యన్నదమ్ము
లిరువురును గూడి యామెకు నింతజేయ

యెట్టు లోర్తును మారీచ యెరుగవెక్కొ
పగను దీర్పంగబోయియా పడతి దెత్తు 88

కం - పోవలయును నీమాయతో
గ వలయును కనకహరిణి కడు వేగమునన్
గావలయు నీ సహాయము
దేవలయును సీతనిపుడు తేజముతోడన్ 89

గద్యము - అనిన మారీచుడు రాముని విషయము వినగనె భయముతో గుండియలదర రావణునికి నచ్చజెప్పుచు - 90

తే గీ -రాము బాణమ్ము నే దింటి రావణేంద్ర
మరువ జాలను నేను నా మనుజ వరుని
యతని తోడను బోరెడి యాశ విడువు
నరునిగా జూడబోకుమా నలిన నేత్రు 91

తే గీ -రాజ్యమందున సుఖముగ రావణేశ
సతులతోడను సుతులతో జనగదయ్యా
బంధు జనములు ముదమొంద ప్రజలనేలు
పగను బెంచుకు జెడిపోవ పాడిగాదు 92

గద్యము - అని మారీచుడు నయవినయంబులం జెప్పరావణుడు క్రోధము తోమారీచా! నేనా రామునిపై పగదీర్చుకొనకనిద్రబోవను నీవు నాచెప్పిన బొప్పున నడవవలయును ఇదినాఆజ్ఞయని శాసించి బలికిన మారీచుడు చేయునదిలేక వీనికిపోగాలము దాపురించినది అందులకే నాహితవచనములు జెవికెక్క లేదు అటకేగిన రామునిచేతిలో చావుతప్పదు కాదన్న నన్ను వీడిప్పుడే జంపును ఎట్లైనను జావుతప్పదు వీనిచేతిలో జచ్చిన నేమున్నది రామునిచే జచ్చిన మోక్షమైనను లభించును అనితనమదిలో నిశ్చయించి మాయలేడియై పంచవటీతీరమున సంచరించ దొడంగెను ఒకనాడు సీత పూవులుగోయుచు నాలేడిని జూచి సంభ్రమానందబులు ముప్పిరిగొన మోహపూర్వకముగా దానిని జూచు చుండెను 93

కం - బంగారు మేని తోడను
శృంగమ్ములు జూడ వెండి సిరులు దలిర్పన్

రంగులు జిమ్ముచు నంతట
చెంగున దూకుచును మిగుల చెలువము గూర్పన్ 94

తే గీ -పట్టుకొన బోవ నంతలో పరుగు లెత్తు
అందుకొనలేక దానిని యవని జాత
మరలి పోవంగ నంతలో మరలవచ్చు
ధరణిజను జేరియెంతో దరికి దరికి 95

ఆ వె -రాముదరికి బోయి రాజీవ లోచన
నయము ప్రియము తోడ నాతిబలికె
పసిడి లేడిగనుడు పరమాత్మ అల్లదే
పరుగు లెత్తుదాని బట్టి తెండు 96

గద్యము - అని ముచ్చటపడి గోముగాఅడుగుచున్న సీతను జూచి రాముడుధనుర్బాణములుబట్టి యిప్పుడే దానినిబట్టి తెచ్చి నీకిచ్చెదనని లేవలక్ష్మణుడన్నను వారించి - ఆలేడివింతగానున్నది అదినిజము గాలేడియగునే కాదే నాకనుమానముగానుండె యీప్రాంతమంతయు రాక్షసమయము ఇదియును మాయలేడిగానేపు భీకరాంగియు వికృతాంగియఉనగు శూర్పణఖనుకంవహరిగా నందరిగా మనవద్దకురాలేదా! అటులనే యిదియును అందమైనలేడిగా కనబడుచున్నది రాక్షస మాయగా వచ్చునన రాముడు - తమ్ముడా! నీమాట సత్యమే గావచ్చును కాని సీత తనసుఖసంతోషములన్నియు వదలి మనవెంట నీవనములకు వచ్చినది మొదలు ఇదిగావలయునని యింతవరకును యేమియు నడుగలేదు ఇవ్వుడీలేడిని జూచిముచ్చటపడుచున్నది ఆమెకోరికమన్నించవలయునుగదా! నిజమైనలేడి యైన పట్టితెచ్చెద కానిచో దానినిగొట్టి రాక్షస మాయనుభేదింతును నీవుపర్ణశాలవద్ద జాగరూకుడవై యుండుము నేనిదేపోవుచున్నానన లక్ష్మణుడే యు నన జాలక యూరకుండెను - రాముడులేడిని తరుముచు పట్టుకొనప్రయత్నించెను అదియు అందినట్లుగనే దగ్గరగుచు పట్టబోయిన పరుగెత్తుచు చెంగుచెంగున దూకుచు రాముని తనవెంట దవ్వుదవ్వుల గొని పోయెను రాముడును ఎనిగివేసారి ఇకదీనిని విడువరాదు చంపియైన దీసుకొనిపోదునని

విశ్వయించి వాడిబాణమొకటి గురిజూచివైచిన ఆదెబ్బకు తాళలేక మారీచుడు లేడిరూపమువిడచి దనుజరూపమునొంది రాముని స్వరముననుకరించి హాసీతా! హాలక్ష్మణా! చచ్చితి నని గట్టిగాఅరచి ప్రాణములు విడిచెను రాముడును తనగొంతువలనేయున్న కేకవిని సీతాలక్ష్మణులు భయపడుదురేమో అని అనుమానించుచు త్వరితగతిని పర్ణశాలాభి ముఖుడై వెడలెను. 97

## సీతాపహరణము

గద్యము పర్ణశాలయందున్న సీతయు రాముడింకను రాడయ్యె సంధ్యాసమయమగుచున్న దేయని యోచించుచుండ మారీచునికేక వినబడియెను అదివిని సీతభయముతో వింటివాలక్ష్మణా మీఅన్నగారు నిన్ను బిలుచుచున్నారు ఏదియో ఆపద గలిగియుండ నేపు నీవుత్వరగా వెళ్లుమన లక్ష్మణుడుతల్లీ! ఇదియంతయు రాక్షసమాయ ఆలేడియఘనెవడేరక్కసుడై యుండును అంతియే కానిఅరివీర భయంకరుడగురామున కాపదయా! నీవేమియుభయపడపలదు రామున కేఅపాయమును గలుగదు నీవు నిశ్చింతగానుండుమన సీతకపారమైన క్రోధము వచ్చెను అటు అన్నఆపదలోనుండ ఇతడింతనిశ్చింతగా నుండెనేయని అనుమానమును గలిగెను 98

తే గీ -అన్న ఆపల వెతనొంద మిన్నకున్న
నీదు మనమున నేముండె నేనెరుంగ
కైకతనయుడు రాజ్యమున్గై కొనంగ
నీవు నన్నేలదలచితో నీచ బుద్ధి 99

తే గీ -వెళ్లి రాముండు నినునమ్మి వెంటబెచ్చె
సవతి తమ్ముడ వగుటచే స్వార్థ మెంచి
అన్నయాపదలందగ నతని విడచి
నన్ను బట్టంగదలచి తే నయము మీర 100

గద్యము- అనిబలుకు సీతను గని లక్ష్మణుడు చెవులు మూసికొని

హరహరా! ఎంతమాట వినవలసివచ్చెనని దుఃఖముతో - 101

తే గీ -ఎంత మాటంటి వమ్మ నీకింత కీడు
తల ప దేలను గలిగెను తల్లి వినుము
జనకుడే రామచంద్రుడు జనని వీవు
తల్లి నన్నిట్లు బలుకంగ తగునె నీకు 102

తే గీ -మగువ నీకిది తగదమ్మ మరది నైన
తనయు నే నుమ్మి నీకిల తల్లి వినుము
కఠిన వాక్యమ్ములని నన్ను గష్టపెట్టు
నాదు దుర్భాగ్యమే గాని కాదు వేరు 103

గద్యము - నిన్నిప్రదేశమున నొంటిగా నుంచరాదని యుంటిని గాని మరియొకటిగాదు రామునకపాయమును గలుగదు అయినను ఆడుదానివి గనుక తొందరపాటున అనరాని మాటలంటివి నేనిదే పోవుచున్నాను నీవుమాత్రము ఆశ్రమమును వీడబోకుము అనిఅమ్మను దీని పర్ణశాలముందు గిరిగీసి యెట్టిపరిస్థితి యందును ఈగీత దాటవద్దు నాశక్తినంతను యీగీతయందుంచితిని దీని నతిక్రమించి యెవ్వరును నీదరికి రాజాలరు నీవునుదీనిని దాటవద్దు సుమా! అనిహెచ్చరించి ఖిన్నవదనుడై రాముడరిగిన వైపుగా బోయెను లక్ష్మణుడటు వెళ్లగనే రావణుడు తనమాయచే నొకయోగి పేలికాపాయాంబరధారియై దండకమండలములతో హరహరశంభోయని శంఖముపూరింపుచు భిక్షుకుడై పర్ణశాలముందు నిలచిన సీతయు రాముని రాకతడవైనదె లక్ష్మణుడు గూడయేగెను నేనుదురునుగావాట్లాడి అతనివంననునొప్పించితిని దుఃఖించుచుబోయెనుగదా! అని తానును దుఃఖించుచు ఏమియును దోచక చిన్నబోయియున్నంత లో వాకిటభిక్షువు గనపడియె సీతలోనికేగి అందున్న కొన్ని ఫలముల నాకునందిడుకొని దెచ్చివానికివ్వబోయెను రావణుడును - 104

తే గీ -ఎవరి చినదానవే నీవు? యింతి యిచట
నొంటి నున్నావు జంటనివెంట లేడ?

నిన్ను వనమున విడచిన నీచు డెవడు
చిన్న బోయితి పేలనో చేడె జెపుమ 105

తే గీ -అయ్య! వినరయ్య మాదయోధ్యా పురంబు
దశరథేశుని కొడల దనుజ హారి
రామునిల్లాల దండకారణ్య మందు
వచ్చియుంటిమి మేమొక వ్రతముబూని 106

తే గీ -పసిడి వన్నెల లేడిని బట్టదలచి
యేగె రాముడు నింతకు నేలరాడొ
మరది సౌమిత్రియును గూడ మరల నేగె
యెచట దిరుగుచు నుండిరో యెరుగరాదు 107

కం॥- అని దిగులొందెడి జానకి
గనుగొని రావణుడు బలికె కాంతరొ వినుమా
పనిబడి యుండగ నేపును
బనుపుమ నను భిక్షయొసగి పడతిరొ వేగన్ 108

గద్యము- సీతయు తనబాధను జెప్పుకొనుచు ధారమనస్కయై ఫలములనివ్వబోవ రావణుడు - సుందరీ నీవా గీతనుదాటిరమ్ము దాతకు నర్థికిని మధ్య నవరోధముండుట ధర్మవిరుద్ధము గావున ముందునకు రమ్మన సీతయు లక్ష్మణుడుగీచిన గీతదాటుటకు భయంబును ఎదుటసాక్షాత్ శంకరునివలె నున్నసాధువును 'రిక్తహస్తములబంపిన దోషమనియు ద్వైధీభావమున చిత్తముచంచలింప 'అతిధిదేవోభవ అనునార్యోక్తి ననుసరించి సాహసముతో గీతనుదాటి ముందునకు వచ్చిభిక్షబెట్టబోవ నామాయాభిక్షువు పకపకనగుచు ఓసిబేలా! అట్లు భయపడెదవేల? రమ్ము నేనులంకాపురాధి నాధుడను అరివీరభయంకరుడను దేవతలందరు నాకను సన్నల మసలెదరు అష్టదిక్పతులును నాకుబానిసలై నాచెప్పిన చొప్పున నడచెదరు నీవునాతోడరమ్ము నారాక్షసరాజ్యమునకు మహారాణి నొనర్చెదను నీవంటి సుందరికి సుకుమారికి రాముడుతగడు తాపసియైతనతో నిన్నును యీఅడవులపాలు జేసె నాకురాణివైన రంభాదిదేవకంతం

చే ని కూడిగము జేయింతును అనితననిజ రూపమును సీతకు జూపెను దశకంరుని భయంకరరూపమును జూచి సీతభయముతో గడగడ వడంకుచు నేలబడి మూర్ఛిల్లెను రావణుడు తన మాయాబలముతో వివశయైయున్న సీతను తన రథముననిడి ఆకాశమార్గమున బోయెను పంచవటికి దవ్వుల నొకచెట్టుపైనున్న జటాయువు రావణుని రథమును జూచి అదిపర్ణశాల మీదుగా వచ్చుట గమనించి అనుమానముతో మహావేగముతో రథమున కెదురు బోయి సీతనుగొనిపోవుచున్నరావణుని తనకాళ్లతో వానికిరీటమునుదన్నియు వానిమోమును రక్కియు వానినాప ప్రయత్నించెను రావణుడు తనచంద్రహాసముతో దాని రెక్కలు ఖండించెను జటాయువుగట్టిగా అరచుచువర్వతమువలె క్రిందబడియెను ఈ అలజడికి సీత తెలివొంది తన్నురావణుడుగొంపోవుచున్నాడని దెలిసి గోలుగొలున నేడ్చుచు తనజాడ రామలక్ష్మణుల కెఱ్ఱైన అందజేయవలయు నని మెడలోని హారమును చేతుల కంకణములును పాదముల అందెలునుదీసి పయ్యెదకొంగుచించి దానితోఆభూషణములు మూటగట్టి క్రిందికి విసరివైచెను రావణుడును లంక పురము జేరి అశోకవనమున సీతనుడించి రాక్షస కాంతలకొందర బిలచి సీతకు తగుసపర్యలు జేయుమని త నంతిపురమునకు బోయెను 109

## శ్రీరాముడు సీతను గానక దుఃఖించుట

గద్యము - శ్రీరాముడు పర్ణశాల కేగు చుండ దారిలో లక్ష్మణుడెదు రయ్యెను 110

తే గీ -చిన్న బోయిన మోముతో నన్న దరికి
వచ్చు చుండిన సౌమిత్రి వదన మరసి
యనుజు తోడను రాముండు అనియె నిట్లు
దరుణి నొంటిగ విడచిరా దగునె నీకు

తే గీ -అన్న యేమని జెప్పుదు నతివ నన్ను
వినగ రానట్టి మాటలు వేయినాడి
తరుమ వచ్చితి నిటకునే తల్లి వదలి
అనిన తమ్ముని తోరాము డనియె నిట్లు 112
కం- సీత నినుదిట్టె ననుచును
నాతి విడచి యిట్లు నీవు నావెను కనురా
నీతి యనుకుంటి వేమో
యీ తిరుగ నాదుమాట నెటు మీరితివే 113
ఆ వె -అడుదాని మాట కలిగి నీవిట్టుల
కాంత నెంటి విడచి కాన యందు
పడతి మీదనీవు పగబూన దగదయ్య
నేను వచ్చువరకు నిలువ వలదె 114
ఆ వె -నేను వచ్చువరకు నీవుండు మిచ్చోట
అనుచు నిన్ను మొదల నాజ్ఞ సేయ
మాట మీరినీవు మరియాద విడనాడి
అరుగు దెంచితి విటు అతివవిడచి 115
కం- అని బలుకుచు రాముడు తన
యనుజుని తో త్వరితగతిని యాశ్రమమునకుం
జనుదె౦ ౦ మాడగానట
గనరాక మిగుల జడియుచు వేగన్ 116
తే గీ -పర్ణశాలకు వచ్చియా పడతి లేక
యెందు బోయెను యేమయ్యె యేది సీత
రక్కసుల చేతజిక్కెనే రమణి యిపుడు
యేమి జేయుదు తమ్ముడా! యేది దారి 117
తే.గీ -పూలు కోయంగ బోయెనే వువ్వు బోడి
స్నాన మాడంగనేగె నో వరిపి కడకు
నందు నందున జూచిరమ్మనుజ వేగ
ననుచు రాముండు సీతకై యడలు చుండె 118

తే గీ -ఎందుదాగితివే నీవు యిందు వదన
సీత యెచ్చటికేగితే చెలియ రావె
యేల నామీద కోపమదేల నీకు
నిన్ను జూడక నామది నిలువలేదు 119
సీ - పువ్వులతోటల బొందుగా దిరుగుచు
త్రోవ దప్పితి వేమొ తోయ జాక్షి
నన్నాట బట్టించ నాతిరో దలచి తే
నన్ను పీడుటయిది న్యాయమగునె
క్రూరమృగమ్ములు కుడిచెనే చెలినిన్ను
రక్కసి మూకకు చిక్కినావె
తమ్ముడా నేనింక తాళజాలగ లేను
**ఎచ్చట వెదుకుదు నేమి సేతు** 120
ఆ వె -సీతలేదు మనకుచెల్లి పోయె ఋణంబు
అడవి పాలుజేసి తతిప నిపుడు
నన్ను బిలచిబిలచి నాతి యెంతేడ్చెనే
మాయలేడి వలనమగువ బోయె 121
తే గీ -తమ్ముడా సీతలేదిక తనువు బాసె
మనగ జాలను నేనిక మరల వయ్య
తల్లులను తమ్ములనుగూడి తరుణి తోడ
పొందుమా సౌఖ్యములు యిక పురికి బోయి 122
కం - భరతునకు జెప్పవయ్యా
మరిలేడిక రాముడనుచు మగువంగలియన్
అరిగెను నాకమునకు నిక
మరి రాడు పురంబుకనుచు మా మాటలుగా 123
తే గీ -జనని కౌసల్యయు సుమిత్ర జననికైక
కందరకు నానమస్కార మనుః జెప్పి
తల్లులందరనిక తనతల్లి వలెనె
భావమున నెంచుమని జెప్పు భరతుతోడ 124

గద్యము - సీతలేని జీవితము నాకువలదు నేను ప్రాణత్యాగ మొనర్తును నీవయోధ్యకు బొమ్ము అని రాముడు దుఃఖముతోబలుక లక్ష్మణుడుఅన్నా! నీవిట్లు బలుకదగునా! సీత యిందేయెందో యుండును వెదకెదము నీవిట్లు దుఃఖించ దగదని రామునకు ధైర్యము జెప్పుచు ఆప్రాంత మంతయు వెదుకదొడంగిరి కానిసీతజాడ దెలియలేదు రాముడుతన కింత దుఃఖమును సాధ్వియైన సీతకావదలును గలిగినను దేవతలుజూచుచు మిన్నకుండిరి గదా! ఈమునులను రక్షించి దేవతలకు ప్రియము చేకూర్చుటకై నాయీ దీక్షదెలిసియు దేవతలు నాకీదుఃఖమును గలిగించిరి లక్ష్మణా! ఇకనేనుసహించను వారలనందరను నాబాణాగ్ని కాహుతి జేసి నేనును ప్రాణములు విడుతునని రౌద్రా కారము నొందిన రామునితో శాంతవచనముల అన్నా! కార్యమును సాధించుట కార్యశూరుల లక్షణము అంతియేకాని పిరికివాని వలె ఆత్మత్యాగ మొనర్తువా! రమ్ముయింకను జూచెదమని రామునితో నడువ నటజటాయువు ప్రాణావశిష్టుడై యుండె వాని వద్దకేగి రాముడు వానినిలేవనెత్తిన జటాయువు కన్నులు దెరచి రామా! వచ్చితివా! సీతనురావణుడెత్తికొనిపోయెను వాని నడ్డగించిన నన్ను ఖడ్గముతో నరికి నాకీస్థితిగలిగించి సీతను తీసుకొని దక్షిణాభిముఖుడై యేగెననిచెప్పి నీవువచ్చువరకు నాప్రాణములుండునో లేదోఅని భయపడితిని నీకెరుగజేయుటకే నేనింతవరకు బ్రతికితిని గోలుగోలున నేడ్చు సీతనెత్తికొని ఆకాశగమనమున బోయెనని చెప్పుచూ నసువుల బాసెను

## జటాయువు సీతను రావణుడుగొని పోయెనని రామలక్ష్మణుల కెరిగించుట

రాముడు జటాయువుమరణమునకు చింతించితమ్మునిసహాయమున వానికగ్నిసంస్కారములు గావించి రావణునిపై చండకోపియై దక్షిణాభిముఖుడైబయలు దేరి క్రౌంచ వనమును బ్రవేశింప నటనొక

రాక్షసవనిత అయోముఖియనునది కామవికారము తోరాముని కౌగలింప లక్ష్మణుడు వెంటనే దాని ముక్కుజెవులంగోసి విరూపిణిని చేసిన నది భీకరరవంబున నార్చుచుబరుగులెత్తె మరికొంత దూరమునడువ కొండవలెనున్న యొకరాక్షసుడు తాటిచెట్లవంటి పెద్దపెద్ద చేతులతో వారిని బట్టెను వానికి శిరస్సులేదు వక్షంబున నొక పెద్దకన్ను మాత్ర ముండెను అది రాక్షసరూపని తెలియక యెద్దియో కొండగుహ యను కొని రామలక్ష్మణులా చేరువకుజని ఆరక్కసుని కబంధహస్తముల జిక్కరి వానిపట్టునుండి విడిపించుకొనుటకై ప్రయత్నించి విఫలులైరి అంతలక్ష్మణుడు అన్నా! వీనిబారినుండి విడిపించుకొనజాలము మనకు కష్టములే వచ్చుచున్నవి నన్నీరాక్షసునకాహారముగా నిచ్చినీవు సీతాన్వేషణ జేయుము సీతతప్పక లభించును నీవయోధ్యకేగుము నేనీరాక్షసుని వేడుకొందునన రాముడు చింతించి తమ్ముడా! నిన్ను వాని కర్పించనేనుబోదునా! వీనిజంపెదనని తనశక్తినంతను వినియోగించికరవాలముతో వానిబాహువులు ఖండించెను అంత వాడుబిట్టుగానార్చి మీరుదశరథనందనులగు రామలక్ష్మణులుగానోపు మీవలననాకుశాప విముక్తి గలిగినదన రాముడుఓయీ! నీవెవ్వడవు? నీకీవికృత రూపమేల కలిగెను అనకబంధుడు రామా! నేనొకయక్షుడను కంత వసంత జయంతాదులను మించిన సౌందర్యమున విఱ్ఱవీగుచు స్థూలశిరుడను నొక ముని వెంటబడి అతని శిరమునుహేళనజేయ నతడు కోపించి నీకుశిరమును బాహువులును వికృతమగుగాక గర్వంబున కన్నుగానని నీకన్నుస్థానభ్రంశమగుగాక అనిశపించిన నాకీవికృతరూపము గలిగెను నేనువికృతాకారముతో ఇంద్రునిచంపబోవనతడుతన వజ్రాయుధమున నాశిరమునుపొట్టమీదకు నణచివైచెను నేనుపశ్చాత్తాప్తుడనై నన్నుచంపి నారహాపుబాపుమని వేడుకొంటిని విధిచేత నాయువుబొందిననీవిపుడు చావరాదని రామలక్ష్మణులు నీబాహువులుఖండించునపుడు నీకబంధరూపముపోయి నిజరూపుబడసెదవని శాపోపశమనము తెలియజేసెను నేటికి

వాలిపైకి పురికొల్పిరి వాడును వాలిని కయ్యమునకు బిలచిన వాలితన అసమాన పరాక్రమముతో వానిని జంపి సప్తతాళముల యందు విసరివైచెను ఆసప్తతాళములు ఎండి మోడులైనను అజేయములు వృత్రాసురుడను నొకరాక్షసుని కుమారుడు మహాబలశాలియైన వాడాచెట్లను బెకలింప బోయెను గాని అవికదలక ఆకులను మాత్రము రాల్చినవి అప్పటి నుండియు నవి మోడులుగానున్నవి వాలిమహాశక్తిసంపన్నుడు వరుణదేవుని వలన తనయెదుట యుద్ధముజేయువారి బలములో నగము తనకు సంక్రమించునట్లును ఎంతటి వీరులైన తన్నుజయింపలేకుండు నట్లునువరములు పొంది గర్వించియున్నాడు నీవు వానిని సామాన్యునిగా భావించితి వనిన రాముడు మిత్రమా! నీసందేహమిపుడే దూరము జేతును చూడుమని తనకాలి బొటనవ్రేలితో నాదుందుభి కాయము నెగరగొట్టెను అదియు ఎగిరిసముద్ర తీరమున బడెను అదిచూచి సుగ్రీవుడిది వాలి తృళ్ళించినపుడు బలిసరక్తమాంసములతో నిండి యుండెడిది ఇప్పుడిది శుష్కించిన దన రాముడు అయిన జూడుము అని ఒక్కబాణమున ఆసప్తతాళములను బెకలించి విసరివైచెను అది చూచి సుగ్రీవుడు - మహాత్మా! నీపరాక్రమ మద్వితీయము నిన్నునీశక్తిని శంకించి నందుకు మన్నింపుము వాలిశక్తి దెలిసిన వాడను గాన యిన్ని మాటలనవలసి వచ్చెను క్షమింపుము నీవీప్రపంచమునకే అజేయుడవు అనిసంతసముతో బలికెను ఆమరునాడు సుగ్రీవుడు వాలిపై దండెత్తెను కిష్కింధ కేతెంచి వాలిద్వారదేశముననిలచి యెలుగెత్తికేకవేసి వాలిని బిలచెను 41

## వాలి సుగ్రీవుల యుద్ధము

తే గీ -అన్న నాసంపదంతయు నప్పగించు
యింతవరకును ననుదోచి యేలినావు
యిమ్ము వేగమె యిటువచ్చి యింతిదెచ్చి
సైప నికనేను నిన్నొక్క క్షణముగూడ 42

సీ - ఆకేక విని వాలి ఆశ్చర్యమును బొంది
యింతధైర్యము వీనికి నెట్లు వచ్చె
నన్ను జూచిన జాలు నలుమూలలకు బోవు
నేడు నాయెదుటనే నిలువనెంచె
ఆయువు నిండియే ఆలమ్మునకు వచ్చె
కరుణ తోనిక వీని గావరాదు
గర్వించి వచ్చెను గావున నిప్పుడే
వాని జంపక నేను వాలిగాను 43

తే గీ -అనుచు క్రోధము తోడను అనికి వచ్చె
చండ కిరణుడు వోలెను మండి పడుచు
గదిసె సుగ్రీవు పైవేసె గదను యెత్తి
నిలువ లేకను బరుగెత్తి నేలగరువ 44

తే గీ -చేరెరాముని రవిసూతి చింతజెంది
గోలు గోలుననేడ్చుచు గూలబడియె
నిన్ను నమ్ముకు బోతి నా యన్నకడకు
మున్నె యెరిగియు వానిచే దన్నబడితి 45

గద్యము - అని సుగ్రీవుడురాముని తో జెప్పి యేడ్వ రాముడును వానినేదార్చి మీయిద్దరి పోలిక యొకభంగి నుండ మీలో నిన్ను నిశ్చయింప లేక నే నూరకుంటిని నీవొక పుష్పమాలధరించి యుండు మననీతడట్లే జేసి తిరిగి పాలి మీదకు బోయెను వాలిసింహమువలె గర్జించుచు - ఓరీ! నీవు మరలవచ్చితివి తారకు ఇచ్చిన మాట మేరకునిన్నుజంపక విడిచితి లేనిచో నిన్ననే నీపీచ మడంచెడువాడను అనుచు సుగ్రీవునితో కలియబడెను యిరువురును కొంత తడవు ముష్టి యుద్ధము జేసిరి రాముడు చెట్టు చాటున నుండి వాలి బలపరాక్రమములను వీక్షించి యొక్కింత తడవాశ్చర్యమంది చూచి తే లక్ష్మణా! ఆవానరోత్తముని తేజమని ప్రశంసింపుచుండ సుగ్రీవుడలసి పోయి దిక్కులుజూడదొడంగె వాని యవస్థ జూచి రాముడు వాడి యైన బాణమొకటి గురిజూచి వేసెను ఆబాణము వాలి యురమున

సప్తసాగరము లనబడును ఇచ్చట తరుశాఖలయందార వైచినవస్త్రము లారవు మరియు నీకొండ శిఖరము నందెవరేనినెకరేయి నిద్రించిన వారలకు స్వప్నములోనందలి నిధులగుపడును మేల్కాంచన తదుపరి వారలకాధనముగోచరించును సుమ ! యనిదెలిపి రామ లక్ష్మణులను వీడ్కొలిపి తనయోగనిష్ఠతో వహ్నియందు ప్రవేశించె రామలక్ష్మణులును మతంగమహాముని ప్రభావమునకును శబరిభక్తికి నచ్చెరు వొందుచూ ముందునకు సాగిరి కొంతదూరము నడచిపంపాసరస్సు కడకేగి శ్రమదీరనా నీరములు ద్రావిఅటఫలములు భుజియించిరి అచటకొంత తడవుండ ఆపంప తీరము వారికి శాంతిని సుఖమును పొందించెను వారు తమ చింతలు మరిచి శ్రమలు దీర నట సుఖముగా విశ్రమించిరి 130

గద్యము - ఇది ఆత్రేయ గోత్రోద్భవులును ఆర్వేల నియోగి బ్రాహ్మణులును చాగంటి వంశీయులునగు జోగిరాజుగారి ధర్మపత్నియు శివభక్తి దురంధరురాలును శ్రీవామలింగేశ్వర చరిత్ర మను కావ్యకృతి కర్త్రియునగు గౌరీదేవి విరచితంబగు గౌరీరామాయణము నందలి అరణ్య కాండము సంపూర్ణము

# గౌరీరామాయణము

## కిష్కింధకాండ

కం - శ్రీరఘువీరుడు పంపా
తీరంబున జేరి శ్రమలు దీరగ నచటన్
భారం బగు దుఃఖంబును
ధీర మనస్కుండు నగుచు దిగులు నువీడెన్ 1

గద్యము - ఇట్లు కొంత తడవట విశ్రమించి తిరిగి సీతాన్వేషణకై యోచింప దొడంగెను 2

కం - శ్రీరాముండనుజునితో
నారావణు దరికిజేరి హతమార్చుటకై
దారేది మనకుప్రస్తుత
మే రీతిని సీతకొఱకు నేగగ వలెనో 3

ఆ వె - ఋశ్య మూకమందు ఋషివరు లున్నారు
సలప వలయు మనము చర్చలచట
వారల సెలవంది వనితను వెదకిన
శుభము గలిగి మనకు సుదతిదొరకు 4

గద్యము - అని రామలక్ష్మణులు సంభాషించుకొను సమయమున 5

కం - వానరములు జేరి యచట
వీనులుగడురిక్కరించి వింతౌ ధ్వనులన్
మానస మలరం జేయుచు
కాను పడెనురామచంద్రు కన్నులకంతన్ 6

కం - తోకలు ద్రిప్పుచు సన్నియు
మూకలుగా పరుగులెత్తి ముందుటనిలువన్
కేకలు వేయక నిలచిన
కాకుత్థ్సుడు జూచెనెంతొ కౌతుకమొప్పన్ 7

మునిని యితడేమి బాధించె ముష్కరమున
యట్టి బలశాలి కీశిక్ష యెట్లు వచ్చె 25

కం - దుందుభి యనియెడు వాడతి
మందుండై వాలిజెనకి మత్తిల్లి గడున్
ముందుకు దూకిన వాలియు
కందుక మట్టులను బట్టి గర్వమడంచెన్ 26

కం - వాలమును జుట్టి విసరగ
కాలము సమకూడి వాడు(గక్కె రుధిరమున్
నేలంత నెఱ్ఱనయ్యెను
కూలగముని ముందు నతడు కోపముతోడన్ 27

తే గి - ఎవ్వడీ కాయమిచ్చట నెగురవైచె
వానితల వ్రక్కలగు నిట వచ్చెనేని
అనుచు మునిశాపమిచ్చిన యడలియిటకు
వాలి రాలేక దూరాన వరలు చుండు 28

గద్యము - ఆ దుందుభి కాయమదిగో నటపర్వతము వలెబడియున్నది ఆసప్తతాళవృక్షములలో చిక్కు బడిఅప్పటి నుండియు నదిఅట్లే యున్నది వాలి నాభార్యను సంపదను హరించి నన్నుజంపబోవ నేనుప్రాణరక్షణార్థ మీ పర్వతమున వసించుచుంటిని శాపభయమున వాలియిందు రాజాలడని తెలియ జేసిన రాముడుఅవాలిని సంహరించి నీకునీభార్యను రాజ్యమును ఇప్పించెద వెరువకు మన సుగ్రీవుడు పరమానందభరితుడై రామునకుమ్రొక్కి రామచంద్రా! నేటినుండి నేనునీమిత్రుడ మిత్రులకుహితముజేయుట నీవంటిమహాత్ములకు సహజమనగా రాముడు సుగ్రీవునిగౌగలించుకొని నేటినుండి నీవుమిత్రుడవే త్రికరణశుద్ధిగా జెప్పుచున్నాననిన హనుమంతుడు వారలసఖ్యంబును పటిష్ఠముజేయదలచి అగ్నిని దెచ్చిసూర్యచంద్రాగ్ని సాక్షిగా వారల స్నేహమునకై ప్రమాణపూర్వకముగా పలికించెను వారును పంచభూతముల సాక్షిగాప్రమాణస్వీకారముజేసిరి ఆసంతోషమున కపులందరు జేజేలుబలికి తమఆనందమును

వ్యక్తపరిచిరి అప్పుడు సుగ్రీవుడు ఫలములుగొనిదెచ్చి
వారినిసంతృప్తులను జేసెను 29

## రామ సుగ్రీవుల మైత్రి

కం- సాధువులు మిత్రులైనను
సాధింపగ వచ్చుసర్వ సంపదలెల్లన్
సాధింప ఒడును జగమే
సాధుల సాంగత్యమెంతొ సౌఖ్యము గూర్చున్ 30

కం- ధనములు బోయిన బోవును
తన బంధుజనంబులెల్ల దరలినగానీ
ఘన సుఖములెల్ల బోయిన
తనమిత్రుని కార్యమెపుడు దనరగ జేయున్ 31

కం- హితమును గూర్చెడి వాడే
హితుడన దగినట్టి వాడు యీధరలోనన్
హితునికి మించిన మహిమా
న్వితుడిక గానంగ రాడు వెదకిన భువిపై 32

కం- రాముని బోలిన మిత్రుని
భూమిని బొందంగ పూర్వ పుణ్యమ దెంతో
భూమిజ పతిసఖుడట నా
కీమహిలో నాదుభాగ్య మెన్నగ దరమే 33

గద్యము - అని సంతోషాతిశయమున కన్నులనానందబాష్పాలు జాలువార
సుగ్రీవుడు రామునిగౌగలించుకొనెను రాముడును వానినిమన్నించి
ఆదరించెను ఉభయులును కొంతతడవు తమదుఃఖమును
మరచిసంభాషించిరి తదుపరిరాముడు మిత్రమా! 34

కం- నీకును నీసోదరు నకు
నే కారణమందు గలిగె నీ వైరుధ్యం
బాకథ దెలియంజెపుమా
ఒకపివర నాకునంత యున్నవిధంబున్ 35

రావణుడను రాక్షసరాజా సీతను గొనిపోయెనట అందందు వెదుకుచు
గీస . యముగోరి వచ్చిగని జెప్ప సుగ్రీవుడు భయముదక్కి వారలకు
దండప్రణామంబు లాచరించిఅయ్యా! నేను నాయన్నయగు వాలికి
జడిసి ఈపర్వతమ్మధిరోహించి యున్నవాడను ఇటునుండి కదలిన
నాకు మృత్యువేగతి ఇట్టి పరిస్థితులలో నేనుమీకెట్లు సహాకరింపగల
వాడను అని నయవినయంబుల బలికిన సుగ్రీవుని గాంచి రాముడు–
నీవును నేనును ఇప్పుడు పత్ని వియోగము న సమ శోకులమే
నాసీతను రావణుడు గొంపోయెను వాడెందుండు వాడునీకుదెలిసి
యుండునని నీవద్దకు వచ్చితిమి అనిరాముడు బలుక సుగ్రీవుడు
రామచంద్రా! రావణుడొక రాక్షసరాజని వింటిని గానివానియుని
నేనెరుగను ఒకనాడుమేము పర్వతశిఖరమున నుండగా నాకసము
నుండిరక్షింపుడు రక్షింపుడని స్త్రీయార్తనాదమొండు వినబడియెను
తలయెత్తిజూడ నొకయానము దక్షిణదిశగాబోయెను అందుండి
యొకగుడ్డమూట క్రిందబడియె అందుకొన్ని ఆభూషణములున్నవి
బహుశః ఆస్త్రీతమ దేవేరిగానోపు ఆభూషణముల మూట
నావద్దనున్నదని దెచ్చి జూపెను రాముడు ఆభూషణములు తనసీతవని
దెలిసిదుఃఖముతోసీతా! సీతా! అనివాటిని హృదయమున కత్తుకొని
తమ్ముడా! చూచితివా సీత తనజాడ మనకుదెలుపుటకే
ఈనగలుక్రిందబడవైచె జూడుమన లక్ష్మణుడవి జూచి 16

## సీత ఆభరణముల జూచి రాముడు దుఃఖించుట

అందియ లవియే జూచితి
వందనములు జేయునపుడు వదినయు నన్నున్
పొందుగ లేపిన చేతుల
కందముగానున్న యట్టి యాకంకణముల్ 17
నగలం గట్టిన చేలం
బగు జానకి చీరచెరగు అనిబలుకంగా

పగవారి పాలబడెనా
మగువ యనుచు రాముడెంతొ మదిలోగుందెన్ 18

గద్యము - రాముని దుఃఖమును జూచి సుగ్రీవాదులును చింతించి రామచంద్రా! ఊరడిల్లుము మాకపులసహాయముతో సీతాదేవిని వెదకెదము వాలిభయములేనిచో నేనిపుడేసీతను వెదకెడివాడనన రాముడు తనదుఃఖముపశమించుకొని సుగ్రీవునితో 19

తే గీ - ఏల నీయన్నవలన నీకింత భయము
యేమి జేసెనునిన్నతం డెరుగ జెపుము
వాలి యిటురాక పోవగా వ్రతమదేమి
వానరోత్తములగు మీకు వైరమేల 20

కం - అనవిని కపివరుడంతట
జననాయక యేమిసెప్ప జంపుదునని నా
వెనువెంట దరుమ నిటకున్
జనుదెంచి వసించుచుంటి సచివులతోడన్ 21

కం - నాసతి చేపట్టియు నను
గాసింపగ జేసి వాలి కడు క్రూరముగా
వేసట బెట్టుచు తానే
భోగమ్ములనుభవించుచు నుండె నెంతొ భాగ్యము తోడన్ 22

కం - అరివిర భయంకరుడై
వదలని గర్వితుడు వాలి వానరుల నిగ్రహించెన్
సరివారు లేరు తనకెవరిని
కరమురముగ నేలుచుండె కపికులమంతిన్ 23

కం - మాతంగుని శాపంబున
నీతరువుల కడకునమ్మతించడు రాగా
నాతని భయముండద టం
బీ తలమున జేరియుంటి నిటు దుఃఖమునన్ 24

తే గీ - అనిన రాముడనె మతంగ మౌని యేల
శాప మిచ్చెను వాలికి సరిగజెపుము

రావణుడను రాక్షసరాజు సీతను గొనిపోయెనట అందందు వెదుకుచు
సీసం యముగోరి వచ్చిరని జెప్ప సుగ్రీవుడు భయముదక్కి వారలకు
దండప్రణామంబు లాచరించిఅయ్యా! నేను నాయన్నయగు వాలికి
జడిసి ఈపర్వతమునధిరోహించి యున్నవాడను ఇటనుండి కదలిన
నాకు మృత్యువేగతి ఇట్టి పరిస్థితులలో నేనుమీకెట్లు సహాకరింపగల
వాడను అని నయవినయంబుల బలికిన సుగ్రీవుని గాంచి రాముడు-
నీవును నేనును ఇప్పుడు పత్నీ వియోగము న సమశోకులమే
నాసీతను రావణుడు గొంపోయెను వాడెందుండు వాడునీకుదెలిసి
యుండునని నీవద్దకు వచ్చితిమి అనిరాముడు బలుక సుగ్రీవుడు
రామచంద్రా! రావణుడొక రాక్షసరాజని వింటిని గానివానియుని
నేనెరుగను ఒకనాడుమేము పర్వతశిఖరమున నుండగా నాకసము
నుండిరక్షింపుడు రక్షింపుడని స్త్రీయార్తనాదమొండు వినబడియెను
తలయెత్తిజూడ నౌకయానము దక్షిణదిశగాబోయెను అందుండి
యొకగుడ్డమూట క్రిందబడియె అందుకొన్ని ఆభూషణములున్నవి
బహుశః ఆస్త్రీతమ దేవేరిగానేపు ఆభూషణముల మూట
నావద్దనున్నదని దెచ్చి జూపెను రాముడు ఆభూషణములు తనసీతవని
దెలిసిదుఃఖముతోసీతా! సీతా! అనివాటిని హృదయమున కత్తుకొని
తమ్ముడా! చూచితివా సీత తనజాడ మనకుదెలుపుటకే
ఈనగలుక్రిందబడవైచె జూడుమన లక్ష్మణుడవి జూచి 16

## సీత ఆభరణముల జూచి రాముడు దుఃఖించుట

ం – అందియ ల వియే జూచితి
వందనములు జేయునపుడు వదినయు నన్నున్
పొందుగ లేపిన చేతుల
కందముగానున్న యట్టి యాకంకణముల్ 17

ం – నగలం గట్టిన చేలం
బగు జానకి చీరచెరగు అనిబలుకంగా

పగవారి పాలబడెనా
మగువ యనుచు రాముడెంతొ మదిలోగుందెన్ 18

గద్యము - రాముని దుఃఖమును జూచి సుగ్రీవాదులును చింతించి రామచంద్రా! ఊరడిల్లుము మాకపులసహాయముతో సీతాదేవిని వెదకెదము వాలిభయములేనిచో నేనిపుడేసీతను వెదకెడివాడనన రాముడు తనదుఃఖముపశమించుకొని సుగ్రీవునితో 19

తే గీ -ఏల నీయన్నవలన నీకింత భయము
యేమి జేసెనునిన్నతం డెరుగ జెపుమ
వాలి యిటురాక పోవగా వ్రతమదేమి
వానరోత్తములగు మీకు వైరమేల 20

కం - అనవిని కపివరుడంతట
జననాయక యేమిసెప్ప జంపుదునని నా
వెనువెంట దరుమ నిటకున్
జనుదెంచి వసించుచుంటి సచివులతోడన్ 21

కం - నాసతి చేపట్టియు నను
గాసింపగ జేసి వాలి కడు క్రూరముగా
వేసట బెట్టుచు తానే
భాసిల్లుచు నుండె నెంతొ భాగ్యము తోడన్ 22

కం - అరివిర భ[illegible]ంకరుడై
వధబల గర్వితుడు వాలి వాని [illegible]గ్రించెన్
సరివారు లేరు తనకని
కరమురముగ నేలుచుండె కపికులమంతన్ 23

కం - మాతంగుని శాపంబున
నీతరువుల కడకుసమ్మతించడు రాగా
నాతని భయముండద టం
బీ తలమున జేరియుంటి నిటు దుఃఖమునన్ 24

తే గీ -అనిన రాముడనె మతంగ మౌని యేల
శాప మిచ్చెను వాలికి సరిగజెపుమ

రావణుడను రాక్షసరాజు సీతను గొనిపోయెనట అందందు వెదుకుచు
నీస యముగోరి వచ్చితిని జెప్ప సుగ్రీవుడు భయముదక్కి వారలకు
దండప్రణామంబు లాచరించిఅయ్యా! నేను రాయన్నయగు వాలికి
జడిసి ఈపర్వతాగ్రమధిరోహించి యున్నవాడను ఇటనుండి కదలిన
నాకు మృత్యువేగతి ఇట్టి పరిస్థితులలో నేనుమీకెట్లు సహాకరింపగల
వాడను అని నయవినయంబుల బలికిన సుగ్రీవుని గాంచి రాముడు-
నీవును నేనును ఇప్పుడు పత్ని వియోగము న సమశోకులమే
నాసీతను రావణుడు గొంపోయెను వాడెందుండు వాడునీకుదెలిసి
యుండునని నీవద్దకు వచ్చితిమి అనిరాముడు బలుక సుగ్రీవుడు
రామచంద్రా! రావణుడొక రాక్షసరాజని వింటిని గానివానియుని
నేనెరుగను ఒకనాడుమేము పర్వతశిఖరమున నుండగా నాకసము
నుండిరక్షింపుడు రక్షింపుడని స్త్రీయార్తనాదమొండు వినబడియెను
తలయెత్తిజూడ నొకయానము దక్షిణదిశగాబోయెను అందుండి
యొకగుడ్డమూట క్రిందబడియె అందుకొన్ని ఆభూషణములున్నవి
బహుశః ఆస్త్రీతమ దేవేరిగానోపు ఆభూషణముల మూట
నావద్దనున్నదని దెచ్చి జూపెను రాముడు ఆభూషణములు తనసీతవని
దెలిసిదుఃఖముతోసీతా! సీతా! అనివాటిని హృదయమున కత్తుకొని
తమ్ముడా! చూచితివా సీత తనజాడ మనకుదెలుపుటకే
ఈనగలుక్రిందబడవైచె జూడుమన లక్ష్మణుడవి జూచి 16

## సీత ఆభరణముల జూచి రాముడు దుఃఖించుట

ం- అందియ లవియే జూచితి
వందనములు జేయునపుడు వదినయు నన్నున్
పొందుగ లేపిన చేతుల
కందముగానున్న యట్టి యాకంకణముల్ 17

ం- నగలం గట్టిన చేలం
బగు జానకి చీరచెరగు అనిబలుకంగా

పగవారి పాలబడెనా
మగువ యనుచు రాముడెంతొ మదిలోగుందెన్ 18
గద్యము - రాముని దుఃఖమును జూచి సుగ్రీవాదులును చింతించి
రామచంద్రా! ఊరడిల్లుము మాకపులసహాయముతో సీతాదేవిని
వెదకెదము వాలిభయములేనిచో నేనిపుడేసీతను వెదకెడివాడనన
రాముడు తనదుఃఖముపశమించుకొని సుగ్రీవునితో 19
తే గీ -ఏల నీయన్నవలన నీకింత భయము
యేమి జేసెనునిన్నతం డెరుగ జెపుమ
వాలి యిటురాక పోవగా వ్రతమదేమి
వానరోత్తములగు మీకు వైరమేల 20
కం - అనవిని కపివరుడంతట
జననాయక యేమిసెప్ప జంపుదునని నా
వెనువెంట దరుమ నిటకున్
జనుదెంచి వసించుచుంటి సచివులతోడన్ 21
కం - నాసతి చేపట్టియు నను
గాసింపగ జేసి వాలి కడు క్రూరముగా
వేసట బెట్టుచు తానే
భూనల్లుచు నుండె నెంతొ భాగ్యము తోడన్ 22
కం - అరివిర భయంకరుడై
భుజబల గర్వితుడు వాలి వాని గ్రహించెన్
సరివారు లేరు తనకని
కరమురముగ నేలుచుండె కపికులమంతన్ 23
కం - మాతంగుని శాపంబున
నీతరువుల కడకుసన్మతించడు రాగా
నాతని భయముండద టం
బి తలమున జేరియుంటి నిటు దుఃఖమునన్ 24
తే గీ -అనిన రాముడనె మతంగ మౌని యేల
శాప మిచ్చెను వాలికి సరిగజెపుమ

మునిని యితడేమి బాధించె ముష్కరమున
యట్టి బలశాలి కీశిక్ష యెట్టు వచ్చె 25

కం - దుందుభి యనియెడు వాడతి
ముందుండై వాలిజెనకి మత్తిల్లి గడున్
ముందుకు దూకిన వాలియు
కడదుక మట్టలను బట్టి గర్వమడంచెన్ 26

కం - వాలమును జుట్టి విసరగ
కాలము సమకూడి వాడు[గక్కె రుధిరమున్
నేలంత నెత్తురయ్యెను
కూలగముని ముందు నతడు కోపముతోడన్ 27

తే గీ -ఎవ్వడీ కాయమిచ్చట నెగురవైచె
వానితల [వక్కలగు నిట వచ్చెనేని
అనుచు మునిశాపమిచ్చిన యడలియిటకు
వాలి రాలేక దూరాన వరలు చుండు 28

గద్యము - ఆ దుందుభి కాయమదిగో నటపర్వతము వలెబడియున్నది ఆసప్తతాళవృక్షములలో చిక్కు బడిఅవ్వటి నుండియు నదిఅట్లే యున్నది వాలి నాభార్యను సంపదను హరించి నన్నుజంపబోవ నేను[ప్రాణరక్షణార్థ మీ పర్వతమున వసించుచుంటిని శాపభయమున వాలియిందు రాజాలడని తెలియ జేసిన రాముడుఆవాలిని సంహారించి నీకునీభార్యను రాజ్యమును ఇప్పించెద వెరువకు మన సు[గీవుడు పరమానందభరితుడై రామునకు[మొక్కి రామచం[దా! నేటినుండి నేనునీమి[తుడ మి[తులకుహితముజేయుట నీవంటిమహాత్ములకు సహజమనగా రాముడు సు[గీవునిగౌగలించుకొని నేటినుండి నీవుమి[డుడవే [తికరణశుద్ధిగా జెప్పుచున్నాననిన హనుమంతుడు వారలనఖ్యంబును పటిష్ఠముజేయదలచి అగ్నిని దెచ్చిసూర్యచం[దాగ్ని సాక్షిగా వారల స్నేహమునకై [పమాణపూర్వకముగా పలికించెను వారును పంచభూతముల సాక్షిగా[వమాణస్వీకారముజేసిరి అసంతోషమున కపులందరు జేజేలుబలికి తమఆనందమును

వ్యక్తపరిచిరి అప్పుడు సుగ్రీవుడు ఫలములుగొనిదెచ్చి
వారినిసంతృప్తులను జేసెను 29

## రామ సుగ్రీవుల మైత్రి

కం - సాధువులు మిత్రులైనను
సాధింపగ వచ్చుసర్వ సంపదలెల్లన్
సాధింప బడును జగమే
సాధుల సాంగత్యమెంతొ సౌఖ్యము గూర్చున్ 30

కం - ధనములు బోయిన బోవును
తన బంధుజనంబులెల్ల దరలినగానీ
ఘన సుఖములెల్ల బోయిన
తనమిత్రుని కార్యమెపుడు దనరగ జేయున్ 31

కం - హితమును గూర్చెడి వాడే
హితుడన దగినట్టి వాడు యీధరలోనన్
హితునికి మించిన మహిమా
న్వితుడిక గానంగ రాడు వెదకిన భువిపై 32

కం - రాముని బోలిన మిత్రుని
భూమిని బొందంగ పూర్వ పుణ్యము దెంతో
భూమిజ పతిసఖుడట నా
కీమహిలో నాదుభాగ్య మెన్నగ దరమే 33

గద్యము - అని సంతోషాతిశయమున కన్నులనానందబాష్పాలు జాలువార
సుగ్రీవుడు రామునిగౌగలించుకొనెను రాముడును వానినిమన్నించి
ఆదరించెను ఉభయులును కొంతతడవు తమదుఃఖమును
మరచిసంభాషించిరి తదుపరిరాముడు మిత్రమా! 34

కం - నీకును నీసోదరు నకు
నే కారణమందు గలిగె నీ వైరుధ్యం
బాకధ దెలియంజెపుమా
ఒకపివర నాకునంత యున్నవిధంబున్ 35

గద్యము - సుగ్రీవుడు తనకును వాలికిని గల వైరకారణము జెప్పం
దొడంగె 36

## వాలి చరిత్ర

కం - వినుమా మేమిరువురమును
అనయము కడుప్రేమతోడ యనుజన్ములమై
జననీ జనకుల యెడలను
వినయంబున నుంటిమెపుడు విఖ్యాతులమై 37

తే గీ -వాలిపెద్ద వాడుగనుక వానికిచ్చె
రాజ్యమంతయు మాతండ్రి రాజుజేసి
నన్ను యువరాజుగా నిల్పి యన్నకడను
ఉండు మనిజెప్పి యేగె ను ద్దండు డగుచు 38

గద్యము - అప్పటినుండియు నేను నాయన్నయగు వాలినిగొలుచుచు భయభక్తులతో నుండెడివాడను అంతనొకనాడు మాయావి యనురాక్షసుడు నాయన్నయగు వాలిపై యీసుబూని తానువలచిన స్త్రీని వాలిచేపట్టెనని కోపంబున అర్ధరాత్రి యందొకనాడు వచ్చిమల్లచరిచి యుద్ధమునకు బిలచెను వాలియు అంతిపురమువీడి బయలుదేరెను అన్నఒంటరిగానేగు చుండెననినేను గూడబయలుదేరితిని ఆరక్కసుని దరుముచుండ వాడొక కొండగుహయందు ప్రవేశించె వాలి నన్నాగుహాముఖమ్మున నిలిపి తానాగుహలో రక్కసునితోయుద్ధము జేయనేగెన నేనతి జాగరూకుడనై ఆగుహాముఖంబున నిరీక్షించుచుంటిని ఒకసంవత్సరకలము గడచెను లోపలినుండి పెద్దభీకరమగు ధ్వనులతో రక్తముమాంసఖండములతో ప్రవాహముగా బయలుబడె నేనదిజూచి భయభ్రాంతుడనై లోనికేగ సాహసము లేక వాలిమరణించెనని భావించి యొకబండరాయిని గుహాముఖమునునుంచి ఆరాక్షసుడు తిరిగిరాకుండగ జేసి చింతాక్రాంతుడనైకిష్కింధకేతెంచి అన్నవంరణవునకు విలపించుచు వానిఆత్మశాంతికి

తిలతర్పణములనొసంగి కర్మకాండలుజేసితిని అంతట మామంత్రులు నన్నుకిష్కింధకు రాజునుజేసిరి నేనునునాఅన్నవలె ప్రజారంజకముగా రాజ్యముజేయుచు నుంటిని అంతనొక్కనాడు వాలి వచ్చి నేనురాజుగా నుండుటెరింగి మండిపడి ఓరీ! తులువా! 39

తే గీ -అన్న జంపించి నీవిట్లు లన్నరాజ్య
మపహరించితి విదియేమి యాగడమ్ము
నేను రాకుండ నారాక నిలిపి నీవు
వచ్చి యేలుచు నుంటివా! వదరుబోత 40

గద్యము - అని వాలి నన్ను జంపబోవ నేను అనేకవిధముల ప్రార్థించి నీకొఱకువత్సరమంతయు వేచియుంటిని పెద్దపెద్దధ్వనుల తో మాంసఖండములతో రక్తముగుహనుండి ప్రవహింప నీవుమడిసితివని దుఃఖించితిని ఆరాక్షసుడువచ్చునేమో యనిగుహకుఖంబున రాతిబండ నుంచితి అంతియేగాని వేరుగాదు నీకొఱకెంతదుఃఖించితినో పేరినడుగుము నీయెడల నాకగలభక్తివిశ్వాసములు నీవెరుగవా? భగవదనుగ్రహమువలన నీవుసురక్షితముగా వచ్చితివంతియే చాలును నీవే ఈ రాజ్యమునకధిపతివి నేనునిన్నెప్పటివలెసేవింతును నామాటనమ్ముమని పాదములబడి యెంత వేడినను వాలికోపమును మానక నన్నును నాపరివారమును వెడలగొట్టెను నామీదపగ విడువక జంపజూచు చుండును అని తన విషయమంతయు రామునకు నివేదించెను శ్రీరాముడును సుగ్రీవునేదార్చి వాలిని జంపి ఈకిష్కింధకు నిన్ను రాజును జేతునని ధైర్యము జెప్పిన సుగ్రీవుడు - మిత్రమా! వాలిబలము దెలియక నీవిట్లుబలుకుచున్నావు నిత్యమువాలి ప్రాతఃకాలమునందే తూర్పునమ్ముద్రమునుండి పశ్చిమసముద్రమువరకును ఉత్తరమున హిమాలయములనుండి దక్షిణసముద్రము వరకును దిరిగి సూర్యోదయ మగుసరికి తననెలవునకు జేరును అతనిబయన వేగమున క్రిందనున్న తరులతాగుల్మాదులు ప్రకంపించును రాక్షసులనెందరనో ఉక్కడంచెను దుందుభియనువాడు మహాబలశాలి మదించియుద్ధకాంక్షియై సాగరుని హిమవంతుని యుద్ధమున కాహ్వానించిన వారునుమేము నీకుసరియగు వారము కాము నీవు వాలితో బోరుము అతడేనీకుదగినవాడు అని

వాలిపైకి పురికొల్పిరి వాడును వాలిని కయ్యమునకు బిలచిన వాలితన అసమాన పరాక్రమముతో వానిని జంపి సప్తతాళముల యందు విసరివైచెను ఆసప్తతాళములు ఎండి మోడులైనను అజేయములు వృత్తాసురుడను నొకరాక్షసుని కుమారుడు మహాబలశాలియైన వాడాచెట్లను బెకలించ బోయెను గాని అవికదలక ఆకులను మాత్రము రాల్చినవి అప్పటి నుండియు నవి మోడులుగానున్నవి వాలిమహాశక్తిసంపన్నుడు వరుణదేవుని వలన తనయెదుట యుద్ధముజేయువారి బలములో నగము తనకు సంక్రమించునట్లును ఎంతటి వీరులైన తన్నుజయింపలేకుండు నట్లునువరములు పొంది గర్వించియున్నాడు నీవు వానిని సామాన్యునిగా భావించితి వనిన రాముడు మిత్రమా! నీసందేహమిపుడే దూరము జేతును చూడుమని తనకాలి బొటనవ్రేలితో నాదుందుభి కాయము నెగరగొట్టెను అదియు ఎగిరిసముద్ర తీరమున బడెను అదిచూచి సుగ్రీవుడిది వాలి త్రుళ్ళించినపుడు బలిసిరక్తమాంసములతో నిండి యుండెడిది ఇప్పుడిది శుష్కించిన దన రాముడు అయిన జూడుము అని ఒక్కబాణమున ఆసప్తతాళములను బెకలించి విసరివైచెను అది చూచి సుగ్రీవుడు - మహాత్మా! నీపరాక్రమ మద్వితీయము నిన్నునీశక్తిని శంకించి నందుకు మన్నించుము వాలిశక్తి దెలిసిన వాడను గాన యిన్నిమాటలన వలసి వచ్చెను క్షమింపుము నీవీప్రపంచమునకే అజేయుడవు అనిసంతసముతో బలికెను ఆమరునాడు సుగ్రీవుడు వాలిపై దండెత్తెను కిష్కింధ కేతెంచి వాలిద్వారదేశముననిలచి యెలుగెత్తికేకవేసి వాలిని బిలచెను 41

## వాలి సుగ్రీవుల యుద్ధము

తే గీ అన్న నానంపదంతయు నప్పగించు
యింతవరకును ననుదేచి యేలినావు
యిమ్ము వేగమె యిటువచ్చి యింతిదెచ్చి
సైన్య నేకనేను నిన్నొక్క క్షణముగూడ 42

సీ - ఆకేక ఎని వాలి ఆశ్చర్యమును బొంది
యింత్రధైర్యము వీనికి నెట్లు వచ్చె
నన్ను జూచిన జాలు నలువవూలలకు బ్వు
నేడు నాయెదుటనే నిలువనెంచె
ఆయువు నిండియే ఆలగ్ను నకు వచ్చె
కరుణ తనిఒ 'ని గాంరాదు
గర్వించి ఎచ్చెను గావున ఎంప్డే
వాని జం ంక నేను వాటగాను 43

తే గీ -అనుచు క్రోధము తడను ంనికి వచ్చె
చండ కిరణుడు వోలెను మండి పడుచు
గదిసె సుగ్రీవు పైవేసె గదను యెత్తి
నిలువ లేకను బరుగెత్తి నేలగరుచ 44

తే గీ -చేరెరాముని రవిసూతి చింతజెంది
గోలు గోలుననేడ్చుచు గూలబడియె
నిన్ను నమ్ముకు బోతి నా యన్నకడకు
మున్నె యెరిగియు వానిచే దన్నబడితి 45

గద్యము - అని సుగ్రీవుడురామునితో జెప్పి యేడ్వ రాముడును వానినేదార్చి మీయిద్దరి పోలిక యొకఖంగి నుండ మీలో నిన్ను నిశ్చయింప లేక నే నూరకుంటిని నీవొక పుష్పమాలధరించి యుండు మననీతడట్లే జేఎ తిరిగి వాలి మీదకు బోయెను వాలిసింహామువలె గర్జించుచు - ఓరీ! నీవు మరలవచ్చితివి తారకు ఇచ్చిన మాట మేరకునిన్నుజంపక విడిచితి లేనిచో నిన్ననే నీపీచ మడంచెడువాడను అనుచు సుగ్రీవునితో కలియబడెను యిరువురును కొంత తడవు ముష్టి యుద్ధము జేసిరి రాముడు చెట్టు చాటున నుండి వాలి బలపరాక్రమములను వీక్షించి యొక్కింత తడవాశ్చర్యమంది చూచి తే లక్ష్మణా! ఆవానరోత్తముని తేజమని ప్రశంసింపుచుండ సుగ్రీవుడలసి పోయి దిక్కులుజూడదొడంగె వాని యవస్థ జూచి రాముడు వాడి యైన బాణమొకటి గురిజూచి వేసెను ఆబాణము వాలి యురమున

గ్రుచ్చు కొనియె నంతవాలి బిట్టుగానార్చి బాణమువచ్చిన దెస
బరికించి ఎవడవురా నీచా! మూర్ఖాగమై యున్న నన్ను చెట్టుచాటునుండి
గూల్చితివా ధర్మహీనుడా! నేనునీకే నపకారముజేసితిని? నేను
నిన్నెన్నడును జూడనైనలేదు చెట్టుబుట్టలందిరుగుచు
ఆకులలములందిను తరుచరులము అకారణముగా నన్ను గూల్చితివి
నాయెదుట నిలచి యుద్ధముజేసిన నీ మగతనము గానిచెట్టు చాటు
నుండి గొట్టుట ధర్మేతరముగాదా? సుగ్రీవుని మాటలువినినన్ను
గూల్తువా? ఇదినీకుదగునా? అని యడుగ రాముడు ముందునకు
వచ్చి - వానరోత్తమా నేను ధర్మేతరమగు కార్యములను జేయను
నీవధర్మపరుడవు భ్రాతృద్రోహివి నీయెదుట నెవ్వరునిలచి గెలువలేరు
గదా యను గర్వమున నిర్బలుల నణచివైచితివి నీవు నాకుద్రోహము
జేయక పోయినను ధర్మహాని జేసితివి తమ్ముని భార్య కుమారుని
భార్యతనకుమార్తెతో సమానము వావివరుసలువీడి హీనమైన పనులు
జేసితివి అందులకే శిక్షించితిని అదియునుగాక రాజ్యమందలి
ఏప్రాణికైనను హానికలిగిన హరికష్టముదీర్చి దుష్ట శిక్షణ శిష్టరక్షణ
జేయవలసి యున్నది అనాథులకు శరణొసగవలెను నాతమ్ముడు
రాజ్యము జేయుచున్నాడు నేనుసర్వప్రాణులను రక్షించుచు
దుర్మార్గులను దండించి శాంతిభద్రతలు నెలకొల్పుచున్నాను అందులకే
నేనీ అరణ్యముల దిరుగుచున్నాను అదియును గాక క్షత్రియధర్మమైన
వేటయందు నిన్నుగూల్చితిని మాటువేసి క్రూరమృగములను
ప్రాణులహింసించు ప్రాణులను జంపిన దోషము లేదని
పెద్దలుచెప్పుదురు అందువలన నిన్నుజంపుటలో దోషములేదు
మదబలగర్వితుడవై కామాతురుడవై కుమార్తెతో సమానమగు తమ్ముని
భార్యనుగూడితివి ఎటుజూచినను నీవు శిక్షార్హుడవే ధర్మరక్షణయే
నాకర్తవ్యము నేనధర్మకార్యమేల జేతును నీపాప కర్మయే
నీకుమృత్యువయ్యెనన వాలి రామునకునమస్కరించి రామా! నాకు
జ్ఞానోదయమయ్యెను నీవుజెప్పినది సత్యము నాగర్వమే నన్ను
సమయించినది నాతమ్ముడగు సుగ్రీవుడదృష్టవంతుడు నీచే రక్షింపబడి

నీకుమిత్రుడయ్యెను నేను నీచే హతుడనైతిని రామా! నాకొకకోరిక గలదు దానిని వచ్చెడి జన్మయందు నైన దీర్చుము ఇప్పుడుసూర్యసుతుని రక్షించి నన్ను శిక్షించితివి అట్లే సూర్యపుత్రుని జంపినన్ను రక్షింపుము నీప్రియ మిత్రుని గా జేసి కొమ్ము నీచెలికానిగా నీప్రేమాదరములుజవిజూడనిమ్ము నిన్ను పొందెడి భాగ్యము నాకుదయసేయుమీ ఇదియే నాకోరిక నాతప్పులు మన్నించినాకుమారుడగు నంగదుని నీవే కాపాడవలయును నాతమ్ముడగుసుగ్రీవుని అంగదుని నీతమ్ములట్లుభావించి పాలింపుము అని చేతులెత్తి నమస్కరించిఅదిగో ఆకసమునుండి దివ్యవిమాన మగుపడుచున్నది నీవుశ్రీమన్నారాయణుని చే హతుడవైతివి మరణకాలము న పరమేశ్వరసాక్షాత్కారముజేసికొని ముక్తిబొందు మను వాక్కులు వినవచ్చుచున్నవి అన రాముడు వానిమస్తకమున హస్తముంచి వానరా! భయపడకుము నీకోరిక తప్పకదీర్తును వచ్చెడిజన్మలో గాదు యిప్పుడును నీవు నామిత్రుడవే నీకుమారుని నాకన్నబిడ్డవలె జూచుకొందును చింతిల్లకుమని అభయ మిచ్చిన వాలిరాముని జూచుచు చేతులుజోడించి ప్రాణములు విడచెను వాలి మరణమునకు వానరులు శోకించిరి సుగ్రీవుడును తనకారణముననేయన్న మరణించెనని దుఃఖించెను రాముడు వారలనేదార్చి అంగదుని అక్కునజేర్చుకొని యూరడించెను వాలి మరణవార్తవిని వానిస్త్రీలందరు రోదించుచు వచ్చిరి తారయు వాలి పైబడి శోకించెను 46

## తారా విలాపము

తే గీ -ఎంత ప్రియమయ్యెనో భూమి కాంత నీకు
దాని గౌగిలిలో నీదు తనువు నుంచి
నన్ను జూడవు యిదియేమి నాధనీవు
వదిలి పోయితివే నన్ను వ నరేంద్ర 47

తే గీ -ఇంద్ర సౌధంబులను మించు మందిరములు
తారలను మించు నీదేవి తార యుండ
నెట్లు జేరితివా నాక మేల రావు
సతిని పుత్రుని విడనాడి చనితి వెట్లు 48

కం - నీమేలు గోరి జెప్పిన
స్వామీ నామాట వినక జనితివి దివికిన్
వ్యామోహంబు న బడితివి
యేమందును నిన్ను దుఃఖ మెటు సైరింతున్ 49

కం - తమ్ముని బురివెడలంగా
బొమ్మని గొట్టితివి వ ని బొలతిని బంపం
తమ్ముని బట్టితి వెంత హి
తమ్మును జెప్పినను వినక దరుచర వర్యా! 50

కం - సతిని విడనాడి నీప్రియ
సంతుని విడచి జేరినావు సురపతి జూడన్
మతి జెదరి నేను యిచ్చట
గతిసెడి వడియుంటి నింక గానగరావా! 51

ఆ వె -కోలుపోతినింక కొండంత ధైర్యమ్ము
చెల్లె ఋణము నింక జెప్పనేల
నిన్ను విడచి నేను నిలువంగ జాలను
నన్ను గూడ గొనుము నాథ నీవు 52

గద్యము - అనినెత్తి మొత్తు కొనుచు తార యేడ్చుచుండ 53

కం - తారా పధమును వీడిన
తార యటుల నేల గూలి దైన్యముతోనా
తార విలపించు చుండ న
పారకరుణ తోడ రామ భద్రుండనియెన్ 54

ఆ వె -ఆంజనేయ నీవు ఆమె యొద్దకు జని
సేద దీర్చి సేవ జేయవయ్య
యనిన వాయుపుత్రు డాదరి కేతించి
యూరడించి బలికె యువిద తోగ 55

తే గీ -వాలి యంతటి వీరు నిల్లాలి వయ్యు
ఇట్లు దీనత జెందంగ నేల నమ్మ
వీరపథమును బొందె నీ వీరవరుడు
చావు బుట్టువుల్ ప్రాణికి సహజమగును 56

కం - ఆయువు దీరిన వారల
నాయువు సమకూర్చు బ్రహ్మ యైనను గాని
క యగ జాలడ నంగా
నాయువు సరిపోయె వీని కమ్మరొ వినుమా 57

తే గీ -ఎదురు లేకయె కపికుల మింతవరకు
నేలె జగజట్టియై తానె యింద్రు డనగ
జంప నెవ్వరు యెవ్వరు జచ్చు టకును
విధియె కర్తగు నన్నిట వినుము తల్లి 58

గద్యము - అని హనుమంతుడు బల్కిక తారయు దుఃఖమున యెలుగు రాక ఎట్టకేలకు కన్నులుదుడిచికొని తనపతిని జంపిన వీరుడితడే గానోవు నని ఠ ముని దెసపరికించి చేతులుజోడించెను రాముడును ఆమెను శాంతివచనములతో నూరడింప 59

కం - ఆపలుకులు విని తారయు
నేపగుదుఃఖంబుతోడ యినవంశజుతో
నీ పగిది నన్ను పతినెడ
బాపితి విదియేమి దర్మపద్ధతి జూడన్ 60

తే గీ -పతిని బాసిన సతికి నే బాగునింక
నన్ను పతి తోడ గూల్చుమో నలిన నేత్ర
సతిని యెడ బాసి దుఃఖమ్ము సైచి నావు
పరుల క బ ధ కలిగింప బాడి యగునె 61
పతిని జంపిన శరమున పరమ పురుష
నన్ను జంపియు వేగమే నాథు కడకు
బనుపు మె దేవ నాకదే వరము సుమ్మ
యోవ జ లను నీదుఃఖమె నరేంద్ర ॥ 62

గద్యము - అని యేడ్చుతారతో రాముడు దేవీ! వీరపత్నివగు నీవిట్లు చింతించ దగునా! నీపతి వీరస్వర్గమలంకరించె అంతయును విధి విధానము విజ్ఞురాలవగునీవిట్లుబలుక దగునా! ఊరడిల్లుము 63

తే గీ -సుఖము దుఃఖమ్ము రెండును జూడ సమమె
శీతముష్ణమ్ము భంగిని జెలగు చుండు
వానికై విజ్ఞు లెప్పుడు వగవ రాదు
ప్రాణి ధర్మంబులివి జూడ పడతి నిజము 64

కం - జననము మరణమ్మును యీ
తనువునకే ఆత్మకెపుడు తగులవు సుమ్మా!
యనుచుందురు భువిలోనీ
జనులందరు బుట్టు చుంద్రు చచ్చుచు మరలన్ 65

## సుగ్రీవుని పట్టాభిషేకము

గద్యము - కావున శాంతింపుము సుగ్రీవా! నీవిట్లు చింతించదగునా? తదుపరి కార్యక్రమము జూడుము అంగదు నూరడించు మన సుగ్రీవుడు రామా! నేను భ్రాతృద్రోహిని నా యన్న చావుకు నేనే కారణము అరి వీర భయంకరుడై కపికులము నేలిన వాడు నేడిట్లు బడియుండె అన్నను జంపిన పాపిని ఈకపికులము నేల ననర్హుడను నేనుతపోభూమికేగెద అంగదుడే రాజ్యమేలును ఈ కపులందరు నీకుసీతాన్వేషణకు దోడ్పడగలరు అని దీనముగా నేడ్చెను వానికి ధైర్యము జెప్పి అంగదునిచే వాలి కగ్ని సంస్కారము జేయించెను తరువాత దుఃఖోపశమనును లైన కపులందరు సమావేశపరచి మీరందరు కిష్కింధా రాజ్యమునకు నుగ్రీవుని పట్టాభిషిక్తునిజేసి అంగదునియువరాజును జేయుడని జెప్పిన వారును కిష్కింధ కేగిరి అంతట రాముడు జాంబవంతు నుద్దేశించి ఈ వాలి సుగ్రీవుల కింతబలపరాక్రమము గలగుట కారణమేమ జాంబవంతుడు వారిజన్మవృత్తాంత మిట్లుజెప్పందొడంగె

## వాలి సుగ్రీవుల జన్మవృత్తాంతము

తే గీ -అబ్జభవుడాత్మ యందునా హరిని దలచి
ధ్యానముద్రలో నున్న యాతరుణ మందు
అక్షులందుండి జారెను అశ్రు జలము
బడియె హస్తమునందొక బాలు డగుచు ॥ 67

తే గీ -వాన రా కారము తొనున్న వాని జూచి
విధికి తనయుండ వై వృక్ష విరజా డనగ
అడవి యందున్న ఫలము లాహారముగను
బ్రతుక గలవీవు బొమ్మని బలికె బ్రహ్మ ॥ 68

తే గీ -తండ్రి యానతి దలదాల్చి తనయు డంత
పుష్పములు దెచ్చి భక్తితో పూజ చేసి
వినయ మింపార విధిని సేవించు చుండు
కందమూలము లే దిని కానయందు ॥ 69

కం- వనములు దిరుగుచు నొకపరి
జనె నటగల సరసికడకు జలములు ద్రావన్
గనితన ఛాయను వేరొక
వనచరుడని దలచి వేగ వానిని దలకన్ ॥ 70

ఆ వె -దుమికె నందు నతడు దుస్సాహసము తోడ
వెదికి వెదికి జూచి విసుగు జెంది
వచ్చి వొడ్డుజేరి వనితగా మారెను
సిగ్గు జెంది దిరిగె చేడె యచట ॥ 71

కం- వయ్యారపు నడకలతో
బయ్యెద సవరించు కొనుచు పడతియు నుండన్
చయ్యన నట కేతెంచిన
నయ్యింద్రుడు కాము శరము లందున జిక్కెన్ ॥ 72

కం- దినరాజు గూడ నాతరి
వినువీధిని బోవుచుండె విధి నీక్షింపన్

గనుడై [illegible] ప్రగ్రపు
పనిలో ట [illegible] చెప్పెన్ ॥ 73

కం - [illegible] దివిజ [illegible]
వసుపక్షిని [illegible] గంధర్వ [illegible]
సుపమగు [illegible] వు
దిను వ[illegible] [illegible] తరుణి శిరమున్ ॥ 74

గద్యము - అల్లు[illegible] వారి ఇంద్రతేజమా ఇంతి వెనుక భాగమున విలమునందు స్థలమా నిలచిన సూర్యతేజము కంఠదేశమున నిలచిన తోడనే విలమునసించిన ఫలము వాలిగను గ్రీవమున నిలచిన తేజము సుగ్రీవుడగను వానరాకారములు గల్గిన బాలకులైరి తమతమ ఆవేశములడగిన ఇంద్రసూర్యులు తమ అంశమున జనించిన వాలి[illegible] [illegible] మణిహారము వాలి మెడను వైచి దివం[illegible] సూర్యుడును సుగ్రీవునికి తేజమ్మును బలమును ప్రసాదించి [illegible]గికరిగెను ఆరేయంతయు [illegible] బాలకుల తో [illegible] తిరిగి తన వానరాకారముతో కూడిన పురుషుడయ్యెను అంతట వృక్షవిరజ డా బాలకులగని బ్రహ్మ కడ కేగి సంగతి యంతయు దెల్పిన నావిధి [illegible]యు పార్వతీదేవి శపించుటకు గురియైన [illegible] ఇంద్రసూర్యుల వలన నీబాలకులకు జననమైనదని పార్వతీదేవి సరస్సునకేల శాపమిచ్చెనని వృక్షవిరజు డడుగ పూర్వ మొకప్పుడు 75

కం - పరమ శివుని సతి పార్వతి
సరసున తనచెలుల తో డ జలకములాడన్
వెరపొందక రక్కసు లా
సరసందున దాగి యుండె సతి నీక్షింపన్ ॥ 76

కం - కనుగొని పార్వతి వరిన్
వనితలు గండనుచు బల్కి వారి శపింపన్
మనమున బెదురుచు నసురులు
వినయంబున వేడుకొనగ వీక్షించి దయన్ ॥ 77

తే గీ -ఒక్క దినమున వనితలై యుండ గలుు
అనుచు శాపోపశమనంబు ుగజ బల్కె
ఆ సరస్సున మునిగి నీవ డు రు పు
నొంది వీరికి దల్లివై నుం ఎలసె !! 78

గద్యము - అని జెప్పి నీపిజా ుకుల గొని కిష్కింధారణ్యవ ులకు బోయి అవనమందలి వానర వీరులకు న యకుడవై యుండుమని దీవించి బంపెను అప్పటినుండియు ఎు్క్ష ురజ డు కిష్కింధార జ్యము నేర్పరచు కొని పెద్దకాలము ఎ నరులంబాలించ వాలిని ర ఇ ను సుగ్రీవుు యువరాజును జేసి తపోభూములకేగెను అందు ు లి నిశరమున ముక్తిబొందెను యీసుగ్రీవుని ుహాయముు నీక ర్యము సాధించగలవు ఈ వాలి సుగ్రీవు లిరువు రును బ్రహ్మపౌత్రులు సై రాంశ సంభూతులై సందున అసమాన పరాక్రమ సంపన్నులు సుగ్రీవుడురాజై అనభార్యయైన రుమతోడను బంధువుల ోడను సుఖంుునుండెను అంగదుని కన్నబిడ్డపలె జూుచు తార సంప సహక రములతో రాజ్యమేలు చుండెను కపకులంబున గల పెద్దలును నతికోవిదులునగు -మైందుడును ద్వివిదుడును గంధమ దనుడును గిుడును గవాక్షుడును గవయుడును ఆంజనేయుడును జాంబవంతుడును శరభుడును నలుడును నీలుడు మొదలగు కపవీరులు సుగ్రీవుు గొలుచు చుండిరి రముడు వారల ుందర కిష్కింధకంపి ల సుప్రస్రవణ గిరి యందు తమ్మునితోడ నివసించు చుండెను వర్షఋతువు గనుక సీతాన్వేషణకు సమయముగాదని యు రకుండెను ఒక్కా దు ర ముడా ప్రాంతమున సంచరింపుచు నందలి ప్రకృతిరామణీయకతకు ముగ్ధుడై లక్ష్మణా! చు చితివా యిప్రా ంతమంతయు బహురమణీయముగా నున్నది ఈసరోవరములో నున్నజలములు శీతలములు స్నిగ్ధములు మధురములు నైయున్నవి ఇం ఐ వాయువు గగ ఐదముగ వీచి శరీరమునకు హాయిగొల్పుచున్నది వరాక ులు గడచు పెగకు మన మిందే యుందము అనగ ల క్ష్మణుడు ు ఎచ్చెయు ు ు సరోవరము

నందలి జలముల గ్రోలుచు ఆతరులతా గుల్మాదుల యందు విశ్రమించుచు రాత్రుల యందా గుహలో నిద్రించు చుండిరి ఒకనాడు రాముడు నిద్రరాక గుహాముఖమునకువచ్చి ఆవనమంతయు గలియ జూడగా నేది జూచిన నుసీతాస్మృతులనే దలపించు చుండ దుఃఖముతో వికలమనస్కుఁడయ్యెను 80

## రాముడు సీతను దలచి దుఃఖించుట

కం - నల్లని మబ్బుల తోడను
చల్లని చిరుగాలి వీచి సందడి సేయన్
మెల్లన తుషార బిందువు
లల్లన వెదజిమ్ము చుండె నందము జెందన్ 81

కం - ఎటుజూచిన ప్రకృతి తన
పటుతర వైభవము జల్లి పరుగులుదీయన్
కటి బంధమై భూమికి
నటనట సెలయేరులన్ని అందము గూర్చెన్ 82

తే గీ -వర్ష ఋతు వందు ప్రవహించు వర్షధార
జానకీదేవి కన్నటి జాలు వనగ
తరుణి పయ్యెద చెరగన తరళమైన
నంబరమ్మున గననయ్యె నవని పతికి 83

కం - సీతను బోలెడి యాభువి
యాతన గలిగించి మదికి యటమట గొలుపన్
యే తిరున నే నిపుడా
సీతను దేగల నటంచు జింతను బొందెన్ 84

తే గీ -పువ్వు లన్నియు నాదేవి నవ్వి నటుల
నాకు లన్నియు నాసీత హస్తములన
కాన యంతయు జానకి కన్నులట్లు
గాన బడియెను రాముని కన్నుల కును 85

గద్యము - రాముని దుఃఖమును జూచి లక్ష్మణుడన్నకు ధైర్యము
జెప్పుచు నూరడించెను 86

కం - అన్నా నీవే యిట్టుల
విన్న దనముతోడ నింత వేసట జెందన్
ఉన్నతి జెరచెడి దుఃఖం
బెన్నడు నీ దరిని జేర నీయకు మనియెన్ 87

కం - శోకము ధైర్యము జెరచును
శోకము బలమడచివేయు సుఖముల బెడవున్
శోకము నాశము జేయును
శోకము పురుషుని సర్వ శోభలడంచున్ ॥ 88

కం - కావున ధైర్యము వీడక
యే విధమున నైనగ ని యీకార్యంబున్
వే విధముల సాధించియు
గావింపగ వలయు సర్వకార్యముల వలన్ ॥ 89

కం - వచ్చెడిది వానకాలం
బిచ్చటనే గడప వలయు నీసమయంబున్
వచ్చెడి శరదతువందున
మెచ్చెడి కార్యంబునడుప మేలగుగాదా! 90

వచనము - అనిబలుక తమ్ముని మాటలకు రాముడు లక్షణా! సీతను దలంచుకొనిన నాకంటికి కూరుకురాదు సీతయే నా కన్నుల కగుపడుచున్నది ఈ ప్రకృతి అంతయు సీతామయముగానే దోచుచున్నది ఇంతటి భుజశక్తిపరాక్రమముగల్గియు సీతను కాపాడలేక పోతిని జగదేక వీరుడననిపించుకొని శివధనువునెక్కిడి సీతను పరిణయమాడియు నేడసమర్థుని వోలె సీతను రక్కసుని పాలు జేసితినిగదా! అనివిలపించు రామునేదార్చెను వానాకాలము గడచెను గాని సీతాన్వేషణప్రారంభముకాలేదు అంత సౌమిత్రి సుగ్రీవునిపై మండిపడి జూచితివా అన్నా! ఈ సుగ్రీవు డెంతటి మిత్రద్రోహియో తనకార్యము చక్కబరచుకొని మిత్రకార్యమలక్ష్యము జేసెను నేనిపుడే

వెళ్లి వాని దేడ్కొని వచ్చెద అతడు రాజ్య మదంబున ప్రమత్తుడైనాడు యిక సైప రాదని దిగ్గనలేచి కిష్కింధకేతెంచెను ద్వారము కడ నిలచి సుగ్రీవుని బిలువనంపెను సుగ్రీవుడును లక్ష్మణుని కడకేగి వినయంబున నమస్కరించిన లక్ష్మణుడు తనక్రోధమడంచుకొని శాంతగంభీర వచనంబుల 91

కం - మరచితివి మిత్రకార్యము
మరచితి వెంతయును రాజ్య ముదమున నీవే
యరుదెంచి రామకార్యము
గురుతించెద వనుచు నమ్మి కూరిమి తోడన్ 100

ఆ వె -ఎదురు చూచిజూచి యేతెంచి నారము
నీదు జాడగనక నేటి దనుక
రావు నీవు నీదు రాజ్యమ్ము విడనాడి
మరచి నావు మిత్రకార్య మంత 101

కం - చేసిన మేలును మరచుట
గాసిల్లిన వారి మనసు కలతలు వెట్టన్
దోసము గద నిను బోటికి
భాసిల్లునె యిట్టిపనులు భాస్కర పుత్రా! ॥ 102

కం - రాముడు చింతిలుచుండగ
కామముతో నీవు మిగుల కాంతలతోడన్
నీమములు వీడి రతులన్
తామసమున మునిగియుండ దగునా వీకున్ ॥ 103

కం - చేసిన ప్రతిజ్ఞ లన్నియు
మాసెను నీవర్తనమున మాకున్ దెలిసెన్
జేసెను విధియే యిట్టుల
వేసటలను జెందవలసె వీరుల మయ్యున్ ॥ 104

తే గీ -నిన్ను నిందించుటది మాకు నీతి గాదు
నీవు లేకయె యాపని నేను జేతు
గాని నీయందు నుంచిన గారవమున
వచ్చి యున్నాను జూడుమా వానరేంద్ర ॥ 105

వచనము - అని బల్కులక్ష్మణుని నిష్ఠురవాక్యములకు సుగ్రీవుడు సిగ్గుజెందినవాడై మిత్రమా! నన్ను మన్నింపుము నేనిపుడే వానరవీరులను రాముని వద్దకు దీసికొని వచ్చెదను సీతాన్వేషణకై బంపుదము అని తనసచివులను బిలచి మన వానరవీరుల నందర ను దేడ్కొని రామునివద్దకుబోవలెను గ నవారలంబిలవనంపుడని వెంటనే లక్ష్మణునితోరామునివద్దకేగి ప్రణమిల్లి తనప్రమత్తతకు సిగ్గుచెంది యూరకుండెను రాముడు 106

కం - పదముల వాలిన మిత్రుని
సదయుండై రాముడంత సాదర మొప్పన్
యెదనత్తు కొనుచు నాతని
వదనము వీక్షించి గుశల వార్తల నడిగెన్ ॥ 107

వచనము - తరువాత అతని సంకోచమును దీర్చి

కం - ధర్మార్థంబులు సక్రమ
కర్మలు జేయుచును బొంద గలగును గానీ
ధర్మే తరముగ కామ్యపు
కర్మ జరుపంగ చేటు గలుగును భువిలో ॥ 108

## సీతాన్వేషణకై సుగ్రీవుడు వానరుల నలుదిక్కులకు బంపుట

గద్యము - అని బోధించిన సుగ్రీవుడు రామునకు మ్రొక్కుచు రామచంద్రా నా ఆలస్యము మన్నింపుము ఇదే ఈ వానరవీరులను బరికింపుము వీరందరు అసమానతేజోవిరాజులు అమిత పరాక్రమ శాలురు మహావీరులు నీకార్యము సాధింప వచ్చిరి అని ఒక్కొక్క వానరవీరుని ప్రత్యేకముగా రామునకు పరిచయము జేసి - ఇతడు సుషేణుడను వానరోత్తముడు తారకుతండ్రి అశేష సేనావాహినితో మనకు సహాయముగా వచ్చెను ఇతడుదారుడు నాభార్య రుమకుతండ్రి ఇతడు కొసరి అనువీరుడు హనుమంతుని తండ్రి ఇతడుగవాక్షుడు ఇతడు గజుడు ఇతడు గవయుడు ఇతడు గంధమాదనుడు ఇతడు

ధూమ్రుడు ఇతడు నీలుడు ఇతడు నలుడు ఇతడు ద్వివిదుడు ఇతడు మైందుడు ఇతడు దరీముఖుడు ఇతడు జాంబవంతుడు వీరందరు తమతమ సేనలతో వచ్చియున్నారు చూడుమన రాముడు కోట్లకొలంది నేల గప్పియున్న వానర వీరుల ను గాంచి ఆశ్చర్యమును ఆనందమును బొంది మిత్రమా! నీవంటి మిత్రుడుండ నాకార్యము సఫలముగాకుండునా అని గౌగలించుకొనియెను సుగ్రీవుడు తన సేనాధిపతులలో వినతు డను వానిని బిలచి వాని లక్షలాది సైన్యమును రామునకు జూపి వీనిని నీ సేవకునిగా బనుపు మనరాముడు నాకేమియు దెలియదు ఈ ప్రాంతమంతయు నీవేయెరుగుదువు గాన ఏమిచేయవలయునో నీవే జేయుమన సుగ్రీవుడు వినతునితో నీవు తూర్పు దిక్కునకే ఆతిరమంతయు సీతాన్వేషణ జేయవలయును మగధ దేశమును కోసల దేశమును తూర్పు సముద్రము దరిని కౌశికీ నదీ తీరమున మాళవదేశమున గలయ వెదుకుడు అట వృషభాద్రి అను పర్వతము గలదు దానివద్ద సుదర్శన మను నొకసరోవరముగలదు అందు అనేకజలచరంబుల తోడను హంస చక్రవాక చకోర పక్షిసముదాయము తోడను వాటికలకలారావముల తోడను వీనుల విందొనర్చుచుండును అచ్చటుతరులతాదుల తోడను అనేకజంతు వక్షిన ముదాయము తోడను ఆవనవాంతయు శోభాయమానముగా నుండును అచ్చట భీకరాకారులగు రక్కసులు పెక్కమంది వసింతురు గాన నచ్చోటబాగుగా వెదకుడు అంగ వంగ కలింగ దేశములను ఆవరిశరముల గలవనములను నదీనదంబులను వెదకుడు అట మందరగిరి ప్రాంతమున మందకర్ణులు ఉష్ట్ర కర్ణులు ప్రావరణులు కిరాతులు ఏకపాదులు నగుఅసురులు గలరు వారందరు క్రూరస్వభావులుముష్కరులు నై యుందురు అచ్చట రావణుడు సీతామాతను దాచ వచ్చును గాన బాగుగా వెదకుడు అటనుండి జంబూద్వీపము గడచిన గగనచుంబితమగు శిశిరభిజపర్వతముగలదు అందుపెక్కు గుహాలున్నవి నిత్యము సెలయేరులతో నుండి గమింపరానివై యుండును అచ్చటి సముద్ర

జలములు కాలోదకములన బడును అవి రక్తవర్ణములై యుండును అందు కాల కరాళ ఉరగ యనుజాతుల రాక్షసులు బ్రాహ్మణ ధనాపహారులును ఛాయాగ్రాహకులునై యుందురు వారు పగలంతయు సముద్రమున దాగి రాత్రిసంచరింతురు శంఖనిభ కర్ణులను ఘోరాకారులు నగు రక్కను లందరు నానా రూపంబులతో నుందురు అటఘుందేహులను రక్కసజాతియున్నది వారిని మానవులు సమీపింపజాలరు మీరు వీనరులు గావున వారి దరిదీపుల జేరి శోధింప గలుగుదురు అటనుండి తిన్నగా సముద్ర తీరమున బోయిన యుక్తామణులకు ప్రసిద్ధిగాంచన సాగరము గానగును ఆ సముద్రములో కొంతమేర జనిన అంశు మంతమను పర్వత రాజము గలదు ఆ పర్వతము నానుకొని యొక సరస్సుగలదు దాని నీరంబులు క్షీరంబుల బోలియుండును అందనేకమంది యక్ష కిన్నరగరుడ గంధర్వాదులు నిత్యము క్రీడించు చుందురు దాని వెంబడి కొంతమేర జనినఘృతోదధి గలదుహయగ్రీవముఖుడగు కపిల మహాముని అట నివసించును హవిర్భూతమగు ఘృతమును పానముచేయుచుండును అచ్చటనే బడబానలముద్భవించు చుండును వాటిఆర్తనాదములు దూరమున కే వినిపించు చుండును ఆఘృతోదధి కుత్తరమున చతుర్దశయోజన పరిమాణము గల జాతశిలా పర్వతము గలదు దానిపై శ్రీకలితుడును సహస్ర శిరుడును నీలాంబరుడునునై అనంత దేవుడాశీనుడై యుండును ఆ మహాత్ముని కేతువు త్రిశిరంబై కాంచన తూలంబు గలిగి యుండును దాని నధిగమించి యేగిన బ్రహ్మనిర్మిత మగునొకద్వీపముగలదు ఆ ద్వీప మధ్యమున హేమ మయమగు నుదయ పర్వతము గలదు ఆ పర్వతగుహలలో సీతామాతను వెదకుడు అందువైఖానసను లైన వాలఖిల్యులు అంగుష్ఠ మాత్రులై సూర్యకిరణంబులే ఆహారంబులుగా వసింతురు అచ్చట మేరువు సూర్యప్రభలతో సంధ్యారక్తవర్ణములై యుండును అచ్చటనే త్రివిక్రమదేవుడు ప్రథమపాదముంచి ద్వితీయపాదము మేరువు శిఖరమున బెట్టి తేజరిల్లెను ఆ మేరు పర్వత శిఖరము నాశ్రయించి

సు ర్యుడుతేజరిల్లుచు జంబు ద్వీపవాసులకు గాన బడుచు సకల జీవులకు కన్నులవెల్గై యుండును దానికి పూర్వభాగమంతయు అంధకార బంధురమై యుండును మీరటు ప్రవేశింపజాలరు గాన పైనజెప్పిన స్థలము లన్నియు శోధించి సీతామాత జాడల దెలిసికొని ఒక మాసము దినములలోగా మీరు తిరిగి రావలయును నేజెప్పినవే గాక యింకను మీకు దెలిసిన స్థలములున్న వాటిని పరిశోధింపుడు మీలోనేవీరుడు సత దేవి జాడలు దెలియ జేయునో వానికి నారాజ్యము సందర్ధభాగ మిచ్చెదను శ్రీరాముని కోర్కిదీర్చుట మనధర్మము దాన లోకహితమున మనకు యశస్సును లభించును నాయాజ్ఞ ధిక్కరించిన చీల్చి చెండాడెదను గాన మీరల ప్రమత్తులై జన వలయు 101

కం – అతులిత బలశాలురుమీ
రతిధీరులు నాకుహితులు రాముని కొఱకై
యతి తొందరలో జనకుని
సుత గని రావలయు నవని శోధించవడిన్ ॥ 102

గద్యము – అని వారల వీడ్కొలిపెను 103

కం – దక్షిణ దిశగనుగొనగా
దక్షత గలవీరులంత దారాదులతో
లక్షలు గా నరుదెంచిరి
నక్షీణ బలంబు గల్గు నా వానరులున్ ॥ 104

గద్యము –అంత సుగ్రీవుడు హనుమంతుని శరగుల్కుని ఋషభుని గంధ మాదనుని మైందుని ద్వివిదుని విజయుని ఉల్కాముఖుని మొదలగు షోడశ వానరవీరుల నెంచి వారితో అనేకమంది వానరుల బంపిదక్షిణదిశనంతయు వెదకుడని వారలకాప్రాంతములకేగు మార్గములను నచ్చటివిశేషంబులును దెలియజేయుచు 105

ఆ వె –ఆంధ్ర పాండ్య చోళ యాది దేశములలో
వింధ్య పర్వత వన విపినమెల్ల
గౌతమీ తటముల గల వనంబుల నెల్ల
వెదక వలయు మీరు విసుగు లేక ॥ 106

ఆ వె - దండకావనముల దరికొండ గుహలందు
ఆటవికలు మసలు అడవు లెల్ల
మలయ పర్వతముల మంచి సుగంధముల్
వెల్లివీచుచుండు విపిన ములను ॥ 107

కం - ఆవన మందు నగస్త్యుడు
భావంబును బ్రహ్మమందు భాసించిగడున్
కావేరీ తీరంబున
ధీవరుడై తపము జేయు తేజము వెలయన్ ॥ 108

గద్యము - ఆ మహాత్ముని దర్శించి ముందుకు జనిన అంతరంగమను ప్రాంతమగపడును పూర్వమొకప్పుడు అగస్త్య మహాముని దక్షిణ సముద్ర తీరమున తన పూజోపయోగములగు వస్తువులుంచిన సముద్ర తరంగములు వానిని జలముల లోనికొనెట్టివేసెను అంత అగస్త్యుడు కోపించి సముద్రుని అంతరంగుడవు గమ్మని శపించె నప్పటినుండియు సముద్రుడంతరంగుడయ్యె ఆప్రాంతము అంతరంగమను పేర బిలువబడెయె అచ్చట మహేంద్ర పర్వతమున్నది దేవేంద్రు డచ్చరలతో పర్వదినంబు లందట కరుదెంచి క్రీడించు చుండును అచ్చట తరులతా గుల్మాదులు సుగంధ భరితములై యుండి నందన వనమును మించియుండును ఆవనమున రావణుడు సీతను దాచి యుండ వచ్చును మీరా వనమంతయు శోధింపుడు దానిని గడచి ముందుకు సాగిన యందునొక హేమ శిఖరంఋన సూర్యుండును దానికెదురుగా రజతశిఖరంబున చంద్రుడును వెలుంగు చుందురు మాసమున కొక్కమారు వారిరువురను దర్శింపనగును పాపులును కృతఘ్నులును వ రిని జూడ జాలరు మీరాగిరికి నమస్కరింపుడు అచ్చట మాల్యవంతమను పర్వతమున్నది అందు విశ్వకర్మ నిర్మితమగు అగస్త్య భవనమున్నది అగస్త్యుని అభిషేకమున్నకై అనేక ఔషధలతో గూడిన అంజన నది అట బ్రవహించు చున్నది అచ్చటనే రక్తచందన సంయుక్తమును దేవఋషి సేవితమును పవిత్రమునైన సరస్వతినది బ్రవహించు చున్నది అచ్చట యె జన

విస్తారమును శతయోజన యున్నతంబునై 'ొభోగవతిపురము గలదు వాసుకి అపురమేలుచుండెను విషసర్పములతో నిండి పన్నగములు పరివేష్టింప వాసుకి అపురము నేలుచుండును ఆ సముద్రతీరమున పుష్పిత సూర్యవంతములను పర్వతములు వృషభాకృతి గల్గి యుండు అందుచే వానిని వృషభాద్రి అందురు అందలి అరణ్యములు మధువులకు ప్రశస్థిచెందినవి అనేక పుణ్య కర్మలాచరించు వారును సూర్య చంద్రాగ్ని తేజో విరాజితులును విహరించు చుందురు అట తృణాంగుడను నొక మహాత్ముడు గలడు వానికి నమస్కరించి యేగిన మీకు జయమగును

ఆ వె -దాని కవలనుండు దారుణం బైనట్టి
అంధకారమైన యమపురంబు
నందు జీవకోటి కందించు సమవర్తి
ప్రాణి జేయు పుణ్య పాపఫలము ॥ 110

గద్యము -మీరంత వరకు బోజాలరుగాన నేజెప్పిన స్థలముల సీతామాతను వెదుకుడు అని జెప్పి హనుమంతుని జూచి 111

కం- భూమండలి శోధించియు
భూమిజ జాడలను దెలిసి భూవరుడగు శ్రీ
రాముని మనమున గల యా
కామితమును దీర్చవలయు కపివర నీవే ॥ 112

కం- భువి యందుగాని ఆవల
దివి యందున గాని నీదు తేజము మెరయన్
పవమాన తనయుడవు నీ
కవరోధము గలుగబోదు యరుగుము వేగన్ ॥ 113

గద్యము – అని సుగ్రీవుడు హనుమంతునితో బలుక శ్రీరాముడాంజనేయుని గౌగలించుకొని హనుమా! నీశక్తి యుక్తులు వినిన పిమ్మట నీవే ఈ కార్యము సాధించ గలవని నమ్ముచున్నాను ఇదిగో ఈ అంగుళీయకము నా అనవాలుగా సీతకు జూపుము ఇది మావివాహ కాలంబున జనక మహారాజు కానుకగా యిచ్చిన రత్నముద్రిక అని తన నామము

చెక్కబడి యున్నయుంగర మిచ్చి దీవించిన 114

ఆ వె -రత్నఖచితమైన రమణీయ ముద్రిక
ఆంజనేయు డంత నమితభక్తి
శిరమునందు నుంచి శ్రీరామునకు మ్రొక్కి
యేగె తనదు బలము లేచి గొలువ 115

గద్యము - సుగ్రీవుడు తన మామ యగు సుషేణుని బిలచి యతని సైన్యతో పశ్చిమదిశగా సీతాన్వేషణకై బోవబనిచి ఆయాప్రాంతములను వన పర్వతముల జను మార్గంబులనీవిధముగా జెప్పందొడగె

సౌరాష్ట్ర సాహికి బాహ్లాక శూద్రాభీర జనపదంబులును వకుళాది వాసితంబులైన పున్నాగ కేతకీ నారికేళ వనంబులును అటగల తాపసారణ్యంబులు వెదకి కేకయ సౌవీర త్రిగర్తవేశంబులును మహాగ్రాహముల (మొసళ్లు)తో నొప్పారు సముద్రద్వీపములును వైదేహిని వెదకుడు మురచీ జటీ అవంతీపురంబులు శోధింపుడు ఇంకను సాగర శైల వనాంతరంబులును సింధు నదీ సాగర సంగమంబులును వెదకుచు బోయిన అట శతయోజన పరిమితిగల కాంచన గురు శృంగమున్నది ఆశృంగమున ఇరువదినాలుగు కోట్ల గంధర్వులు కామరూపులై ఆవనమును రక్షించుచుందురు ఆవనమందలి ఫలపుష్పంబులును కందమూలములను కాపాడుదురు అట కెవ్వరును పోజాలరు మీరు వానరులుకనుక అందు జొరగలరు గాని అందలి ఫలమూలముల నంటకుడు కడుజాగరూకులై ఆవనమంతయు పరికింపుడు దానిని గమించి జనిన వజ్రపర్వతమను నొకమహాపర్వతముగలదు దాని గుహాంతర్భాగము లన్నియు వెదకుడు జలధియందు నాల్గవ భాగమునదగు చక్రవంతమను పర్వతరాజమున్నది అందు విశ్వకర్మ నిర్మితమగు సహస్రార చక్రము పాంచజన్యమను శంఖము గలవు వానిని హయగ్రీవుడను రాక్షసుడు చేపట్టియుండ శ్రీమహావిష్ణువు వనినిసంహరించి ఆ శంఖుచక్రములను బొందెను అచ్చట అరువదియోజనములుగల్గి రజిత శృంగముతో నొప్పు వరహ పర్వతమున్నది దాని దిగువను ప్రాగ్జ్యోతిషిపురముగలదు

దానిని నరకుడను రక్కసుడు పాలించుచుండును శ్రీహరి హిరణ్యాక్షుని జంపుటకై వరాహావతారమెత్తిన సమయమున భూదేవిస్త్రీరూపమున నాతనిని బొందెను శ్రీహరివలన భూదేవికి నరకాసురుడు జన్మించెను ఆప్రాంతమంతయు నిపుడు నరకుని ఆధీనమున నున్నది ఆవన్నియు బాగుగా పరికింపుడు దానిని గమించి జనిన ఆరువేల శిఖరములతో నెవ్వు నొక పర్వతము గలదు దాని మధ్యభాంగంబున ఉత్తరమేరుశిఖరముగలదు అందు సూర్యభగవాను డస్తమించు సంధ్యాసమయమున పెక్కుమంది దేవతలును మరుద్వీసువులను విశ్వేదేవతలును అస్తమించు సూర్యుని పూజించు చుందురు ఆప్రాంతముననివశించువారు సంధ్యా కాంతులను బోలు కాంచన వర్ణములతో అద్వితీయ సౌందర్యవంతులై యుందురని సూర్యుడావర్వతమునకు వరమిచ్చెను ఆ పర్వతముపై విశ్వకర్మనిర్మితమైన నగరముగలదు పశ్చిమదిశాధిపతి యగు వరుణుడా నగరమును బాలించుచుండును ఆ అస్తగిరి మేరుగిరుల నడుమ నొక తాళ వృక్షము గలదు అది పదిశిరస్సులు గల్గి సువర్ణమయకాంతులతో విరాజిల్లుచుండును అందు బ్రహ్మతుల్యుఢగు మేరుసావర్ణి అనుతపోధనుడు గలడు వానికి నమస్కరించి జానకీదేవి వృత్తాంత మడుగుడు అటుపైనంతయు అంధకారబంధురమై యుండుగాన మీరటుబోవజాలరు అటనుండి వెనుకకు మరలుడు 116

తే గీ -చెప్పినవి గాక యింకను జేయదగిన
పనులు గల్గిన మీరలా పనులు జేసి
దేశ కాలంబులను బట్టి దిరుగ వలయు
కార్య మెల్లను సాధించి కపి వరేణ్య 117

గద్యము - అని సుషేణునిబంపి శతబలియను వానరవీరుని బిలచి 118

కం - వీరుడవు సకల సద్గుణ
ధీరుండవు సీతజాడ దేగలిగిన గం
భీరుడవు నీవె జూడన్
వేరెవ్వరు నీకుసాటి వేగమునందున్ 119

గద్యము - నీవు నీ వానర సైన్యముతో నుత్తరదిశ పరిశోధించి సీతామాత జాడ గనుగొని రావలయునని జెప్పి నీకు కొన్ని మార్గంబులుసూచించెదను వానిని బట్టి నీవరుగవలయును శ్రీరాముని వలన నుపకృతి బొందిన మనము తిరిగి ప్రత్యుపకారముగావించి ఋణవిముక్తులము గావలయును గావున నీవు శూరసేన పుళింద బ్రిస్థర భద్రక కురు గాంధార కాంభోజ యవన బాహ్లిక మొదలగు ప్రాంతములను ఆయా దేశ మధ్యంబున గల గహనారణ్యములను శోధింపుడు అటగల దేవదారు వనంబులును కేళీవనంబులను గమించి బోవ సుదర్శనమను పర్వతమును దాటిబోయిన దేవ సఖాద్రి అను పర్వతరాజముగలదు అది శతయోజనపరిమితమై కైలాసపర్వతమో యనునట్లుండును అందు కుబేరు డచ్చరలతో విహరించు చుండును

కం - ధనదుడు నిరతము నచ్చట
తనప్రియ భాయలను గూడి తమకము తోడన్
మనసిజ కేళిందేలుచు
మనమలరగనాటలాడు మనసిజుకేళిన్ ॥ 122

కం - వనచరులైనను అటగల
వనితల సౌందర్యమెంచ వశమామనకున్
మనమున దోచెడి చెలువము
గనరాదా స్వర్గలోక కాంతలకైనన్ ॥ 123

గద్యము అవనప్రాంతములన్నియు వెదకుడు దాని తరువాత క్రౌంచ పర్వతముండును అచ్చటి వనచరులందరును సూర్యకాంతి సన్నిభులై సౌందర్యవంతులై దైవభక్తి గలిగియుందురు ఆక్రౌంచ పర్వతము దాటినమైనాక పర్వతముండును దానిమీద మయుడను రాక్షసుకొకడు శివాలయమునిర్మించి అటతపస్సుజేసికొనుచు శివారాధకుడై యుండును కోట్లకొలంది వాలఖిల్యులను సిద్ధులును అట తపముజేసికొను చుందురు వారందరు వందనీయులు వారల నడిగి ముందుకు జనుడు అచ్చట మానస సరోవరంబు గలదు దానినే బిందుసరోవరమందురు ఆసరస్సున నిత్యము హంసలు బాలార్క

తేజంబున విహరించు చుండును అచ్చటి నదులన్నియు శీతలములు స్నిగ్ధంబులును మధురంబులునై ప్రవహించు చుండును అందుఎఱ్ఱతామరలు అల్లిబిల్లిగా విరియ బూసి యుండును ఇంకను అనేకవర్ణంబులుగల్గి పుష్పంబులు విరియ బూఁకనుగవలకు విందొనరించు చుండును ఆపుష్పములు వాడవు అప్పుడు బూసినట్లుగ నవనీతను సున్నితమును గల్గియుండును ఆ ప్రాంత మంతయు నిత్యఫల పుష్పభరితమై స్త్రీపురుష సంయోగ యుక్తమై వారి మనోరథంబు లీడేర్చు చుండును సిద్ధ చారణ గరుడ గంధర్వ కిన్నర కింపురుషాదులు అచ్చరలతో నందు మైథున క్రీడమోదించు చుందురు అట సోమశైలమను కాంచన పర్వతమున్నది ఇంద్రలోకవాసులును సత్యలోక వాసులును అందు విహరించు చుందురు అందుసూర్యరశ్మిలేకపోయినను అందలి వస్తువులన్నియు కాంతి మయములై గోచరించును దానిని గమించిన కైలాసపర్వతము రజితకాంతుల వెదజల్లుచు దేదీప్యమానమై ప్రకాశించు చుండును అదినిత్యము దేవతా సేవ్యమై అలరారు చుండును 124

కం – ఆగిరిపై శివదేవుడు
శ్రీగౌరీ సహితుడగుచు జెలగుచు నుండున్
యోగులు మహిమాన్వితు లగు
త్యాగుల కాపరమశివుడు దరిసెన మొసగున్ 125

గద్యము – మీరంత వరకును బోజాలరు గావున ఆకైలాస శిఖరమునకు నమస్కరించి వెనుదిరుగుడు ఒక మాసము దినములలో కార్యము సాధించి రావలయునన ఆశతబలి సుగ్రీవునకును రామునకును నమస్కరించి భూలోక మంతయు గాలించి సీతామాత జాడలుగనుగొని వత్తుము ఆరావణునిపీచమడంచెదము వానిని మీపాదాక్రాంతుని జేతుమిదే మాప్రతిజ్ఞయని అనేక ప్రకారముల దర్పములు బలుకుచు వాలములు ద్రిప్పుచు గంతులువైచుచు మిడుతలదండు వోలెనున్న వానరసైన్యముతో శతబలి ఉత్తరాభిముఖుడై జనియె శ్రీరాము డమితాశ్చర్యమున సుగ్రీవుని జూచి – మిత్రమ! 126

కం – వనములు నదులును గిరులున్
జనపదము లరణ్యములను జగతిని గలయా
ఘన నగరము లన్నియు నెటు
గను గొంటివి జెప్పవయ్య కపికుల వర్యా! 127

కం – సురలను నరులను కిన్నర
వరులను యా తపసివరుల వాస స్థలముల్
ధరణీ వరులను తరుచర
వర నీవెటు దిరిగి జూచి వచ్చితి వయ్యా! 128

కం – అని అడిగిన రాముని తో
వనచర నాధుండు బలికె వాలి భయమునన్
జననాయక భూమిం గల
వనములు దిరుగంగ వలసె వాసము కొఱకున్ ॥ 129

కం – ఎక్కడి కేగిన గానీ
యక్కడికే వచ్చి నన్ను నడలగజేసెన్
జిక్కులు బెట్టుచు నెన్నియొ
పెక్కిడుమలపాలు జేసె భీతిల్ల గడున్ ॥ 130

గద్యము – చివరకు ఋశ్యమూక పర్వతమునకు రాడు గదా యని యందు దాగియుంటిని అని సుగ్రీవుడు జెప్ప రాముడాశ్చర్యము నొందెను 131

కం – వానరు లందర నటులన్
నానా దిక్కులకు బంపి నాతిని వెదుకన్
మానిత మతి రామునితో
వానర నాధుండు బలికె వరలిన భక్తిన్ ॥ 132

కం – సీతా మాతను గనుగొని
వాతాత్మజుడైన హనుమ వచ్చును వడినిం
దే తన్మాత్రము నందియ
మీతరుణంబునను నుండ దినకుల తిలకా ॥ 133

గద్యము – రాముడును సుగ్రీవుని మాటల కలరి నిశ్చింతగానుండి వానరవీరులే

దిక్కు వారలు ముందుగావచ్చి సీత జాడలు దెలియజేతురో యని
నిరీక్షించు చుండెను 134

తే గీ –ఒక్కమాసంబు లోపల నుక్కు మిగిలి
భూమి యంతయు శోధించి భూమి తనయ
జాడ తెలియక వానరుల్ జాల విసిగి
వచ్చిరందరు రాముని వద్దకపుడు 135

తే గీ –వినతు డనునట్టి వానరవీరవరుడు
పూర్వ దిశయంత శోధించి బొగిలియేడ్చె
రాచకార్యంబు సాధించ రాదునాకు
వట్టి చేతులతో బోవు టెట్లునాకు 136

తే గీ –రామ చంద్రుని యిల్లాలు రమణి సీత
జాడ దెలియంగ రాదయ్యె జూడ జూడ
నెంత బలమున్న నేమయ్యె నింతదనుక
గాంత వెదుకంగ లేనైతి గడకునేను 137

కం – పడమట దిక్కున కేగిన
గడుధీరుండా సుషేణ గపివరు డంతన్
బుడమి సుత జాడ దెలియక
గడు దుఃఖితు డగుచు వచ్చి గాకూత్స్థునితో 138

కం – వనములు గిరి దుర్గంబులు
జనపదముల నెల్ల వెదకి జానకి కొఱకున్
దినములు రాత్రులు సంధ్యలు
గనుగొంటిమి సీత మాకు గనపడదెందున్ ॥ 139

కం – ఉత్తర దిక్కున కేగిన
నుత్తముడా శతబలాఖ్యు డొక కపివరుడున్
జిత్తమున జింత జెందుచు
దత్తరమున భయము గదుర దరుచరు డనియెన్ ॥ 140

కం – ఏలా జెప్పుదు మయ్యా
గాలించితి గొండగుహలు గానలు నదులున్

నీలలన దొరక దెందున్
మాలావు ఫలింపలేదు మనుజాధీశా ॥ 141

గద్యము – అని భయవినయంబులతో శిరస్సులు వంచిన వారై సిగ్గుజెంది యున్న వానరులను గనుగొని రాముడు దుఃఖమున నెలుంగురాక నెట్టకేలకు వారలతో 142

కం – మీరేమి జేయగలరా
వారిజ లోచనను జూచు భాగ్యము నాకున్
దీరునెకో యెన్నడు నా
ప్రారబ్ధం బిట్టులుండె వానరులారా! ॥ 143

గద్యము – అని దుఃఖించు రాము నూరడించుచు సుగ్రీవుడు రామచంద్రా! యింకనూ హనుమంతుడు రాలేదు సీతాదేవిని దక్షిణ దిశగా రావణుడు దీసికొని పోయె నని గదా వినియున్నారము ఆంజనేయుడా దిక్కు శోధించి సీతామాత జాడలు దెలిసికొని రాగలడు సందియము లేదు 144

కం – అరివీర భయంకరుడై
యరుదెంచును వాయుతనయు డడలగ నేలా
తరు చరుడన రాదాతని
సరి వారీ జగతి లేరు సత్యము నందున్ ॥ 145

గద్యము – అని బలికిన లక్ష్మణుడును హనుమంతుడు సీతాదేవి జాడలు గనుగొని రాగలడు లేనిచో వీరివలె నతడును వచ్చియుండెడి వాడుగదా! అని రామునికి ధైర్యము జెప్పెను 146

## సీతాన్వేషణకై హనుమదాదులు దక్షిణ దిశగా నేగుట

గద్యము – దక్షిణ దిశగా బయలు దేరిన హనుమదంగద జాంబవంతాదులు వింధ్యపర్వతము బరికించి దక్షిణ దిశగా పోయిపోయి యొక నిర్జనారణ్యము ప్రవేశించిరి ఎంత మేర తిరిగినను దానికాది యంతములు గనరావయ్యె యెచటను నదిగాని కొలనుగాని గానుపింపక

ఆకలిదప్పుల తోడస్సి యొక బండరాయిపై జదికిల బడిరి

కం - ఆకలి దప్పులు తోడన్
ఆ కపులందరును మిగుల యలసి వెదకినన్
ఒకనది యైనను గానక
నకనక లాడుచును జనిరి నలుదిక్కులకున్ ॥ 146

కం - అది జూచి జాంబవంతుం
డిది యొకముని శాపమునను ఇటులయ్యె ననన్
అదియేమో యెరిగించియు
మదిలో నందియము బావుమా యని యడుగన్ ॥ 147

తే గీ - వినుడు పూర్వము కండూతి యనెడు మునియు
తనదు కొమరునితో నిందు తలగు చుండ
కానబడ లేదు తనయుడా కానయందు
దాన గోపించి యెండించె తరులనెల్ల ॥ 148

వచనం - అప్పటి నుండియుననీఅవనముజల ఫల పుష్పరహితమై భూమాయంతయెండిబీటలువారి బండరాళ్లు మాత్రమే యుండె మనము దారిదప్పి ఇందు ప్రవేశించితిమి అనగా వానరులు జలముల నరయుచు ముందునకు బోయియొక గుహాంతర్భాగము న ప్రవేశించిరి ఆ గుహలో ఎంతమేర గడచినను అవ్వల తిరమగు పడ లేదు ఆదారి యంతకంతకు చిన్నదియై అంధకార బంధురమయ్యెను అంత వారెటు బోవుటకు ఏమియు గనబడక ఒకరి చేతులొకరు బట్టుకొని ప్రాకుచు ముందునకు సాగిరి కొంతదూరమా చీకటినిజిల్చుకొనిపోవ నందు దేదీవ్యమానమైన కాంతులగ పడియముందు నొకదివ్యసౌధమును జూచిరి వారు సంతోషాంతరంగులై లోనికేగ అచ్చట రత్న రాశులు ముక్తామణులు గుట్టలుగానుండ జూచి ఆ కాంతికికారణమవియేయని నిశ్చయించి ముందుకరుగ తరు ల తాదులతోడను ఫలపుష్పంబులతోడను నిండి యున్న యొక నందనోద్యానవనమును దాని మధ్య భాగంబున శీతలజలపూరితమైయున్న సరోవరంబును జూచిరి కపు

లానందముననాజలములుద్రావబోవ ఆంజనేయుడు వారలను వారించి అచ్చట నొక తరుమూలమున తపస్సుచేసికొనుచున్న వృద్ధాంగనను జూచి నమస్కరించి తల్లీ! మేము మార్గము దప్పి యిందు ప్రవేశించితిమి ఆకలిదప్పులచే నల్లాడు చున్నాము నీసెలవైన ఈఫలజలంబులతో మాఆకలి దప్పులు దీర్చుకొందుమని వినయముగా బలికిన నాతపస్వినివారల ను జూచి సమ్మతించెను వానరులు ఆకలి దీరఫలములుదిని జలములుద్రావి సంతృప్తులై ఆమెకు నమస్కరించి తమకృతజ్ఞతలుదెలియజేసిరి అంత హనుమంతుడామెతో - మేము శ్రీ రాముని నానతిని సీతాన్వేషణ కైవచ్చి దారితప్పితిమి శ్రీరామునిపత్నియగుసీతా దేవిని రావణుడెత్తుకొని పోయెను అందులకే మేము బయలు దేరితిమి అని తన వృత్తాంతమంతయు జెప్పి నీ వెవరు ? ఇందునొంటరిగా నుంటివేల యని యడుగ నామె తన వృత్తాంతమిట్లు జెప్పెను - 149

## స్వయంప్రభ వృత్తాంతము

నాపేరు స్వయంప్రభ మేరు సావర్ణియను మహాత్ముని కుమార్తెను హేమయను నచ్చర నాప్రియ నెచ్చెలి ఆ హేమను మయుడను రాక్షసుడు ఈ భవనమున నుంచి ఆమెతో ఇష్టోపభోగంబులనుభవించుచు ఆమయుడుబ్రహ్మను గూర్చితపస్సు జేసి శిల్ప కళా విద్యను వరముగాబొంది ఈభవనమును నిర్మించి పెక్కు వత్సరములు హేమతో నిందుండెను ఇంద్రుడు మయుని సంపదను జూచి ఈర్ష్యతో హేమను దేవలోకమునకు దీసికొని పోయెను ఆ హేమ ఈసంపదనంతయునాకప్పగించి తన లోకమునకు బోయెను నేను చిన్నతనము నుండియు పరమేశ్వర దత్త చిత్తనై యుంటిని నేనును నా నెచ్చెలి హేమయు నిందు నృత్య గాన విశేషంబుల ప్రొద్దు బుచ్చెడి వారము నా చెలిదివమునకు బోయె నేనును పరమేశ్వరుని

ధ్యానింపుచు నిందుంటిని ఈగుహయందు సురాసురులైనను బ్రవేశింప జాలరు మీరు వానరులు గనుక రాగలిగిరి ఎవరైన నిందు బ్రవేశించిన ప్రాణములతో బోరాదని ఇంద్రుని శాసనము మీరుశ్రీరామునికార్యార్థులై వచ్చిరిగాన మామ్ము నా తపశ్శక్తిచే నావల జేర్చెదను కన్నులుమూసికొనుడని ఆస్వయంప్రభ నిమేషమాత్రంబున గుహ వెలుపలకు జేర్చి మీకుశుభంబగు గాక [illegible] తాను [illegible] గుహలోనికి బోయెను అంతట వానరులు [illegible] గడచెనని సంతపింపుచుండ అంగదుడు [illegible] సమయమును గూడ గురిర్తించక ఆ గుహయందు చిక్కితిమి ఇప్పుడు జూడ సుగ్రీవుడు చెప్పిన గడువు మించి పోయెను పని సాధించక గడువు మీరి జనిన సుగ్రీవుడు మనలను జంపును గానమన మిచ్చటనే బడియుందము తిరిగి ఈ గులోనికి బోయిన వలసినన్ని ఫలములను దినుచునుండవచ్చును ఈగుహలోనున్న మనల నెవ్వగును కనుగొనజాలరు వట్టి చేతులతో బోయి వాని చేతిలో చచ్చుటకంటె ఇక్కడే జీవితములు వెళ్ల బుచ్చెదమన్న అంజనేయుడంగదునితో యివియేటి మాటలు ? ఈవాన రులందరును పుత్రమిత్ర కళత్రాదు[illegible] విడచి ఎన్నాళ్లిక్కడుండగలరు సుగ్రీవుని కడకేగి జరిగిన [illegible] నంతయు దెలియజేయుదముఅతడు మనల [illegible]లజంపుచు [illegible] అంగదుడందుల కియ్యకొనక సుగ్రీవుని కడకేగిన [illegible] తప్పదు గానయిక్కడనే చచ్చెదను మీరు [illegible] నామరణవార్త నాతల్లికిదెల్పి ఆమెనూరడింపుడు అని తనుప్రాణత్యాగ [illegible]మొనర్ప సిద్ధపడెను ఇంతో నొక రెక్కలు తెగిన పక్షి పర్వతమువ[illegible] [illegible]పడియుండె దానినిజూచి వానరులుభయభ్రాంతులైరి ఆపక్షియు ఆకలితో నల్లాడుచుకదలలేకబడియుండె ఇన్నినాళ్లకు [illegible] మృగంబులు తన వద్దకువచ్చుటజూచి డేకుటూ వచ్చె[illegible] [illegible] వానరు[illegible]

## సంపాతి చరిత్ర

సీ - కైకమ్మ రాముని కానల కేలంపె ?
వసుధేశు డేల నావరములిచ్చె !
సీతమ్మతో నేల శ్రీరాముడే తెంచె
రక్కసు డేటికి రమణి గొనియె
సుగ్రీవుడేలను సుగతి వెదుకంగ
మనలనె బంపెను మంచి దనుచు
శ్రీరాము నతిజాడ జెప్పంగ లేమైతి
వేసారి పోతిమి వెదకి వెదకి !! 151

తే గీ -గడచె కాలంబు నేడింక గడువు మించె
యెందు బోయిన దండించు నేలనింక
ప్రాణముల యాశతోడను బరుగులెత్త
పక్షియాకలి దీర్చిన పరము దొరకు !! 152

వచనం - అనినిశ్చయించు కొని మాట లాడు కొనువానరులను జూచి సంపాతి ఏమీ ? మీరుశ్రీరామునికార్యార్థమై వచ్చితిరా ! ఇప్పటికినా జన్మసార్థకమయ్యెను నేను మీకొఱకే ఎదురు చూచుచుంటిని మీరు సీతామాత జాడలుదెలియక బొగులు చుంటిరా! నేనా విషయము మీకు విపులముగా నెరిగించ గలను వినుడుఅని వారల భయముదీర్చి అదిగో అదియే దక్షిణసముద్రము ఆ గిరిమీద నుండి జూచిన శతయోజనపరిమితిగల సముద్రమున కావల లంకాద్వీపముగలదు ఆ లంకను విశ్రవసుడను తపోనిధి పుత్రుండును పులస్త్యబ్రహ్మ పౌత్రుండునగు రావణబ్రహ్మయను వాడు పాలించుచున్నాడు అతడు శివభక్తిధురంధరుడు బ్రహ్మవరంబున అతులిత పరాక్రమ వంతుడును బలసంపన్నుడునై ముల్లోకములను గడగడ లాడించుచుండును అష్టదిక్పతులును వాని కనుసన్నమనలెద రు ఆరావణుడే సీతవెత్తుకొని లంకాద్వీపముఖకు బోయెననిజెప్పి ఒక్కసారి లేచి రెక్కలురుఝళిపించగనే దానిరెక్కలు తిరిగి అంటుకొనియె

అందిచూచి వానరు లాశ్చర్యము బొంది ఇరియేమి విచిత్రమన
సంపాతి వారికితన చరిత్ర జెప్పందొడగె - 153

## సంపాతి పక్షి వృత్తాంతము

మేమువైనతేయుని వంశజులము నేనును జటాయువు నన్నదమ్ములము పూర్వము నిశాకరుడనునొక మహామునిగలడు అతడు ఎనిమిది వేల వత్సరంబులు తపంబు జేసి ఆకాశగమనమున దేవలోకమునకేగుచు దిరిగివచ్చుచుండువాడు మేమిరువురము ఆ మహాత్ముని సేవించుచుండెడి వారము అయనకు మాయందమితమైన ప్రేమ ఒకసారి ఘగురువులాశ్రమమున లేని సమయంబున మా ఇరువురి లో ఎవరెంతవరకు నెగురగల మోయని పందెమువైచుకొని సూర్యమండలము వరకునెగురనాతమ్ముడగు జటాయువు ఆ వేడిమికి తట్టుకొన లేకక్రింద బడెనం నేనునింకనం పీదొ కెగిరి ఈ పర్వతమున బడితిని ఆయుష్యమునకునారెక్కలు కమిలియున్నందున ఈపర్వతము తాకిడికి విరిగిపోయెను నా యవస్థజూచి నిశాకరమహాముని - నీగర్వమువలననే నీవిట్లు శిక్షింపబడితివి శ్రీ మహావిష్ణువు రామవతారమెత్త దండ్రియానతిని దండకారణ్యమునకు వచ్చును రాము సతిని రావణు డపహరించును సతినిగానక దిరుగు రామునికి సీతజాడలు దెలియ జేసిన పుణ్యంబున నీకుతిరిగి రెక్కలు మొలచును నీ తమ్ముడును శ్రీరామునికి సహాయముజేసి ముక్తినిబొందును నీవుసీతాదేవి జాడలుదెల్పి శుభంబును బొందగలవు అనిజెప్పిరి అప్పటినుండియు నేనీ పర్వతమున బడియుంటిని నా పుత్రుడు సుపర్శుడను వాడు నిత్యము న క హారవమునుదెచ్చి పెట్టుచుండునం ఈ మధ్యనొక నడలస్యముగావచ్చి తన్నొకరాక్షసుడడ్డగించెననియు అతడొకచిన్నదాని నెతుకొని ఆకశగమనమున లంకానగరమునకు బోయెననియు ఆచిన్నది శ్రీరామునిభార్యయగు సీతయటయని చెప్పితనఆలస్యమునకు

కారణము దెలియజేసెను సీతాదేవి జాడలు దెలియ జేసినందుననే తిరిగినారెక్కలునాకు లభించెను మీమాటలను బట్టి మా తమ్ముడు జటాయు వారావణుని దెబ్బవలన మరణించినను శ్రీరామునికృపకు పాత్రుడయ్యెను శ్రీరాముడు మహావిష్ణువు రావణునిసంహరించి సీతను విడిపించును ఇప్పుడు సీత లంకలోనున్నది ఇచ్చటికితిన్నగా క్రోసుదూరమున నొక్క గిరి రాజము గలదు దానిని మహేంద్ర గిరియందురు ఆపర్వత శిఖరమునెక్కి జూచిన శతయోజన పరిమితిగల సాగరమున్నది దారికవ్వలి తీరమున సువేలా పర్వతము గలదు ఆపర్వతము నకానుకొని లంకానగరమున్నది పొయిరండుమీకు శుభమగుగాక యని వానరులను వీడ్కొలిపి తననివాసస్థానమగు హిమలయ పర్వతమునకు బోయెను 154

కం - ఆపల్కులువిని వానరు
లాపక్షేంద్రునకు మ్రొక్కి రానందమునన్
ఆపదలు గడచెనిక నా
భూపుత్రిక జూడనింక బోదము వేగన్ ॥ 155

కం - గంతులు వైచుచు వారల్
చింతలు దీరంగమనము సీతాదేవిన్
యెంతట జూతుము రామున
కెంతట దెలియంగ జేతు మీ శుభవార్తన్ ॥ 156

తే గీ - వడిగ జనుదెంచి రందరావనధి కడకు
జలచరంబులతోనిండి జలధి జూడ
నింగి నేలను గూడద్రామింగు కరణి
పొంగు చుండెనుత్తుంగత రంగములతొ ॥ 157

కం - ఆ జలధిని జూడగనే
తేజంబులు సన్నగిల్లి తీరము చెంతన్
ఆజనక జ జూడగ నిక
పోజాల మటంచు బడిరి భూమిని వారల్ ॥ 158

తే గీ - ఎట్లు దాటంగ వలె దీని నేదిదారి
ఎట్లు సీతమ్మ వద్దకు నేగ వలయు

ఎట్టి చెద [illegible] గ [illegible] దు ॥ 159

తే గీ - దీనితటు [illegible] పొధింప వలయు
దెలియ గ వ [illegible] మనబల మెల్ల నిపుడు
యోజన శతంబును ద ట యి పునెవడు
వాడు రావలె ముందుకు వానరుండు ॥ 160

గద్యము - అని తా [illegible] రా [illegible]
నేనెగురగల [illegible] గజుడును [illegible]
ముప్పదియని శరభుడును [illegible]
గంధమాధనుడును అరువదియు [illegible] డుప్పది [illegible]
దారుండును బలుక వారందరిలోవృద్ధుడును బ్రాహ్మడును [illegible]
జాంబవంతుడు తనబలముదెలియజేయుచు తానమృతమును
ద్రావినందున నింతవరకునుబ్రతికియుంటి యయ్వనమున
ఉదయాద్రినుండి అస్త్రాద్రికి నిత్యముబయనించెడి వాడను ఇప్పుడు
జవసత్వంబులుడిగి నందునబోజాలను యొకసారి కైలాస పర్వతంబున
మునులందరును బరివేష్టించి యుండ నేనును అందుంటిని అప్పుడు
బలిచక్రవర్తి కుమారుడు మహాక్రోధంబున వచ్చి యొక పర్వతమునెత్తి
మాపై బడవేసెను నేనుదానినాజానువుతోనెత్తి సముద్రమున విశరివైచితిని
అప్పుడునాకాలుభగ్నమయ్యె అప్పటినుండియు కుంటినై శిథిల
విక్రముడనైతి నేనీ సముద్రమును దాటినను దిరిగి రాజాలను
గానమనకీయాపదదాటించ గల వీరుడు ఒక్క ఆంజనేయుడు దప్ప
వేరొకరు లేరు అని ఆంజనేయుని జూచి - 161

## వానరులందరు సముద్రము దాటి లంక కేగుమని ప్రోత్సహించుట

తే గీ - ఊరకుండుట నీకిది యుచిత మగునె
నీకు నిచ్చెను ముద్రిక నిన్నునమ్మి

ఠ ము కార్యము దీర్చగ రమ్ము వేగ
మేటి వీరుడ వేనీవు దాట గలవు 162

తే గీ -వాయు నందనుగనుగొని వానరములు
యోజనశతంబు గలదు నీయుదధి జూ డ
దీని దాటంగ జాలిని దిట్టవీవె
గాన సాధింప వలయుని కార్య మీవె ॥ 163

తే గీ -జాంబవంతుడుగలడుయీ జగ[illegible]
శక్తి యుక్తులుగలిగిన జతుర ఎరుగ
వయసు చాలగ గడచే నీవయసు నంత
దాట జాలడు సంద్రమీ తరుణ మునను । 164

కం - తారా సుతు బంపిననే
తీరున సాధించగలడు తేజంబునన్
నేరుపు జాలదు వానికి
గారుణ్యము జూపినీవె కావగ వలయున్ ॥ 165

తే గీ -ఎన్ని విధముల జూచిన నేమియైన
సంబుధిని దాటజాలిన యట్టి వీరు
డిందు లేడొక్క డవనిలో నెంచి జూడ
నీకె యందర మించిన నేర్పుగలదు ॥ 166

కం - మేరు[illegible]గ దీరవరుడవు
గారవము [illegible] చంద్రు [illegible] దీర్చన్
భార మ[illegible] గడవి
యారమణిని జూచి రావె యనిల తనూజా ॥ 167

గద్యము - అని వానరులందరు హనుమంతుని గొనియాడిరి [illegible]తుడు [illegible] ఓ ఆం[illegible]నేయా! నీవు సామాన్యుండవు గావు [illegible] జాతుడవు నీయందురుద్రాంశయు వాయుబలమును గూడగలవు నిన్నుగన్నతల్లి అంజనాదేని శపగ్రస్తయైన [illegible]చ్చరకాంత [illegible] పేరుగల అప్సర సౌందర్యాతిశయమున మలంగుచు [illegible] ర్వాసుని శాపమునకుగురియై వానరకాంతగా జన్మించెను

రుద్రాంశముగలమహాబలవంతుడగు కుమారుడుదయించగలడని
దూర్వాసుడే వరమిచ్చెను ఆమె తన కామరూపబలంబున
నొకసుందరాకారము గలిగినమానవ కాంతగా గంగాతీరమున దిరుగుచుండ
వాయుదేవుడామె సౌందర్యమునకు ముగ్ధుడై ఆమెనుతాకెను
అందువలన వాయుదేవుని తేజమున నీవు ఆమెగర్భంబునజనించితివి
అంజనాదేవిని పెండ్లాడిన కేసరియు సామాన్యుడుగాడు ఒకానొకప్పుడు
శంబ శబలఅనురెండురాక్షస గజములను సంహరించి భరద్వాజాది
మునులకు రక్షణ గలిగించెను అందులకామునివరులు కేసరియను
బిరుదునిచ్చి మహాబలవంతుడును వాయువేగమును గల్గిన
దైవాంశసంభూతుడు నీకుకుమారుడగునని వరమిచ్చిరి నీవా కేసరికి
ఔరసపుత్రుడవు అంజనాదేవి గర్భంబున జన్మించితివి గాన
నీవాంజనేయుడవైతివి బాల్యముననే సూర్యుడొక పండని
భ్రమించిమ్రింగబోతివి దాననిహనుమ భగ్నమయ్యె దాన నీవు
హనుమంతుడ వైతివి వాయుతేజంబున బుట్టితివి గాన
వాయునందనుడనబరగితివి బాల్యమునుండియు అసమాన బలుడవై
దిరుగుచుండ ఎఱిగడంబుల కలిగి నీశక్తి నిద్రాణమైయుండుననియు
మరియొకరిప్రేరణలేనిచో నీబలము నీకెరుకరాగూడదనియు కొందరు
మునులు నీ బలతేజంబుల నరకట్టిరి దానంజేస నీబలము
నీవెరుగలేకున్నావు నీవు అసమానతేజో పరాక్రమములుగల్గిన
మహాబలవంతుడవు 168

కం - సులభము యీపని నీకున్
గలుగదు విఘ్నంబు నెపుడు కపివర వినుమా
బలమందు సాటి యెవ్వరు
ఇల లో న న్నీకసాధ్య మన్నది గలదే! ॥ 169

కం - కావున నీవే యిప్పుడు
పోవలయును జలధిదాటి భూమిజ జూడన్
దేవలయు సీత జాడలు
గావింపుము సంతసంబు కాకుత్స్థునకున్॥ 170

గద్యము – అనిఆంజనేయుని కొనియాడి కార్యోన్ముఖుని గావించెను
ఇదిఆత్రేయగోత్రోద్భవులును ఆర్వేలనియోగి బ్రాహ్మణులును చాగంటివంశీయులునగు జోగిరాజుగారి ధర్మపత్నియు శివభక్తిదురంధరురాలును శ్రీవామలింగేశ్వర చరిత్ర మను కావ్యకృతికర్త్రియు నగు గౌరీదేవి విరచితంబగు గౌరీరామాయణము నందలి కిష్కింధాకాండము సంపూర్ణము

వాగంటి గౌరిదేవి

గ్రేడ్ I హిందీ పండిట్ (రిటైర్డ్)
R C M హైస్కూలు
వెగబోడ్డపల్లి వయా నర్సీపట్నం
విశాఖపట్నం జిల్లా.